శ్రీరస్తు.

శ్రీమద్భట్టపరాశరదేశికేంద్రచరణసరసీరుహాసేవకోపసేవకుండగు

శ్రీనరసింహామహాకవిచే

రచియింపఁబడిన

# కవికర్ణరసాయనము

అనుకావ్యరత్నము.

ఇది

పండితులచే

పరిష్కరింపఁబడి

శ్రీమత్పువ్వాడాన్వయపయఃపారావార రాకాసుధా

## వేంకటరావుపంతులు

స్వకీయ వర్తమానతరంగిణీముద్రాక్షరశాలయ

ముద్రింపించి

ప్రకటింపంబడియె.

1885 సంll జూలై నెల.

శ్రీ

శ్రీహయగ్రీవాయనమః

# కవికర్ణరసాయనము.

## ప్రథమాశ్వాసము.

శ్రీరామావసుధాపయోధరములం జేదోయి రెంటన్ సమ | ప్రారంభంబునఁ
జిత్రభంగిమకరీపత్త్రాంకముల్ వ్రాసిని | ర్వైరప్రేమలనిద్ధలందుసమసారస్యం
బునం దేలునా | శ్రీరంగేశుఁడు మమ్ము నిర్మలసుఖశ్రీయుక్తులం జేయుతన్ ‖ ౧ ‖ చ ‖
పొలయలుకన్ జపంబునకుఁ బూనుకనుం గవలెల్ల మోడ్చియుం | దలఁపున మంత్రవ
ర్ణమయతం గనుపట్టిన వాణిఁ జూచిన | వ్వాలయఁ గవుంగిలించి సుసుఖోన్నతిఁ జెం
దెడు విశ్వతోముఖుం | డెలమిదలిర్ప మత్కృతికి నీవుత విశ్వజనాభిముఖ్యమున్ ‖ ౩ ‖
మ ‖ ముకుటాగ్రస్థితచంద్రచంద్రికసదాముంపం బ్రభావంబెలుం | గకశశ్వత్ప
రిరంభణావితతసౌఖ్యస్నిగ్ధుఁడై జాయఁ బా | యకలీలాపరుఁడైన శంకరుఁడు నిత్య
ప్రీతిసంధించుతన్ | సకలాహ్లాదముగా మదీయకృతికిన్ బ్రాద్ధదాంపత్యమున్ ‖ ౪ ‖
మ ‖ ననుమన్నింపుము నీకు మామయగు మైనాకంబు నాకాధినా | థునిప్రోలంబ
డునంచుఁ బార్వతి వియద్ధూతాకారమున్మాన్చినం | దనతుండంబునఁ బిల్చియున్నజ
లధిం దాఁ గ్రమ్మఱం గ్రుమ్మరిం | చినశుండాలముఖుండు మామకకృతిశ్రీకిచ్చు నిర్వి
ఘ్నతన్ ‖ ౫ ‖ శా ‖ కాసారంబులు సాహిణంబులు సరిత్కాంతుండు ప్రాఁదోఁటవి |
ద్యాసీమంబులు రచ్చపట్లు సురకాంతాలోకసీమంతభూ | షాసిందూరము పాద
లాక్షయగు భాషాదేవిమత్ప్రార్థజి | హ్వాసింహాసనమూనుఁగాతఁ గృతియుక్తా
లంక్రియాహంక్రియన్ ‖ ౬ ‖ వ ‖ అని యభీష్టఫలప్రదపరమపురుషప్రార్థనం
బును గావ్యసాధారణలక్షణోపస్థాపనాభిప్రాయంబున నితరోచితదేవతానిరూ
పణంబునుం గావించి ‖ ౭ ‖ క ‖ గురువరభట్టపరాశర | చరణసరోరుహసము
ల్లసన్మానసుఁడన్ | నరసింహనామధేయుఁడఁ | బరిచితసత్కృతిరసానుభవ
హేతువునన్ ‖ ౮ ‖ చ ‖ మనమునఁ గొన్న నెవ్వగలు మాన్పి ఘటింతురు కావ్యస
మ్మదం | బనఘకథాముఖంబున హితాహితబోధ మొనర్తురింపుగాఁ | గనుఁగొ
నుకం బెనద్భుతముగా నెఱిఁగింతురతీంద్రియార్థముల్ | ఘనమతులెల్లవారికిన
కారణబంధులుగా రెసత్కవుల్ ‖ ౯ ‖ వ ‖ అందున ‖ ౧౦ ‖ గీ ‖ కావ్యము
త్పాద్యమైన సత్కావ్యమింక | నుక్తకావ్యంబయే పునరుక్తిఁ దెచ్చుఁ | గానఁ గవి
తాభిముఖుఁడైన కవివరునకు | మిశ్రకావ్యంబె కావ్యమై మెఱుఁగుఁ దెచ్చు ‖ ౧౧ ‖
క ‖ నేరిచిన సుకవికృతిచేఁ | బేరెఱిఁగించుకొని జగతిఁ బెంపగుటొప్పున్ | నేర

కకృతిఁజెప్పుటదన । నేరమియపకీర్తిజగతినిలుపుటగాదే ॥ ౧౨ ॥ క॥ పరసముఁజె
ప్పఁబూనిన । నారసమాలించువారికడరింపనియా । నీరసపుఁగావ్యశవముల ।
దూరముననపరిహరింపుదురునీతిజ్ఞుల్ ॥ ౧౩ ॥ చ ॥ ఫణితులు రెంటమూఁటనొకప
ద్యముగూగుచువారులక్ష్యల । క్షణసహకావ్యనిర్వహతగల్గుటచిత్రముగానియట్ల
షో। ఫణిమణిమాత్రధారులగుపాములసంఖ్యముగాకతత్ఫణా । మణివిధవిశ్వభూ
భృతిసమర్థుఁడు శేషుఁడుగాకకల్గునే ॥ ౧౪ ॥ క ॥ ఆకులనెయుండుకవితా । పాక
ములనె మొదలుచెడినప్రాఁదప్పులయా । లోకముజిహ్వాచలముల । యాకులుగా
కుండునెవ్వియవి[illegible]కవితల్ ॥ ౧౫ ॥ క॥ పరభుక్తములైనయలం । కరణములజూగు
ప్సలేకనైకొనిపదవి । స్ఫురణంబుచూపుకుకవిత । పరికింపఁగలజ్జలేనిబానిసగా
దే ॥ ౧౬ ॥ ఉ ॥ సాంతముగాఁగశబ్దహృదయజ్ఞులుగారుచిత్రప్రయోక్తలై । విం
తలుగాఁబ్రబంధములవీథులుద్రొక్కఁగలేరుశక్తులై । దొంతరజల్లిబొంత వెడదూ
ర్చిగతార్థముకూర్చుదుష్కవి । భ్రాంతులసందడిందడవఁబాసెరసజ్ఞులకుంగవిత్వ
ముల్ ॥ ౧౭ ॥ క ॥ కలకంఠకలనచూపక । కలకంఠంబూరకున్నఁగాకమకాదే।
కలితనిజవాగ్విలాసం । బలరింపనితజ్జ్ఞుఁడైననజ్ఞుండగుటన్ ॥౧౮॥చ ॥ హృదయగ
తింబురాతనకవీశ్వరులేగనివీథిలేదునేఁ। దదనుమతిన్ రచించుకృతితాత్త్వికులంగ
రఁగింపకుండునే । మదగజరాజముల్చనినమార్గములంగడునింపునింపవే । మ
దగజరాజయానమదమంథరబంధురయానమానముల్ ॥ ౧౯ ॥ చ ॥ ఖలుఁడి
లఁదప్పులే వెదకుఁగావ్యరసానుభవంబుసేయఁతేఁ । డొలుకులుకోరుఁగాక ముద
మూనఁగగర్దభమొంద నేర్చునే।మలయమరుద్విధూతమధుమాసవికస్వరకేసరా
వళీ । గళితపరాగయోగపరికల్పితపేశలతల్పసౌఖ్యముల్ ॥ ౨౦ ॥ క ॥ ఎల్లరు
మెచ్చనిమతకృతి । నుల్లంబునమెచ్చఁగాకయొకఁడుష్ట్రకులం । బొల్లనిపల్లవి
తాగ్రము । గొల్లలుగాఁబొగడనొక్కకోయిలలేదే ॥ ౨౧ ॥ గీ ॥ తప్పుగల్గెనేని
తారతీర్చిరసజ్ఞు । లస్మదీయకవితననుమతింతు । రించుటలుకగలిగెనేఁదీర్చిప్రేయ
సి। నుల్లమునవరింపకోర్తురెట్లు ॥ ౨౨ ॥ గీ ॥ యతివిటుఁడుగాకపోవుటెట్లస్మదీయ।
కావ్యశృంగారవర్ణనాకర్ణనమున । విటుఁడుయతిగాకపోరాదువెసమదీయ। కా
వ్యవైరాగ్యవర్ణనాకర్ణనమున ॥ ౨౩ ॥ వ ॥ అని వితర్కపూర్వకంబుగా నపూ
ర్వవిరచనాచాతుర్యంబు నెఱియ మెఱియ నన్వర్థనామంబుగాఁగవికర్ణరసాయనఁ
బన నొక్కకావ్యంబురచియింపనున్ముఖుండనై యనుకూలనాయకాన్వేషణపరా
యణాయత్తంబైనచిత్తంబున॥౨౪॥ సీ॥ ఆందోళికలయందునంతరచరులైనసవికృ
తాకృతులఁబిశాచజనులు। పరకరాళంబులై ప్రార్థింపఁగనుఁగొకవాయెత్తకుండు
జీవచ్ఛవములు । వాలవీజనములఁద్రాలుచునీఁగకునంటినిఖరవర్తులాండసములు
వేత్రపరంపరావిలకంటకాకృతిఁజేరఁబోరానిబర్బ్బరతరులు। శంఖనాగస్వరస్వ

రశ్రవణసమద । విస్ఫుటచ్ఛత్రవిస్ఫారితస్ఫటాక । విష్టవిష్వక్సేనవశవర్తిదుష్టఫణులు । ప్రభుదురాత్ములనేవ్వాఁడుప్రస్తుతించు ॥ ౨౫॥ అదియునుం గాక ॥౨౬॥ గీ॥ నరగుణాంకితమయ్యోనేసరసకృతియు।దూష్యమగుశునిధృతగతదుగ్ధమట్లు।హరిగుణాంకితమయ్యోనేనసమకృతియు । హారసూత్రంబుగతిహృదయంగమంబు॥౨౭॥ సీ॥ జగదేకపతియయ్యుసకలాభిగమ్యుండు సర్వశాసకుఁడయ్యుసదయహృదయుఁ । డఖిమతప్రదుఁడయ్యునంజలిసాధ్యుండు పరిపూర్ణుఁడయ్యునుబ్రణతికాముఁ । డతిగతేంద్రియుఁడయ్యునమిషదృగ్దృశ్యుఁడనిరోజ్యుఁడయ్యుభక్తానుయాయి । సాక్షియయ్యునుతాపచారానభిజ్ఞుండుసముఁడయ్యునార్తరక్షాపరుండు । భద్రగుణనిధిదుర్గుణప్రతిభటుండు । సముఁడునధికుండు లేనియుత్తమపురుషుఁడు । వెదకిచూచినశ్రీరంగవిభునివంటి । ప్రభువునత్యంతసులభుండుప్రభువుగలఁడె॥ ౨౮ ॥శా॥జ్ఞానప్రౌఢమహాకవీశ్వరవచస్సంస్తూయమానుండుల।క్ష్మీనాథుండుమదల్పవాక్యరచనాస్వీకర్తగాకుండునే । నానాభూపతులెల్లఁగానుకలురత్నశ్రేణులర్పింపఁగా । దానాముష్టిముచుంగుచేలుఁగరుణాధన్యాత్ముఁగాఁజూడఁడే ॥ ౨౯ ॥ వ ॥ అనిసకలలోకనాయకుండైనశ్రీరంగనాయకుండాకృతినాయకుండుగానిశ్చయించి మొదలంగృతి ముఖాలంకారంబుగాఁగృతినాయకుదివ్యావతారక్రమంబభివర్ణించెద ॥ ౩౦ ॥ సీ ॥ మున్నుకల్పాదినంభోజనాభునినాభినలినగర్భంబుననలువపుట్టి । యఖిలైకమూలంబులైనవేదంబులనతనికృపాబ్ధినధిగమించి । శబ్దానుసారియైజగమెల్లసృజియించిపరికించియింద్రాదిపదములెల్ల। నాత్మాధికారంబునస్థిరంబనికాంచినిర్విణ్ణుఁడైమోక్షనిత్యసుఖము। పరమపురుషప్రసాదసంప్రాప్యమనియుఁ । దత్ప్రసాదంబుతత్పదద్వంద్వభజన । సాధ్యమగుటయువేదాంతసరణినెఱిఁగి । తపముగావించెదుగ్ధాబ్ధితటమునందు ॥౩౧॥ ఉ ॥ మెచ్చిరమావిభుండునుసమీపమునందొకకచ్ఛపాకృతిన్ । వచ్చివరంబువేఁడుమనవారిజగర్భుఁడుమ్రొక్కి-కోరె-నా। కిచ్చెదవేనిఁజూపుపరమేశ్వరనీదగుదివ్యవిగ్రహం । బచ్చుగమత్స్యకచ్ఛపముఖాకృతులన్నియుభూతపూర్వముల్ ॥ ౩౨ ॥ గీ ॥ ఎద్దినైసర్గికమునీకునెద్దిపరము । మెద్దిగోప్యంబుశాశ్వతంబెన్నెయెద్ది । దివ్యమఖిలేశయుపనిషద్వేద్యమెద్ది । యట్టిరూపంబుచూపికృతార్థుఁజేయు ॥ ౩౩ ॥ చ॥ అనవినికంజగర్భభవదర్థితరూపముముక్తలోకజీ । వనమదిచూడఁజెల్లదుభవాదృశబద్ధులకుంగృపానిబం । ధనమతిఁజూపువాఁడనవతారముఖంబుననట్టిదీనిఁగ । న్గొననధికారివీవగుటకుంగొను మిచ్చెదమూలమంత్రమున్ ॥౩౪॥వ॥ అనియనుగ్రహాతిశయంబున నపవర్గఘంటాపథంబగు శ్రీమదష్టాక్షరీమంత్రంబును దదనుష్ఠానంబునుం దదర్థస్వరూపంబును దదనుభావంబునుదద్విషయనిజనిరతిశయ ప్రియభావంబునుం దేటపడ నానతియిచ్చి కపటకచ్ఛపం

బంతర్ధానంబు నొందినం బరమేష్ఠియు నుక్తమంత్రానుష్ఠాననిష్ఠాపటిష్ఠుండై చిర
కాలంబు తపంబు సేయం దత్తపఃఫలరూపంబై సకలజగదద్భుతావహంబుగా దుగ్ధ
మహార్ణవమధ్యంబున ॥ ౩౫ ॥ సీ ॥ భుజగాధిపతిధృతస్ఫురదాతపత్రంబు చం
ద్రార్కకరచలచ్చామరంబు । సూత్రవతీభర్తృవేత్రపాణియుతంబు విహగ
రాజస్కంధవిలసితంబు । నందసునందాదినానాభుజిష్యంబు గంధర్వకిన్నరీ
గాయకంబు । సనకసనందాది జయశబ్దముఖరంబు సిద్ధసాధ్యగణాధి సేవితం
బు । విశ్వతఃకల్పతరుపుష్పవృష్టికంబు । దేవదుందుభిరవదళద్దిక్తటంబు । భూ
రితేజోమయంబునై పొడమి పొలిచె । రంగధామంబు జగదేకమంగళంబు ॥ ౩౬ ॥
క ॥ అపుడు భయాద్భుతహర్ష । స్ఫుటితమతికిచ్చపడిన చతురాననుపైఁ । గృప
డగ్గలవచ్చి రమా । ధిపభటుఁడు సునందుఁ డతనిఁ దెలుపుచుఁ బలికెన్ ॥ ౩౭ ॥ గీ ॥
నలినసంభవ శ్రీరంగనామకలిత । మీవిమానంబు ప్రణవంబు సూవె యిందుఁ ।
బ్రణవవాచ్యార్థమిందిరారమణుఁ డున్న । వాఁడు నినుఁ బ్రీతుఁ జేయంగ వచ్చె ని
ట్లు ॥ ౩౮ ॥ క ॥ నలుదెసలఁ జాఁగి మ్రొక్కుచు । నలుమాఱు ప్రదక్షిణములొ
నర్చి చిరతపః । ఫలమగు శ్రీరంగేశ్వరు । జలజజ సేవింపు మోక్షసాత్కృతిగలు
గున్ ॥ ౩౯ ॥ వ ॥ అని యాదేశింపం బ్రమోదంబు నలుమడింపఁ జతుర్ము
ఖుండును జతుర్ముఖప్రణామసలక్షణంబులగు చతుఃప్రదక్షిణంబులు నాచరిం
చి శ్రీరంగ దివ్య విమాన గర్భంబున ॥ ౪౦ ॥ సీ ॥ దక్షిణహస్తోపధానవిధ
నుఁడై వలప్రక్కగా నెత్తగిలినవాని । నాజానుదీర్ఘత్వమఖిలవేద్యంబుగా నె
డమబాహువు సాఁగనిడినవాని । నాకుంచితోత్కుంచి తాగ్రజానుకమ్ములై యుం
డ నంఘ్రులు సాఁచియున్నవాని । నాకస్మికస్మితవ్యాకోచలోచన యుగకోణము
లఁ గృప యొలుకువాని । జలధిని శ్శేషభూషణ శ్రమహిమాచ । లాగ్రవి
శ్రాంతనవమేఘమనఁగ శేష । శయనశయుఁడైన కోమలశ్యామలాంగు । రంగప
తిఁ గాంచె భారతీరమణుఁ డపుడు ॥ ౪౧ ॥ క ॥ ఘనతరహర్షాంబుధిలో । మునిఁ
గి మునిఁగి తేలుచందమున భక్తిఁ బునః । పునరానతుఁడై చతురా । ననములనుతి
యింపరంగనాయకుఁ డనియెన్ ॥ ౪౨ ॥ గీ ॥ పద్మసద్మభవత్తపఃఫలమనగుచు
నవతరించితి నిట్లు నీ స్తవమువలనఁ । దుష్టహృదయుండనైతి నభీష్టమెద్ది । వేఁడుకో
నుమన్న భారతీవిభుఁడు పొంగి ॥ ౪౩ ॥ క ॥ అవలోకనార్హమగునీ । యవత
రంబున నా కనుదినము నుబ్రత్యవసరపూజావిషయత । నివసింపు గృహార్చవగుఁ
చు నిత్యమున నుదుర్ ॥ ౪౪ ॥ సీ ॥ ఎలనవ్వొలర్పనీతలఁ బెఱింగియ దివ్యభవనంబుఁ
డనిట్లవతరించి నాఁడ నింకిటమీఁద నవతరింపఁగఁ బూనునర్చాకృతుల కెల్ల నాద్యమిది
యు । యర్థింపు మీ స్వయంవ్యక్తవిగ్రహమున న్నుగృహదైవతంబ కానహరహంబు ।
పాంచరాత్రవిధానపరుఁడవై ద్విపరార్ధకాలాంతమున ముక్తిఁ గాంతువనిన । ధాత

చరితార్థుఁడైరంగధాము నాత్మ । భువనమునయందు విరజాఖ్యఁబొలుచునేటి । తీ
రభూమిఁబ్రతిష్ఠించి దినదినంబు । యుక్తవిధిఁబూజసేయుచునుండునంత ॥ ౪౫ ॥
క॥ ధరపైనిక్ష్వాకునరే । శ్వరుఁడనఁగా వైష్ణవాగ్రసరుఁడఖిలశ్రీ । విరతమతిమో
క్షసాధన । పరుఁడై చింతించు నాత్మభావములోనన్ ॥౪౬॥ గీ॥ తండ్రి వైవస్వతుండు
మాతాతరవియు । ఘనులుగావున బ్రహ్మలోకమునకేగి । యచటరంగేశుఁగొ
లిచిమోక్షార్హులైరి । మందసుకృతికి నాకంతమహిమగలదె ॥ ౪౭ ॥ క ॥ నా
దుతపంబునఁగలిగెం । గాదేయనిరంగపతినొకండయవిధికిం । గాదనుభవింప
నేక । స్వాదునభుంజీతయనెడుసామెతవినఁడే ॥ ౪౮ ॥ మ ॥ అపవర్గప్రద
మైనరంగముమహాయాసంబుచేఁగాంచియుం । గృపలేకేరికిఁగానియాత్మపురిని
క్షేపించుకొన్నాఁడహో । కపటాత్ముండు విధాత నేనఖిలలోకప్రాప్తుఁడై
మర్త్యవి । ష్టపసంస్థుండు గరంగవల్లభుఁదపస్సంప్రీతునింజేసెదన్ ॥ ౪౯ ॥
క ॥ అనినిష్ఠురనిష్ఠఁదపం । బొనరింపనజుండెఱింగియులుకునదీనా । ననుఁడైత
నసన్నిధినది । వినుపించినఁజూచిరంగవిభుఁడిట్లనియెన్ ॥ ౫౦ ॥ సీ ॥ కలది
లకేగుసంకల్పంబుమాకిందుఁబరితపింప కవినుపద్మగర్భ । సాకేతనగరినైక్ష్వా
కులచేమహాయుగచతుష్కము పూజ నొందిపిదపఁ । గావేరిఁజంద్రపుష్కరిణీ
తటంబున సప్తమన్వంతరస్థాయినగుదుఁ । దావకవాసరాంతమునఁగ్రమ్మఱవ
చ్చిపొందుదునీచేతఁబూజలిచట । నహరహంబునునిట్లుగతాగతములఁజేసిరెండు
పరార్థముల్ చెల్లినపుడు । నీకునపవర్గమేఁగరుణించిపోదు । ధామమును నేను నా
పరవ్యోమమునకు ॥ ౫౧ ॥ ఉ ॥ నీకుఁద్రికాలపూజనమునిచ్చలుదప్పకచొప్పడు
న్మహీలోకజనంబునన్మదవలోకనగోచరమైకృతార్థతన్ । గైకొనఁగానమాత
లఁపుగాదనకిప్పుడయిమ్మునన్నని । క్ష్వాకునకన్నెనొండనఁగవారిజగర్భుఁడుమో
డిప్రీతుఁడై ॥ ౫౨ ॥ వ ॥ హంసవాహనారూఢుండై యింద్రాదిబృందారకవ
ర్గంబునుం దానును దుందుభిరవములు గ్రందుకొన గరుడస్యందబంధురంబైన శ్రీ
రంగదివ్యవిమానంబు భూలోకంబునకుంగొనివచ్చి యిక్ష్వాకుమహీనాథునకర్పిం
చినం గృతార్థుండై యమ్మహాభుజుండును నిజతపఃఫలంబును జగజ్జనభాగధేయం
బునగు నమ్మహాదివ్యభవనంబుమకుటాలంకారంబుగా మస్తకాగ్రంబున వహిం
చిమహోత్సవోత్సేకంబై పౌరలోకంబెదురుకొన నయోధ్యాపట్టణోత్తరది
శనర్థక్రోశంబునఁ దమసాసరయూమధ్య మనోహరప్రదేశంబున నయోధ్యాము
ఖంబుగా నుక్తవిధింబ్రతిష్ఠించి కాంచనమణిమయగోపుర ప్రాసాదమండపాది
నిర్మాణంబుల గ్రామగజతురంగ దాసదాసీరథ ఛత్రచామరాద్యుచితోపకరణస
మర్పణంబుల నిత్యనైమిత్తికాది మహోత్సవాచరణంబుల యావజ్జీవంబున
సాధారణంబుగా భగవదారాధనంబొనరించెఁదదనంతరంబునఁదద్వంశ సంభ

వులగు కకుత్స్థరఘుదిలీపప్రముఖమహీపాలకోత్తములు సత్తమోత్తమభావంబుల రంగధామ సమర్చనంబుగావింపం గ్రమంబున మహాయుగ చతుష్టయంబు చనం బంచమ త్రేతాయుగకాలంబున ॥ ౫౩ ॥ సీ ॥ దశరథధారుణీధవుఁడు పుత్రార్థియై యశ్వమేధము సేయు నవసరమున । నిలఁగలనృపలోకమెల్ల నేతెంచుట నంమలోఁజోళదేశాధిభర్త । ధర్మవర్మాఖ్యుఁడాదశరథైశ్వర్యంబు రంగధామార్చనక్రమముఁజూచి । యిక్ష్వాకుకులమున కిహపరైశ్వర్యంబు లెపుడు రంగేశునికృపనె కాదె । ధాతసంగతినిక్ష్వాకు రీతిఁగాంతుఁ । దపముచే నేను శ్రీరంగధామమనుచుఁ । దలఁచియజ్ఞాంతమునధరాధవులయట్ల । పూజితుండ యియాత్మీయపురికినరిగి ॥ ౫౪ ॥ గీ ॥ చంద్రపుష్కరిణీతీరసంస్థుఁడగుచుఁ । దపమునకుఁబూననచ్చటి తపసులతని । తపము వారించిశ్రీరంగధామమిటకుఁ । దానచను దెంచువినుముతత్కారణమును ॥ ౫౫ ॥ క ॥ ఇటకునుదద్దిశ నేత । త్తటినీతటియందుఁగలదు దాల్భ్యాశ్రమము । చ్చటమున్నిష్టకథాలం । పటమతిదాల్భ్యుండు మేము భాషింపంగన్ ॥ ౫౬ ॥ గీ ॥ ప్రాంతనీపవనీస్థితవ్యాఘ్ర దనుజుఁ । గూల్చిభగవంతుఁడమరులుగొలువనచటి । కరుగుదేరఁబ్రణామార్చనాభినుతులఁ । బ్రీతుఁగావించివరముగోరితిమి నేము ॥ ౫౭ ॥ గీ ॥ అహరహంబునిచట నర్చనాదులచేత । నినుభజింపవలయునిత్యసన్ని । ధానమిచటమాకుదయ సేయుమనిన । దయార్ద్ర హృదయుఁడగుచునిట్టులానతిచ్చె ॥ ౫౮ ॥ మ ॥ హరిదశ్వాన్వయమందుదాశరథినైయస్మత్పదాంభోజత । త్పరుఁడైయుండువిభీషణాఖ్యునకుమద్ధామంబుశ్రీరంగమే । కరుణాధీనతనీనతండుగొనిరాఁగావేరిలోఁజంద్రపు । ష్కరిణీతీరమునందుఁగ్రైకొనియెదంగల్పావధిస్థైర్యమున్ ॥ ౫౯ ॥ గీ ॥ రంగదివ్యవిమానగర్భమున శేష । శయనశయునన్భజింపుఁడుసంతతంబు । ననియొఱంగించిచన నేమునసురమథనుఁ । గొలిచియేగితిమర్కమండలముదనుక ॥ ౬౦ ॥ క ॥ చనిక్రమ్మఱియెదుమముఁగనుఁ । గొనిమీకులకందమైనకోకనదాప్తుం । డనియెమునులారయిందఱు । వినుఁడే నెఱిఁగింతుఁబూర్వవృత్తాంతంబున్ ॥ ౬౧ ॥ సీ ॥ బ్రహ్మలోకమునశ్రీరంగేశు నేనుపాసించి వేఁడితినినా చేతియట్ల । మద్వంశభవులైనమనుజనాయకులచేనర్చితుండుగవిభుఁడట్లయియ్యెఁ । గొనివచ్చియిక్ష్వాకుకులులచేనిన్నాళ్లయోధ్యయందుసపర్యనొందెనింక । నస్మత్కులీనులయనిధర్మవర్మాదులగు చోళనృపులచేనర్చితుఁడుగఁ । బోవుఁగావేరిలోఁజంద్రపుష్కరిణికిఁ । గానఁజనునది మోక్షార్థులైనజనము । లచటశ్రీరంగపతిఁగొల్వననినవచ్చి । నాఁటనుండియు నేమునున్నారమిచట ॥ ౬౨ ॥ చ ॥ దశరథరాముఁడైపొడమెదైత్యవిభేదియురంగధామమున్ । దశవదనానుజుండటకుఁదథ్యమకాకొనివచ్చివచ్చినన్ । భృశముగనీకు మేమువినుపించినదాఁకఁదపంబు చేవృథా । కృశుఁడవుగాకనెమ్మదిసుఖం

పుమహీపరిపాలకుండవై ॥ ౬౩ ॥ వ ॥ అనియాదేశించినం బ్రహృష్టహృదయుం
డై ధర్మవర్మయుం గ్రమ్మఱి తదుపాంత కావేరీ దక్షిణతీరస్థితంబైన నిచుళానా
మనిజపురంబునకుం జని రంగధామసమాగమప్రతీక్షాపరుండై రాజ్యంబు సేయు
చుండఁ గొండొకకాలంబున ॥ ౬౪ ॥ ఉ ॥ రావణుఁ గూల్చి వచ్చి రఘురాముఁ
డు దాహయమేధదీక్షితుం । డై వసుధేశులం బిలువనంపినఁ దాను నయోధ్యకేగి
చో । భావనిభర్త రాజసభయందు విభీషణుఁ గాంచి సమ్మదం । బావహిలన్మ
ఖాంతమున నర్చితుఁడై చను దెంచెఁ గ్రమ్మఱన్ ॥ ౬౫ ॥ క ॥ వచ్చి విభీషణుఁ
డిదిగో । దెచ్చెన్ శ్రీరంగధామదివ్యవిమానం । బిచ్చటి కనునిశ్చయమున । హె
చ్చిన హర్షమునఁ గృతసమీహితబుద్ధిన్ ॥ ౬౬ ॥ వ ॥ రాక్షసేశ్వరుండైన విభీ
షణు నాతిథ్యంబునను ఖిలలోకేశ్వరుండైన శ్రీరంగపతిసమర్చనంబునకుం దగినట్లు
గానుచితవివిధప్రశస్తవస్తూపకరణ సామగ్రిసంపత్సంపాదనంబు చేసికొని విభీష
ణాగమనంబునకు నెదురెదురు చూచుచుండు నంత ॥ ౬౭ ॥ సీ ॥ అటనయోధ్యాపురి
యందు శ్రీరఘురాముఁ డాత్మోపకర్తయు నతిహితుండు । నగు విభీషణు లంకకనుపు న
ప్పుడనుగ్రహాతిరేకమున నిజాన్వయైక । జీవధనంబైన శ్రీరంగధామంబు సపరిచ్ఛ
దంబును సపరిజనము । గానొసంగుటయు నా దానవాధిపుఁడు కృతార్థుఁడై ధరణి
సాష్టాంగమెఱఁగి । మస్తకంబున ధరియించి మంత్రివరులుఁ । దానభోవీథిలం
కకుదక్షిణాభి । ముఖముగాఁ గడు ముదమున మోచి తెచ్చు । వేళ నడుమ నమ
ధ్యాహ్నకాలమైన ॥ ౬౮ ॥ గీ ॥ తత్సమయపూజనము సేయఁదలఁపు వొ
డమి । మహికిడిగ్గి మరుద్వృతామధ్యమహిత । చంద్రపుష్కరిణీసరస్తటము
నందు । దనుజపతినిల్పె శ్రీరంగధామ మపుడు ॥ ౬౯ ॥ మ ॥ కనియచ్చో
మును లద్భుతప్రమదమగ్నస్వాంతులై చోళభూ । జనభర్త న్వినుపింపవచ్చి
సలిపెన్ సంప్రీతి నాతిథ్యమున్ । దనుజేంద్రుండును రంగధామునకు నుక్త
ప్రక్రియం జేసెన । మ్మనుజాధీశకృతోపచారములచే మధ్యాహ్నకాలార్చన
ల్ ॥ ౭౦ ॥ గీ ॥ తానుమునులును శ్రీరంగధాముఁ గాంచి । చిరమనోరథసిద్ధి
కిఁ జిత్తమలరఁ । జోళభూభర్త యొకకొంతగాలమిచట । దనుజవర నిల్పుమని
వేఁడుకొననతండు ॥ ౭౧ ॥ ఉ ॥ నైకటికంబు ఫాల్గునమునన్నరనాయక రంగ
భర్తకి । బ్రహ్మకృతోత్సవంబగుటఁ జయ్యన లంక కుఁబోవుటొప్పునా । నీకిదిలం
కగాదె శుభనిష్ఠఁ దదుత్సవలక్ష్మినిచ్చటం । జేకొని రంగభర్తఁ గృప సేయుఁ గృతార్థ
తమాకనీదయన్ ॥ ౭౨ ॥ క ॥ అని వేఁడి యమ్మహాత్ముని । యనుమతిఁ గొని
హృష్టహృదయుఁడై చిరకాలో । పనతనిజయత్నఫలముగ । నెనరించెం దన్మ
హోత్సవోపక్రియలన్ ॥ ౭౩ ॥ సీ ॥ నవ్యనైకసమగ్రదివ్యభోగములచే రా
గమగ్నుండయ్యె రంగభర్త । సవినయపరవస్తుసత్కారముల చేతఁ బ్రీతాత్ముఁడ

య్యెవిభీషణుండు । అర్ఘ్యపాద్యప్రభృత్యర్హార్పణములచేఁబ్రముదితంబయ్యెఁద
పస్వికులము । మృష్టాన్నసత్త్రాద్యభీష్టదానములచే సంతుష్టిఁబొందిరిసకలజను
లు । నవభృథముసేయజగముకృతార్థమయ్యెఁ। బూతమతిఫాల్గునంబునంబుబ్బతో
డఁగి। ధర్మవర్మాఖ్యుఁడగుచోళధరణిధవుఁడు । తగనొనర్చునవాహ్నికోత్సవమున
పుడు ॥ ౨౪॥క॥ ఈగతిఁబ్రతిదినవనవ। భోగమునఁబదేను నాళ్లువోవఁబ్రయాణో।
ద్యోగమునన్నృపునిఁసిలిపిమ। నోగతిఁబోలుచువిభీషణుఁడుగృతనతియై ॥ ౨౫॥ ఎత్తఁ
జూచినశ్రీరంగమెగసిరాక । యచలమునుబోలెనిశ్చలంబైననతఁడు । బాష్పని
ష్పీడితాత్ముఁడైపరితపింప । సదయహృదయుండుశ్రీరంగశాయిపలికె ॥ ౨౬ ॥
క ॥ లేలెమ్మువత్సయీగతి । నేలపరితపింపమాకునిచ్చటవిడువం । జాలమికిఁగ
లదుకారణ । జాలమువినుపింతువినుముసర్వముదెలియన్ ॥ ౨౭ ॥ మ ॥ పరి
తఃప్రాంతపరీతసహ్యతనయాబాలానిలాసేవ్యముల్ । పరిమాణప్రథమానపూ
గకుహాళీప్రాదుర్భవామోదముల్ । సరసాభ్రంకషనారికేళనిబిడచ్ఛాయంబులీ
చంద్రపు। ష్కరిణీపుణ్యసమీపదేశములుశక్యంబేవిసర్జింపఁగన్ ॥ ౨౮ ॥సీ॥ సరిలే
దుచంద్రపుష్కరిణీసమీపంబునకునెందుననిమెచ్చినాఁడఁగాన। నన్వయభవులచే
నర్చితుండుగసూర్యునకుశపథంబిచ్చినాఁడఁగాన।మునులువీరికినిత్యముగసేవఁగృ
పసేయువాఁడనైవరమిచ్చినాఁడఁగాన । ననపాయులగుమహీజనులకుమోక్షమీ
నామదిఁగరుణించినాఁడఁగాన।నిచటువిడిచినాకునెచటికినేగరా। దిదియెకాదువే
అహేతువొకటి।గలుగునీకవేరకన్యాప్రవాహము । ధ్యంబువిడువరామికదియువిను
ము॥ ౨౯॥వ॥ మున్నువిశ్వావసునామధేయుండైనగంధర్వవరుండనంతపద్మనాభదే
వుంబ్రబోధితుంజేయుటకుదక్షిణసముద్రతీరంబునకుంజనుచు నడుమవింధ్యపాద
ప్రశస్తులగుసమస్తనదులంగనుంగొనియందఱికినేకనమస్కారంబు గావించుచుఁ
గడచిచననమ్మహాత్ముండొనరించిననమస్కారంబుతనకతనకయనియహంకరించుట
నమ్మహానదులకందఱకుందమలోవివాదంబు వుట్టిజరుగుచుండంగొండొకకాలం
బున ॥ ౩౦ ॥గీ॥ తిరిగియతఁడునాఁటితెరువుగానఁగవచ్చి । తొంటియట్లప్రమొ
క్కెనొంటిప్రమొక్క। ప్రమొక్కనీవుప్రమొక్కప్రమొక్కెదమనెవ్వరి । కనుచునెల్ల
నదులు నడుగుటయును ॥ ౩౧ ॥ క ॥ వినుఁడెల్లనదులుమీలో । ఘనమగునదె
నాదుప్రమొక్కఁగైకొనునదిపొం । డనిచనుటయుఁదమలోగుణ । ఘనతకునై
తొంటికంటెఁగలహంబయ్యెన్ ॥ ౩౨ ॥ గీ ॥ పోరిపోరిపరిశ్రాంతిఁబొందిగర్వ ।
మెడలిక్రమమునశాంతులైరెల్లనదులు । నత్యహంకృతిజహ్నుకన్యకుఁగవేర ।
కన్యకనుబోకచిరకాలకలహమయ్యె ॥ ౩౩ ॥ క ॥ ఇరువురునుజతుర్ముఖుసభ ।
కరుగనతఁడుగంగయధికమనుటయుదుఃఖా ; తురయైకవేరకన్యక। సరసిజభవుఁ
గూర్చితపముసలుపఁగనజుఁడున్ ॥ ౩౪ ॥ క ॥ గంగానదిభగవత్పద । సంగతి

గలదనుటనొప్పఁగఁజనదధికతఁడ । ద్గంగాసామ్యమొసంగితి । గంగాసమవసఁగ
వేరకన్యయునలుకర్ ॥ ౮౫ ॥ చ ॥ నలువఁదొలంగి ఘోరముగనన్నుగుటించితపం
బొనర్పఁగా । వలదనిగంగకంటెగుణవత్వసుసిద్ధికిఁదావకోదర । స్థలమునరంగ
ధామసహితంబువసించెదనంటిఁగావునర్ । నిలిచెదనీకవేరసుతనిగ్ఘరమధ్యము
నర్ విభీషణా ॥ ౮౬ ॥ క ॥ కావునగతశోకుఁడవై । నీవిప్పుడులంకకరిగి నెమ్మది
రాజ్యశ్రీవిభవమనుభవింపుము । నావుడుఁగడుదైన్యమునఁబునఃప్రణతుండై ॥ ౮౭ ॥
గీ ॥ పుండరీకాక్షయిచటనీవుండుదేని । లంకయేటికిసామ్రాజ్యలక్ష్మియేల । నా
కుసర్వంబునీపాదనలినయుగమె । యుండఁగలవాఁడనేనునీయొద్దఁగొలిచి ॥ ౮౮ ॥
శా ॥ కల్పాంతావధికంబునాకుమునులంకారాజ్యమాయుష్యముం । గల్పించెన్ర
ఘుభర్తమోక్షపదమాకాంక్షింపశేషాహిరా । ట్తల్పున్నిన్నిటులిచ్చినాఁడుకృప
తోడన్స్వేదశాఖాశిఖా । కల్పత్వత్పదపల్లవంబులకునేఁగాఁజాలదూరస్థుఁడర్ ॥
సీ ॥ అనవుడువత్సయిట్లగునైననాయాజ్ఞ సేయంగవలయుటఁజింతయుడిగి । లం
కాధిరాజ్యపాలకుఁడవైయుండుము నలువదినావసానముల నెల్లఁ । జనుదెమ్మన
నుఁగూడిసత్యలోకమునకు రెండుపరార్థముల్ నిండినపుడు । కొనిపోదునాతోనని
నునిత్యపదమునకట్లొటలంకకీవరుగుమిచట । నుండునట్లుగనినుఁజూచుచుండువాఁ
డ । నెపుడులంకాభిముఖుఁడనైయీవునరులు । గూడియుచ్చోటనుండుటగూ
డదనిన । దనుజకులనాయకుండు నెుండనఁగనోడి ॥ ౯౦ ॥ వ ॥ ప్రదక్షిణపూ
ర్వకంబుగా సాష్టాంగదండప్రణామంబాచరించి శ్రీరంగవల్లభు పదారవిందంబు
లు నిజశిరోభాగంబున దృఢంబుగాఁజేర్చుకొని బాష్పధారాళలోచనంబులనం
తంతమరలిమరలిసేవించుచు నెట్టకేనియు విభీషణుండు మంత్రిసమేతుండై లం
కకుంజనియె ననంతరంబధర్మవర్మాది చోళరాజపరంపరాపూజితుండై యనా
గోచితవిశేషాశేషజగజ్జనంబులకు మోక్షసత్రప్రధానంబొనరించుచు నుభయ
కావేరీమధ్యంబునఁ జంద్రపుష్కరిణీతీరంబున శ్రీరంగనామధేయదివ్యగృహస్థుం
డైయుండుటంజేసి ॥ ౯౧ ॥ సీ ॥ అపవర్గకాంక్షచేనాఁకొన్నవానికిఁదంగేటిజు
న్నశ్రీరంగశాయి । నిర్వాణదారిద్ర్యనిర్విణ్ణుఁడగువానిముంగిటిసేవధిరంగశా
యి । సంసారమలవిమోచనమునాకాంక్షించుపంగువుపైగంగరంగశాయి । ప
రమార్థలాభతత్పరుఁడైనవానికి ముంగొంగుపసిఁడిశ్రీరంగశాయి । బెదరకాఁక
టియమృతంబుఁబిదికికొనఁగ । శృంగములులేనిమొదవుశ్రీరంగశాయి । కోరువా
రలకోర్కులీఁగోరివచ్చు । జంగమామరతరువుశ్రీరంగశాయి ॥ ౯౨ ॥ * *

శ్రీషష్ఠ్యంతములు.శ్రీ

ఈదృశగుణనిధికిమహా । హ్లాదసుఖాకారసంవిదమృతాంబుధికిన్ । వే
దాంతనేతినేతిస । మాదిష్టనిషేధవిషయితాత్మావధికిన్ ॥ ౯౩ ॥ ఖ్యాతతర

చంద్రపుష్కరి । ణీతటగృహమేధికాత్మనిరతేక్ష్వాకు । వ్రాతకులదైవతమున
కు । ధాతృశతాహరహరార్చితపదాబ్జునకుఁ ॥ ౯౪ ॥ పంగూపరిపరినిప
త । ద్గంగాసమమాదృశాక్షిగతగోచరభా । వాంగీకర్తకుఁజోళ । ప్రాంగణ
పరిదృశ్యమానబహుసేవధికిఁ ॥ ౯౫ ॥ ద్వివిధోభయదిక్ప్రవహా । తత్కావేరక
న్యాతటోపగతపూగవనీ । నవకుహళీపరిమళవహా । పవనోపాస్యునకువికచప
ద్మాస్యునకుఁ ॥ ౯౬ ॥ శారదచంద్రాతపవి । స్తారాస్తరణాభిరామతల్పితయ
మునా । చారుతరపులినసాక్షికి । జారగ్రామణికిధూర్తజనతామణికిన్ ॥ ౯౭ ॥
అసమసమసమరసమయ । ప్రసభమదప్రస్మృతివిస్మృమరదురసురసమి । త్యసు
విసరగ్రసనరసో । ల్లసదసిరసనాలభుజచలద్భుజగునకున్ ॥ ౯౮ ॥ భాషాధిప
శేషాదిమ । నీషాపదగోచరగుణనిస్సామ్యునకున్ । దోషాచరయోషాజన । భూ
షామోషాచరణనిపుణశౌర్యునకున్ ॥ ౯౯ ॥ హేయప్రతిభటునకసం । ఖ్యేయ
ప్రథమానగుణమహిమ్నునకుముని । ధ్యేయస్వరూపికనుసం । ధేయప్రియదివ్యనా
మధేయాఢ్యునకున్ ॥ ౧౦౦ ॥ క ॥ కారుణ్యఖనికినజహ । త్తారుణ్యనవాభిరూపతా
ప్రకటితశ్రీం । గారరసాధీశ్వరునకు । శ్రీరంగేశ్వరునకర్థిచింతామణికిన్ ॥ ౧౦౧ ॥
వ ॥ సమర్పితంబుగా నాయొనర్పంబూనిన మాంధాతృచరిత్రంబను కావ్యకథాక
ల్పవల్లికి నాలవాలంబైన పురవరం బెట్టిదనిన ॥ ౧౦౨ ॥ సీ ॥ జాతరూపమనోజ్ఞ
జాతరూపంబైనకోటచే వలయాద్రి నోటుపఱచి । మధుసుధారసపూరమధురనీ
రంబైనపరిఖచే వారాశిభంగపఱచి । నవరత్నచిత్రాభినవయత్నకములైనయిండ్ల
చేఁగనకాద్రియేపుగఱచి । కాంతనిర్మలచంద్రకాంతబద్ధములైనకుట్టిమంబులధా
త్రిఁగొంచపఱచి । కమలగర్భుండుదనసృష్టిగానిభువన । కోశగర్వంబునణఁగింప
గోరిదీని । వేడ్కనిర్మించెననఁబొల్పువిమతహృదయ । ఘట్టనంబైనసాకేతపట్ట
ణంబు ॥ ౧౦౩ ॥ కం ॥ పట్టణరమబిరుదునకై । పట్టినపగలింటిదివియబాగునఁగోటం
జుట్టునుదన్మణిగణరుచి । ఘట్టితతేజుఁడయితిరుగుఖరకరుఁడెప్డున్ ॥ ౧౦౪ ॥
క ॥ పరిఘాకమఠముపైఁదన । భరియించినధరణినిలిపిప్రాకారమఠముత । ద్ఘ
వహనశ్రమహతికా । పరిఘాజలఖేలనంబుపలుమఱుసలుపున్ ॥ ౧౦౫ ॥ గీ ॥
అతిసమున్నతకనకహర్మ్యములతుదలఁ । జెలువమొలికెడుసాలభంజికలువోఁ
చుఁబురవిశేషవిలోకనాద్భుతముకతనఁ । జేష్టలెడలినఖేచరస్త్రీలువోలె ॥ ౧౦౬ ॥
ఉ ॥ కన్నులపండువైపొలుచుఁగస్సైనసప్పురలక్ష్మిసారెకు । న్విన్ననువొప్పవిచ్చు
నెఱివేణితెఱంగునమందమారుతో । ద్యన్నిజకేతనాంచలకరాగ్రములంబ్రవిసా
రితంబులై । యున్నతసౌధశైలశిఖరోపరిలంబితమేఘలేఖికల్ ॥ ౧౦౭ ॥ శా ॥
ఫణీలోచనలాత్మవక్త్రరుచిచే నేణాంకసౌభాగ్యము । క్షీణప్రౌఢిహరింపసౌధప
రిష్వంకీర్ణేంద్రనీలోపల । శ్రేణీనిర్మలకుట్టిమంబులపయిన్ శీతాంశుఁడున్ బేదయై ।

ప్రాణాచారమువడ్డయట్లప్రతిబింబవ్యాప్తిచూడందగున్ ॥ ౧౦౮ ॥ చ ॥ అహర
హముంబ్రభాతములహర్మ్యతలోపరిచంద్రశాలికా । గృహములఁగామినీసురతకే
లివిసూత్రితహారమౌక్తిక । గ్రహణపరాయణంబులగుఁగావునఁదన్మతిభ్రాంతతా
రకా।గ్రహములఁజంచులంగమిచిక్రాయుఁబురింజిలుప్రోదిపార్శ్వముల్ ॥ ౧౦౯ ॥
క ॥ క్రతుభుజులకుగృహపాచకు । లతిగూఢబ్రహ్మనిధికినాజనికులుభా । రతికిం
పేరోలగములు । ప్రతిలేకలరుదురుపురముబ్రాహ్మణవర్యుల్ ॥ ౧౧౦ ॥ శా ॥
పౌనఃపుణ్యముచేతఁగానిరిపులన్భంజింపలేఁడయ్యెభూ । దానంబొక్కటిగాని
షోడశమహాదానంబులుంజేయనేఁ । డేనీతిన్జమదగ్నిరాముఁడుసముండిద్ధప్ర
సిద్ధోన్నమ । ద్దానక్షాత్రగుణంబులంబురవరాంతఃక్షత్రియశ్రేణికిన్ ॥ ౧౧౧ ॥
ఉ ॥ లేకనిధివ్రజంబులవలేశముకాంచనభూధరంబుర । త్నాకరరత్నరాసులడిగం
ట్లమరున్మణికామధుక్సురా । నోకహముల్క్రమోచితవినూతనవస్తువులిట్టివట్టివ।
న్వాకులకందరానిపురవైశ్యులసంపదలెన్నిచూపుచోన్ ॥ ౧౧౨ ॥ క ॥ ప్రతివర్షం
బునుధరను । ద్ధతిఁబడియెడుపిడుగులెల్లఁదగఁగూర్చినరా । కృతులుగనెసఁగూ
ర్చెనొకో । శతధృతియనవీటసుభటసంఘమువొలుచున్ ॥ ౧౧౩ ॥ సీ ॥ అవలీ
లమైనెట్టియవనీరుహమ్ములైనఁబెఱుకుటయెలదూండ్లువెఱికినట్ల । కొమ్ములతుదఁ
గ్రొచ్చికులశైలతటములైనఁగూల్చుటనదిదరుల్గూల్చినట్ల । యున్మత్తవృత్తిమైనుద
ధిసప్తకమైనఁగలఁచుటమడుగులుగలఁచునట్ల । బలిమినెంతటియనిపరసైన్యతతు
లమట్టాడుటతుంగలోనాడునట్ల । కాఁజలించుచుఁదమయంచుఁగలుగురౌద్ర ।
రసములుతేటమైవెలినెసఁగుమాడ్కిఁ । గోపమదధారలనిశంబుగురియుచుం
డ । వఱలుఁబురివారణములనివారణములు ॥ ౧౧౪ ॥ సీ ॥ కట్టడిఁజెలియలికట్టయొ
కట్టగాబిగువుమైఁపేరెంబువెట్టకుండ । లంఘనలాఘవోల్లసనంబుమైమొక్క
లించివార్ధులుచౌకళింపకుండ । బిట్టుదిగంతముల్ముట్టఁజూపినవిధిపవమానుగ
డతెగఁబాఱకుండ । భరతాభినయములనిరపేక్షగాలోకదృష్టులుదనియనర్తించ
కుండ । రయముచేఁజిత్తగతులగెల్చియునుబతుల । మతులలోననవర్తింపమాకు
వలసెనననుచుసిగ్గునఁదలవంచుకొనినవిటులో। యనఁగఁదగియొప్పుఁబురినుత్తమా
శ్వతతులు ॥ ౧౧౫ ॥ క ॥ క్షితిసురలొనర్చుసతత । క్రతువులనాహుతులుగొనుచుఁ
గాఁపున్నసుర । వ్రతతులవిమానములయా । కృతులంబోలుపౌరువీటఁగ్రీడాగృ
హముల్ ॥ ౧౧౬ ॥ క ॥ వేడుకఁబతులుందామును । గ్రీడాగేహములుచొచ్చికేల
నందెలిరా। గోడలఁగనుపట్టెడుతమ। నీడలుసవతులనిమానినీజనములుగున్ ॥ ౧౧౭ ॥
శా ॥ దర్పంబేర్పడముగ్ధలంబతులునాత్మక్రీడకుందార్చికం । దర్పండార్వఁగ
నీవిబంధనములందప్పింపనవ్వీటిలో । నర్పించుంబునరంశుకస్థితిఁద్రపాహైన్యం
బభావంబుగాఁ।గర్పూరాగరుధూపధూమపటలీగాఢాకృతిప్రక్రియల్ ॥ ౧౧౮ ॥

శా ॥ కేళీగేహసరోమరాళ మిథునక్రేంకారముంగన్యకా । డోలాకాంచ
నకింకిణీఘనరవాటోపంబునృత్యన్నటీ । హేలానూపురశింజితంబుఁబురినిం
పేసారఁగాలోఁగొనుం । గాలోద్యత్పురుషాయమానగణికాకాంచీకలక్వా
ణముల్ ॥ ౧౯ ॥ గీ॥ ఉచితసమయమగుటయునుసురత్నగర్భప్ర । సూతినొం
దియున్నచొప్పుమెఱయ । వివిధమణిసమృద్ధివీక్షింపఁగానొప్పు । నప్పురం
బులోననాపణములు ॥ ౨౦ ॥ సీ ॥ గమనంబులేచాలుఁగన్నులుదనియింపనృ
త్తంబులేలకోనేర్చిరిట్లు । పలుకులేచాలువీనులకుఁబండువుసేయనెఱపాటలే
లోకోనేర్చిరిట్లు । సౌందర్యములెచాలుసమ్మోహనమునకునేపథ్యమేలకోనే
ర్చిరిట్లు । తారుణ్యములెచాలుఁదలఁపులు గరఁగింపనెఱతనంబేలకోనేర్చిరి
ట్లు । లిదిప్రియాతిరేకమిదిగదానఖముఖ । సాధ్యమునకుఁబరశుసంగ్రహంబు ।
వీరుగలుగసురుఁడువిజయగాఁడెట్లన। వఱలుమరుపురంబువారసతులు ॥ ౨౧ ॥
సీ ॥ కరములకందిచ్చువిరులబంతులకంటెవెడఁదోఁచుచన్నులువేడ్కఁబెనుప ।
మవ్వంపుగొననెత్తుపువ్వుటెత్తులకంటెఁ గరమూలరుచిచూడ్కిఁగమిచితిగువఁ ।
గోరిననొసఁగెడుకొసరుపువ్వులకంటెమొలకనవ్వులుడెందములుగరంప । నిం
డారుసరముల నెత్తావిగమికంటె సుముఖసౌరభములుచొక్కఁబెనుప । జట్టి
కాంద్రఁదమదుసరసనుందరవిలా । సములచేతఁదారజట్టిగొనుచుఁ । బురమువీ
థులకునుభూషణప్రాయమై । క్రాలుఁబుష్పలావికాజనంబు ॥ ౨౨ ॥ గీ॥ అం
గరాగంబుదమవెలయాటనంత । రంగరాగంబునొసఁగెడునప్పురంబు । గట్టి
వాలుపడంతులుకంతుచేతి । గట్టివాలునకొప్పింతురెట్టివారి ॥ ౨౩ ॥ మ ॥ అ
జహచ్చంద్రవిజృంభముల్ శుకపికాధ్యారూఢనానావిధ । ద్విజమృష్టాన్నయదే
ష్టసత్రగృహముల్ దీవ్యన్మదోత్సేకభా । వజసర్వస్వములంచితానిలనిజస్వారాజ్య
ముల్దంపతీ। వ్రజతారుణ్యసమృద్ధిసాక్షులుపురప్రాంతస్థితారామముల్ ॥ ౨౪ ॥
చ ॥ అలికులకుంతలంబులురథాంగకుచంబులుపద్మవక్త్రముల్ । గలరవపద్మినుల్
ల్ గడువికాసముతోఁదమయందుసక్తమై। యలరవిహారవేళఁదమునంటినకాం
తలమేనికస్తురిన్।జులకనసోడుముట్టుసరసుల్సరసుల్వలెనొప్పునప్పురిన్ ॥ ౨౫ ॥ సీ॥
ప్రణయవాదములుదంపతులందునుదయించిరంజిల్లుమానాంకురములుమేసి । స
రతాంతవిశ్రాంతసుందరీజనములవక్షోజతటఘర్మవారిఁగ్రోలి । వనములుమధ
గర్భవతులుగాఁబూమొగ్గమొదవులకౌమారములుహరించి । విషయానుభవక
థావిముఖవిరక్తులపటుతరధైర్యవప్రములుగూల్చి । గంధలోభానుబంధిపుష్పంధ
యముల। ఝుంకృతులచేఘణిల్లనఱంకెలిడుచు । విషమశరుపేరజన్నియవిడి చి
రనఁగఁ । గ్రొవ్వివిచరియించునవ్వీటఁగోడెగాడ్పు ॥ ౨౬ ॥ ఉ ॥ ఇట్టివిలాసల
క్ష్మిదనకీడునుగీడునులేనియమ్మహా । పట్టణమేలునుద్ధతసపత్ననృపాలకఫాలపట్టి

కా । పట్టనవాతతస్ఫురితపాదసరోరుహుఁడష్టదిక్తటీ । హట్టచరత్ప్రతాపహారిదశ్వుఁడనాయువనాశ్వుఁడున్నతిన్ ॥ ౧౨౭ ॥ సీ ॥ తనభూభరణదక్షతకు మెచ్చిఫణిరాజు చులుకనయగు వేయుఁదలలునూఁపఁ । దనఖడ్గపుత్రిశాత్రవులనచ్చరలనుజిన్నిబొమ్మలపెండ్లిఁజేసియాడఁ । దనమూర్తిసుందరతాగర్వవతులైనసతులమానసములఁబ్రతిఫలింపఁ । దనకీర్తివల్లికాతతులకాశాధిపకుంభి దంతములు వేఁగొనలుగాఁగఁ । బ్రస్తుతికినెక్కు సతతధారాళనైజ । దానచిరవాసనావాసితప్రపంచ । రంజనైకమహారాజకుంజరంబు । విశ్వభూభర్తయైయువనాశ్వవిభుఁడు ॥ ౧౨౮ ॥ శా ॥ ఆరాజోత్తముఁడొక్కనాఁడుమృగయావ్యాసక్తిఁగాంతారకాం । తారంబుల్ వెసఁజొచ్చి వాహముఖఫేనంబుల్ వనీదేవతా । హారప్రౌఢిఘటింపఁగాఁజనియెమధ్యాహ్నాతపక్లిష్టసే । నారాహిత్యముఁబొందిదప్పిఁబడిఖిన్నస్వాంతుఁడైయొక్కఁడున్ ॥ ౧౨౯ ॥ గీ ॥ పోయిపెద్దదూరమున నెకముఁనియాశ్ర । మంబుచేరిచొచ్చిమానినచటఁ । దడవికానలేకతత్పర్ణశాలికా । భ్యంతరంబుదఱిసియరసెనందు ॥ ౧౩౦ ॥ క ॥ కండుకముఁబోనితెల్లని । యండంబొక్కటిమృదుచ్ఛదాచ్ఛాదితమై । యుండఁగనద్భుతరసమ । గ్నుండగుచుంగదిసిపుచ్చుకొనిముదమొదవన్ ॥ ౧౩౧ ॥ శా ॥ ఔరా యిట్టివిచిత్రమేఖగజమోయండంబిదిమ్మానియే । లారక్షించునొమూలడాఁచియనిలీలాకందుకక్రీడమై । నారాజన్యుఁడుచేతఁబట్టికొనిరానయ్యండమయ్యాశ్రమ । ద్వారప్రాంతమునంబ్రమాదమునహస్తస్రస్తమైభూస్థలిన్ ॥ ౧౩౨ ॥ గీ ॥ పడినయంతఁబెక్కుపటిలయ్యెనెఱవుగాఁ । గలలమచటవఱదగట్టుటయును । దలఁకిమానిరాకఁదలపోసిమునుమును । చనియెమునియువచ్చిచాలనడలి ॥ ౧౩౩ ॥ మ ॥ తనప్రాణేశ్వరితొల్లియంచలవిమోదవ్యాప్తిసాకాంక్షుఁజూ । చినయాకోర్కి నెఱింగియయ్యతివతోఁ జిత్రప్రభావంబుపొం । దునహంసాకృతులైరమించుటయుసద్యోగర్భజంబైనదాఁ । చినవాఁడొట్టఁదదండభంగమునకుంజింతాతిసంతప్తుఁడై ॥ ౧౩౪ ॥ గీ ॥ చింతదేఱియిట్లుచేసినయతులపా । పాత్మకుండుగర్భమవనిచచ్చుఁ । గాకయనిశపించెభూకాంతుఁడిటధాత్రి । నేలుచుండఁగొంతకాలమున ను ॥ ౧౩౫ ॥ గీ ॥ భువనభరితమగుచుఁబొదలువిఖ్యాతవి । స్ఫురణనడఁచుమంచువోలెమ్రింగె । విభునిమనసులోనివిశ్వభూచక్రాధి । పత్యసమ్మదమునపత్యకాంక్ష ॥ ౧౩౬ ॥ సీ ॥ నందనుఁజూడనానందించుచూడ్కులకెవ్వియుఁజూడంగనేవమయ్యెఁ । దనయానులాపంబు వినఁగోరువీనులకెవ్వియునాలింపనేవమయ్యె । సుతుమాళిమూర్కొనఁ జూచుఘ్రాణంబున కెవ్వియుఁబసిగొననేవమయ్యెఁ । గొడుకుతియ్యనిపేరునుడువఁగోరెడుజిహ్వకెవ్వియుఁజవిఁగొననేవమయ్యెఁ । బట్టికౌఁగిటఁజేర్పంగఁబరఁగుమేని । కితరమెవ్వియుఁ

సోకంగ నేవమయ్యె । విశ్వభూమీశుఁడగు యువనాశ్వపతికి । సుతుఁడు వెలిమైన బ్రదుకేమి సొంపుదలఁప ॥ ౧౩౭ ॥ క ॥ సంతతిలేమికి నాభూ । కాంతుం డెంతయు నువవంతగడలుకొనంగా । సంతతదురంతచింతా । క్రాంతస్వాంతంబొకింత గళవళపడఁగన్ ॥ ౧౩౮ ॥ శా ॥ ఏలాయేలితి విశ్వభూవలయమిట్లేకాతపత్రంబుగా । నేలాతోలితి గర్వితారినృపులన్ హేమాచలంబెక్కఁగా । నేలా వ్రాలితి యాచకావనకథాహేవాకసంపత్తినిం । కేలా బిడ్డలు లేనియీబ్రదుకు గొడ్డేఁబయ్యెఁ జింతింపఁగన్ ॥ ౧౩౯ ॥ సీ ॥ జలకమార్చినఁ జిన్నిశయ్యలో నొయ్యొయ్యఁ గాలు చేయార్పంగఁగనుట లేద । కెంగేల లేబొజ్జ గిలిగింతలిడిన నవ్వు నెలమోముఁదమ్మిముద్దిడుట లేద । తియ్యఁదేనియలొలుకు తీవనవ్వులతోడి తొక్కు పలుకులు విని చొక్కలేద । వడఁకుతోఁ జిఱుతప్పటడుగులనే తేరఁ జేచాఁచి యక్కునఁ జేర్ప లేద । పుత్రకులు లేనిసిరియేల భోగమేల । బాలకులు లేని తానేల బ్రదుకదేల । యాత్మజులు లేనియశమేల హర్షమేల । యిహముఁబరమెద్ది సంతానహీనులకును ॥ ౧౪౦ ॥ ఉ ॥ ముంగిట నాడుపుత్రుఁడతిమోదమునందనుదౌలఁగాంచి వే । డ్కంగరయుగ్మమెత్తి చిఱుగంతులతో వెడయేడ్పుతోడ డా । యంగఁ జెలంగి యెత్తికొని యక్కునఁ జిక్కఁగఁ జేర్చి ముద్దుమో । ముంగమియార ముద్దిడుట ముజ్జగమేలుట గాక యుండునే ॥ ౧౪౧ ॥ వ ॥ అదియునుంగాక ॥ ౧౪౨ ॥ ఉ ॥ నారకయాతనాంబుధికి నావ నిబద్ధకవాటగోపుర । ద్వారమునందుఁ గుంచిక భవక్షితిజంబునకున్ ఫలంబు వి । స్ఫారనిజార్థగుప్తికనపాయనిధిస్థలి వంశవర్ధనాం । కూరము పుత్రునింబడయఁ గోరుట యొప్పదె యెట్టివారికిన్ ॥ ౧౪౩ ॥ సీ ॥ అనిచాలఁ జింతించి యాకోరికయాత్మీయకులగురుండగు మౌనికులగరిష్ఠు । నకు వసిష్ఠునకు విన్నపము సేయుటయు నయ్యుగ్రాంశుకులు నతఁ డూరడించి । తగిన నానావిధద్రవ్యముల్ దెప్పించి హోతలరప్పించి యయుక్తవిధుల । శతమఖప్రీతిగా నతులితక్రియ నెక్క యింద్రయాగంబు సేయించుటయును । దూర్ణమున నధ్వరక్రియ పూర్ణమైన । మహితమగు వేదమంత్రాభిమంత్రితాక్ష । తములు చల్లినకలశోదకములు దెచ్చి । భూతలాధీశునకుఁ జూపి హోతాతలపుడు ॥ ౧౪౪ ॥ క ॥ ఆలింపుమీజలంబులు । గ్రోలిన ప్రాణికి నృపాలకులమాళిమణీ । వేలావలయితధరణిం । బాలింపంగలుగుసార్వభౌముఁడు పుట్టున్ ॥ ౧౪౫ ॥ గీ ॥ అనిమెఱింగించి దాపించి రవిమహీశ । వరుఁడు నారాత్రియెల్లజాగరము చేసి । మౌనివాక్యంబ మోఘంబు గానఁ దెలివి । దప్పిడప్పికి నానీరు ద్రాగుటయును ॥ ౧౪౬ ॥ ఉ ॥ గర్భమునిల్చి కుక్షియధికంబుగఁ గానఁగవచ్చి గ్రక్కునన్ । దుర్భరతీవ్రవేదనల దూలుచు సోలుచు నేల వ్రాలఁగా । నర్భకుఁ డొక్కఁడయ్యనకులాగ్రణిగర్భము గల్చికొంచు నా । విర్భవమొందె భూజనులు విస్మయమగ్నులుగాఁగ నయ్యెడన్ ॥ ౧౪౭ ॥ శా ॥ విస్రస్తాకులవేణిబంధములతో విభ్రష్టసం

వాసలై । ఘుస్రాంతంబునవాడుతమ్ములగతింగై వ్రాలివక్త్రప్రభా । విస్రంభంబులడంగనవ్విభుసతుల్వేవచ్చి నేత్రాంబుజా । తాస్రాధౌతపయోధరద్వయ తటీవ్యాలిప్తకాశ్మీరలై ॥౧౪౭॥ క ॥ రోదనముతోవసిష్ఠుని । పాదంబులమీఁదవ్రాలిపతిభిక్షముదం । డ్రీదయసేయుమునావుడు । నాదరమొప్పంగమునికులాగ్రణియాత్మన్ ॥౧౪౮॥ ఉ ॥ ఇంచుకచింతఁజేసినృపుఁడీదశనేమిటనొందె నేమిసే । యించిననేమివ్విట్టైనగునేయిఁకనిన్నియునేలయేనుజే । యించినయిష్టియందహహాయియాయవకార్యమువుట్టుటెట్లురా । యంచునహంకరించితనయాత్మగుణించితలంచెనింద్రునిన్ ॥౧౫౦॥ శా ॥ ఆకర్షించినదేవభర్త్రయుజగంబాశ్చర్యహర్షంబులు । ద్రేకింపందనుఁజూడనాత్మగుణగాత్రప్రౌఢగంధర్వయో । షాకంఠధ్వనితాళవృంతరచనాచాతుర్యహేవాకవ । న్నాకశ్రీమణికంకణోల్లసదమందక్రేంకృతుల్ప్రోవఁగన్ ॥౧౫౧॥గీ॥ వచ్చినపుడభక్తినచ్చటివారెల్ల । నవనియందుఁజాఁగియవనతులుగ । నర్ఘ్యమణిమయాసనాసీనుఁడైవాని । తన్నుఁదలఁచినట్టితలఁపుఁదెలిసి ॥ ౧౫౨ ॥ఉ॥ నన్నుగుణించిమీరుసవనంబొనరించితిరిందుఁగల్మషం । బెన్నఁనెకందునుంగలుగదివ్విభుఁడివ్విధినీల్గునట్లుగా। మున్నొకమానిదిట్టుటయుమోసమునేఁడిటఁగల్గెనైననే। నిన్నృపుప్రాణముల్మరలనిచ్చితినిమ్మునినాథునానతిన్ ॥౧౫౩॥మ॥ అనిలోకంబులకెల్లనద్భుతముగానాభూవిభుంబ్రాణయు । క్తునిగాదివనలిచ్చితానిజకరాంగుష్ఠంబుతద్బాలవ । క్త్రనివిష్టంబుగఁజేయవాఁడునసుధాప్రస్యందముంగ్రోలెనా । తనిమాంధాతృసమాఖ్యఁజేసిహరియంతర్ధానముంబొందినన్ ॥ ౧౫౪ ॥ గీ ॥ జాతవేదుండువీజనశక్తిఁబోలె । నమ్మకరుఁడుతపర్తుసంయుక్తిఁబోలె । నకుమారుండుజాతకర్మానుషక్తి । సమధికాశ్చర్యధుర్యతేజమునఁబొలిచె ॥౧౫౫॥ సీ ॥ కనుఱెప్పలిడనెఱుంగనిచూడిక్కఁజూచుచుజిగివీఁపుదోఁపబోరగిలఁబడుచుఁ । గరజానువులఁజతుశ్చరణుఁడై తిరుగుచుశిశునిదర్శితదృఢస్నేహుఁడగుచు । భాసురమితపదన్యాసంబుచూపుచప్రహ్లాదవిహారమునమర్త్యుఁడగుచు । జనకజానందబీజత్వంబుగైకొంచుగుణమలముసలినాఁబ్రణుతిఁగనుచు । వసననిరపేక్షనిచ్ఛాప్రవర్తియగుచు । హయసమారోహణంబుసేయంగఁగలిగి । రాసుతుఁడుదనశైశవక్రమదశావ । తారములచేతఁబూరుషోత్తమతఁదెలిపె ॥౧౫౬॥ క॥ కాలోపనీతుఁడైభూ । పాలతనూభవుఁడుగురునిపాలంబ్రచుర । వ్యాలోలకాకపక్షు । శ్రీలక్షితుఁడగుచునభ్యసించెన్విద్యల్ ॥౧౫౭॥ క ॥ మందానిలుచేనలరుల । కందువఁగనితావులెల్లఁగైకొనునళిమా । డ్కిందగుగురువశమునన్నృప । నందనుమతిశాస్త్రవాసనలఁదూఁకొనియెన్ ॥ ౧౫౮ ॥ సీ ॥ తూటిబాల్యంబువోఁ ద్రోచిప్రాయంబు వెట్టినకవాటంబుఁ బాటించెనురము । జయరమాలంబనశాఖలైబా

హువు లాజానుదైర్ఘ్యంబు నధిగమించె । వదనచంద్రునిఁజొచ్చి బ్రదికెడు
చీఁకట్లగతినవశ్మశ్రు రేఖలుజనించె । నర్థిదైన్యములపైనడరు కెంపునుబోలెనీక్ష
ణాంచలముల నెఱ్ఱదోఁచె।సుందరత్వమునకుఁజోటిచ్చితాసంకు। చించెననఁగఁగ
డుఁగృశించెనడుము । జనవరాత్మజునకు సకలలోకోత్సవా । పాదియైనయావ
నోదయమున ॥౧౫౯॥ క ॥ యువనాశ్వుఁడంతనాత్మజు । యువభావంబున
కుహర్ష మొదవఁగనొకనాఁ । డువసిష్ఠానుమతిన్వై । భవముననభిషిక్తుఁజేసి
పట్టముగట్టెన్ ॥౧౬౦॥ క ॥ శుభవేళయుక్తవిధియై । విభుఁడగు రాకొమరుతో
డ విశ్వంభరదా । నభిషిక్తయగుచుసాత్విక । విభవమునఁజెమర్చియున్నవిధ
మునఁబోలెన్ ॥౧౬౧॥ సీ ॥ శంఖకాహళవేణుఝల్లరీపణవాది వాదిత్రనాదం
బులాదరించి । నృపగణోపాయనాన్వితసింధుఘోటకఘుంకారహేషలఁగేలి
నేలి । చామరగ్రాహిణీశయకుశేశయమణికంకణక్రేంకృతిగారవించి। జయజీవ
ముఖబహుస్వస్తిప్రశస్తివిప్రాశీర్నినాదంబుననుమతించి । విభుతమైఁబేర్చియువ
నాశ్వవిభునికూర్మి । పట్టిపట్టాభిషేకవైభవమునందుఁ । బ్రణమదుత్పతదవనిభృ
న్మణికిరీట । కోటికోటీవిభూషణాకులరవంబు ॥౧౬౨॥ ఉ ॥ పాయుతొలంగుమో
సరిలుపాపదమంచుమహారవంబుగా । నాయతవేత్రహస్తులఖిలావనిపాలకులన్
బరాబరుల్ । సేయఁగఁబొల్చెఫాలగతచిత్రవినిర్మలభర్మపట్టికా । శ్రీయుతుఁడై
కుమారకుఁడుసింహగణాంకితభద్రపీఠికన్ ॥౧౬౩॥ గీ ॥ మణిమయంబైనయా
రాజమౌళిమౌళి । చిత్రరుచినొప్పెధవళాతపత్రమపుడు। హాటకాచలశృంగశృం
గాటకాగ్ర। విభ్రమచ్ఛుభ్రశరదభ్రవిభ్రమమున ॥౧౬౪॥ మ ॥ అమరీవిభ్రమ[illegible]
లోలనయనాహస్తాబ్జదోధూయమా । నమణీదండకచామరాగ్రపవమానా
నాందోళన । క్రమశోభన్నృపకుంతలప్రకరముత్కర్షాఢ్యమయ్యెందదీ ।
దుస్పర్శసుఖోన్నతిన్ బరవశంబైతూఁగు చందంబునన్ ॥౧౬౫॥ శా ॥
స్థేమలయాదికారణమహాసంకల్పపంకేజభూ । భర్గాశాపతిశాసనేశన
పారీణసర్వాసుభృ । ద్వర్గవ్యాకృతనామరూపబహిరంతర్వ్యాపకాదుర్గ్రహ
స్వర్గస్వానుభవాపవర్గఫలదస్వాతంత్ర్యసర్వంకషా ॥౧౬౬॥ క ॥ వినిహతనతార్తి
ర్తీ । యనఘునియంతృత్వచిదచిదంతర్వర్తీ । యనవధికమధురకీర్తీ। మునిజనచేతశ్చ
రవ్యమోహనమూర్తీ ॥౧౬౭॥ పంచచామరము॥ మరుత్ప్రరోహతూలతల్పమ
ధ్యసంస్థలీశయా। ధరారమాకరోపలాలితప్రసారితాంఘ్రికా। మరుద్వృధాక
వానుబంధమంధరోత్సవానక । స్ఫురద్విరావనర్తితాపభూవనీశిఖావళా॥ * *

గద్య - ఇది శ్రీమద్భట్టపరాశర దేశికేంద్ర చరణసరసీరుహ సేవ కోపసేవక నరసింహనా
మధేయ ప్రణీతంబైన కవికర్ణరసాయనంబను కావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీహయగ్రీవాయనమః.

# కవికర్ణరసాయనము.

## ద్వితీయాశ్వాసము.

శ్రీరంగదివ్యగృహాశ్రం । గారోజ్జ్వలదీపశిశిరకరపుష్కరిణీ । తీరఫలనమ్రకల్పమ । హీరుహకరుణాతరంగితేక్షణసుముఖా ॥ ౧ ॥ క ॥ ఈవిధముననిజనందను । భూవల్లభుఁజేసివృద్ధభూపతివిషయ । వ్యావృత్తచిత్తుఁడగుటన్ । దావనమునకేగఁదలఁచితనకులసరణిన్ ॥ ౨ ॥ గీ ॥ తలఁపెఱుంగఁజెప్పితనయునినొకవెంట । నియ్యకొలిపివిదపనేకతమున । నొయ్యనాయఁబిలిచియొకకొంతనయమార్గ । మెఱుకపఱుపఁదలఁచిహితమతోక్తి ॥ ౩ ॥ గీ ॥ మనుజపతికుపాయమునుసహాయంబును । వినుముదేశకాలవిభజనంబు । నాపదకుఁబ్రతిక్రియయుఁగార్యసిద్ధియు । నంగఁబంచకముసమస్తవిధులు ॥ ౪ ॥ వ ॥ మహాభూతపంచకపరిణామవిశేషంబుల సకలప్రపంచంబునగుచందంబున నేతదంగపంచకవివిధభేదసంగ్రహంబుల సమస్తనీతిధర్మమర్మంబులునగుటం దత్ప్రకారంబులకుం బ్రదర్శనార్థంబుగాఁ గొన్నివివరింతుఁ బ్రథమపరిగణితాంగంబైనయుపాయంబులు సామదానభేదదండంబులు తద్భేదంబు లనేకప్రకారంబులైయుండు నవియన్నియు నేకవిషయంబులై గురు లఘుత్వాదిహేతుభేదంబుననను కల్పరూపంబుగావు ప్రత్యేకంబనియతభిన్నవిషయంబులగుట నేకైకస్వతంత్రోపాయంబులుగావున నన్నియునువర్జనీయంబులగుటం దత్తద్గుణోత్కర్షంబాలింపుము ॥ ౫ ॥ గీ ॥ ధన్యతయుఁబూర్ణతయుఁగొల్చుదానమునకుఁ । బ్రోదియునురక్షయునుజేయుభేదమునకు । దండియునువన్నెయునుదెచ్చుదండమునకు । సామమునకేయుపాయంబుసమముగాదు ॥ ౬ ॥ క ॥ హితులగుదురహితవర్గము । హితమతిఁబోప్రాణమైననీఁజూచుహితా । హితతతిగతరూపజగత్త్రితయనువశ్యౌషధములుప్రియభాషణముల్ ॥ ౭ ॥ క ॥ కాకేమితన్నుఁదిట్టెనె । కోకిలతనకేమిధనముకొమ్మనెనే । లోకముపగయగుఁబరుసని । వాకునఁజుట్టమగుమధురవాక్యమువలనన్ ॥ ౮ ॥ గీ ॥ ఉన్నసాధనగతులసాధ్యుండుగాక । మ్రింగఁబఱతెంచుశత్రువుమిత్త్రుఁజేయు । దానమునఁనాత్మవశగులుగానివార । లితరులెవ్వారలీజగత్త్రితయమునను ॥ ౯ ॥ క ॥ శత్రులమిత్త్రులఁజేయున్ । మిత్త్రులభృత్యులుగఁజేయునిజగుణవృత్తిం । బాత్రులుగఁజేయునందఱ । ధాత్రీపతికన్నియెడలదానముతగదే ॥ ౧౦ ॥ క ॥ ఆయాసదుర్లభములన । నాయాసముననఘటించుననభిస్పృష్టా । పాయంబుపతికిభేదో । పాయముగడునిష్టమగునుపాయము

గాదే ॥ ౧౧ ॥ క ॥ అరులవిదళింపఁగానే । నరపతి తేజస్వియగుటనడురేయియి
రు । ల్విరియించునపుడుదీప । స్ఫురణముదగుఁగాకపగలుచొప్పడియున్నే ॥
క ॥ దండసమర్థుఁడుపతిగా । కుండిన సేవకులునులుకరుగ్రారికుభృ । న్మండల
ములుకునె కావున । దండసమర్థుండుగాఁగఁదగుభూపతికిన్ ॥ ౧౩ ॥ క ॥ పౌ
రుషముగలుగఁగానే । సారములగు భేదదానసామములుసమ । ద్ఘీరువునకవిఫ
లింపఁగ । నేరవుషండునకునింతి నేపథ్యంబుల్ ॥ ౧౪ ॥ వ ॥ ఇవిప్రధానప్రకా
రంబులు మఱియు నుపేక్షాదులునగుప్రకారాంతరంబులు నెఱుంగునదియిదియు
పాయస్వరూపనిరూపణంబయ్యె నింక సహాయస్వరూపంబువిను మఱియు రా
ష్ట్రదుర్గధనాది సంపద్రూపంబున మంత్రిసామంత సుహృద్బలదూతచారప్ర
భృతి పురుషసంపత్తిరూపంబున బహుప్రకారంబై యుండునవి యున్నియునవ
శ్యంబులగుటకుం బ్రత్యేకగుణంబులాకర్ణింపుము ॥ ౧౫ ॥ గీ ॥ అరులవలనఁగా
చుకరణిమేను తెవుళ్ల । వలనఁగాచుకొనఁగవలయునట్ల । యరులవలనఁగాచుక
రణిని నైజాధి । కారిజనులవలనఁగావవలయు ॥ ౧౬ ॥ క ॥ ప్రోదిగొనఁదగినపు
ష్పఫ । లాదులుగొడ్డంటవ్రచ్చి యవనిజము నెడన్ । వాదుగొనననట్లభూప్రజ ।
బాధించిన నేలకలుగు పతికరిగోరుల్ ॥ ౧౭ ॥ క ॥ మనసిచ్చినఁదనకోడరు । చ
నువిచ్చినఁబ్రజలు వెకరి సము సేయుదురౌ । టన్నృపతిమనసీకయకడుఁ । జనువీ
కయ మెలపవలయు సమ్ముఖచరులన్ ॥ ౧౮ ॥ క ॥ మించిధనమాసఁబ్రజ నెఱి ।
యించుదురాత్ములకుగ్రేణి యిచ్చుటపతికూ । హించిననిండిన చెఱువవి । యిం
చిశకులకులము సంగ్రహించుటగాదే ॥ ౧౯ ॥ క ॥ హరిజలధినాశ్రయించెను ।
హరునంతటివాఁడునద్రి నధివసియించెన్ । నరపతిమాత్రునకరిజన । దురధిగ
మంబైనయట్టి దుర్గమువలదే ॥ ౨౦ ॥ క ॥ ధనహీనుఁడునిరుపాయుఁడు । ధన
దాసులుగాకపురుషదాసులుగలరే । ధనముసకలైకమూలము । ధనసంగ్రహ
మెడలినతఁడుదారాజగునే ॥ ౨౧ ॥ క ॥ ధనముచనదోషమరుదే । యొనరించి
నయట్టివిధములుర్వీపతికిన్ । వినుపాత్రులకీకుండుట । యునపాత్రులయందుని
డుటయునునీరెండున్ ॥ ౨౨ ॥ క ॥ కర్తయగుకతనమతిఁగల । కర్తృత్వమదం
బువలనఁగార్యాతురతన్ । గర్తవ్యమెఱుఁగఁదగుటఁబ్ర । వర్తకుఁడగుమంత్రిపతి
కవశ్యమువలయున్ ॥ ౨౩ ॥ క ॥ విషమరుపంకంబునఁబడి । నపుడిభశతమైవె
డల్చునతఁడున్మదుఁడై । నపుడంకుశమైమఱలుచు । నృపకుంజరమునకుమంత్రిని
ర్వహితగదా ॥ ౨౪ ॥ క ॥ కెలనికిప్రేఁకముదనకున్ । వలఁతియుఁగాదండనాథ
వర్గముఁబెనుపన్ । వలయుఁబతియూఱటకునై । బలిమికిఁదేఁకువకుఁదోడుపా
టొదవునకున్ ॥ ॥ ౨౫ ॥ గీ ॥ ఎంతబలియురకుఁదనంతగాసామంత । గణముఁ
బెనుపకేలకలుగుజయము । శేషునంతవాఁడుశిరములువెయిపూని । కాకమహి

వహింపఁగలిగె నెట్లు ॥ ౨౬ ॥ క ॥ పతికిననుకూల సేనా । పతులనఁగా నెంద
ఱన్నిపటుతరభుజము । ల్పతికిఁబ్రతికూల సేనా । పతులనఁగా నెందఱన్నిపా
ర్శ్వోర్వరగముల్ ॥ ౨౭ ॥ క ॥ బలియుఁడగుమిత్త్రుసంగతి । గలరాజభ్యు
దయ మొంచుగౌరవయుతుఁడై । బలియుఁడగుమిత్త్రుసంగతి । గలరాజభ్యుదయ
మొందఁగనఁబడుగాదే ॥ ౨౮ ॥ క ॥ చేరువవపగదీర్చుటకై । దూరపుఁడోడాస
పడుటమర్త్యతియింటం । గూరినవిచ్చార్చుటకై । ధారుణిఁగూపంబుద్రవ్వఁదలఁ
చుటగాదే ॥ ౨౯ ॥ గీ ॥ కిరణములు లేనిపగలింటి సరణిఁదరణి । వెలుఁగనేర్చు
నెయుదయాస్తవేళలందుఁ । గానవినుముగ్రతేజులకైనమూల । బలము లేకున్నఁ
గడుఁబెంపుఁబడయరాదు ॥ ౩౦ ॥ క ॥ ఎప్పుడుదనకుంబగగల । దప్పుడసైన్య
ముఘటింతుననఁబతికగునే । యెప్పుడుదగుసైన్యము లే । దప్పుడపోపగయుఁగలు
గునవనీపతికిన్ ॥ ౩౧ ॥ క ॥ నిజముఖపవనమశంఖ । ప్రజనితమైమధ్యమందరం
బగుమాడ్కిన్ । నిజవాక్యమదూతముఖ । ప్రజనితమైయతిశయంబు పతికిందె
చ్చున్ ॥ ౩౨ ॥ క ॥ తనయున్నచోటనుండియుఁ । గనుఁగొనఁదగుజగము దేశ
కాలవిరోధం । బునఁబొరయకుండుచారుం । డను నేత్రముచేతనృపతి యఖిలజ్ఞ
తకున్ ॥ ౩౩ ॥ వ ॥ ఇంక దేశకాలవిభాగ స్వరూపంబువినుమఖిల కృత్యంబు
లుందదుభయాధీనసిద్ధి కరంబులగుటం దత్ప్రకారంబులచే ననంతంబులైయుం
డునైనంగొన్ని నిర్దేశించెద ॥ ౩౪ ॥ క ॥ ఏవేళ నెచటఁబండెడి । దేవిత్తదియె
ఱిఁగికాదెయిడఁగాఁదగున । యేవేళ నెచట నెట్టిఫ । లావహామదియెఱిఁగి చేయ
నగుభూపతికిన్ ॥ ౩౫ ॥ క ॥ అరివెట్టినలాఘవమగు । నెరసునభేదంపుఁజేఁత
నేరమిఁదెచ్చున్ । విరసించినఁగ్రొవ్వగుటన్ । సరియగువానియెడ నెల్లసామం
బతగున్ ॥ ౩౬ ॥ గీ ॥ ఏఱునిలుపఁగేలొగ్గుటయిచ్చకంబు । మత్తకరిఁగెరలించు
టమాయచేఁత । కొండనెదిరించితగరుధీకొనుటకడిమి । కాననధికునియెడమే
లుదానమంద్రు ॥ ౩౭ ॥ క ॥ ప్రియమెఱుఁగ లేఁడుదాన । క్రియఁగ్రొవ్వునుమ
ఱిక్రియాతిరేకంబగుటన్ । బయినెత్తఁదగదుమత్తుం । డయినపగఱభేదవిధికినర్హుం
డెందున్ ॥ ౩౮ ॥ గీ ॥ సామదానములకుఁజనవేదిభేదంబు । సేఁతదలఁపఁబం
దసేఁతయనిన । కానతాబలాఢ్యుఁడైనవిక్రమశాలి । హీనశత్రుమీఁద నెత్తవల
యు ॥ ౩౯ ॥ వ ॥ అట్టితుర్యకార్యంబునను నిశ్చితవిజయంబగుటం జే
సియాత్మీయబలంబునిచ్చి కేవలాంగీకరణంబున యాఖ్యాభిముఖుండుగాక త
త్తద్దేశకాలానుకూలంబుగాఁ బూర్వోపాయత్రయాను ప్రాణితంబగు ప్రా
ధాన్యంబు నెఱప వలయుభంగులు నెఱుంగునది ॥ ౪౦ ॥ క ॥ అగపడునంతకు
బలియుఁడు । పగఱకుఁబ్రియమాడునొక్కపట్టునఁదనపే । రుగనమ్మిజంతువరుదే ।
బిగువునఁబెనుఁబాముకూఁతపెట్టెడుమాడ్కిన్ ॥ ౪౧ ॥ క ॥ గాలపుటెరయి

చ్చికదా । వాలుగులందిగిచికొనుటవక్రరిపుఁడుదా । నేలోఁబడునంతకుబల ।
శాలియుదానంబుచూపఁజనునొక్కయెడన్ ॥ ౪౨ ॥ క ॥ చోరవదనకీనివెమరు
ల । నోరయించిదహించుగాడ్పునోజంబొదిర్మై । పెరిగెడురిపులకునంత । ర్వి
రసముగలిగించువెరవువెదకఁగవలయున్ ॥ ౪౩ ॥ క ॥ పేటెత్తిరిపులతోవిరి ।
వోటగుసదుపాయమొకటిపుట్టింపఁదగుం । బోటూడ్డియైనఁదాఁగను । చాటున
బండంగివేఁటసలిపెడురీతిన్ ॥ ౪౪ ॥ క ॥ అరినొకనిబొడమినప్పుడ । బరువు
ననడరంగఁజేయబహుజిచ్చుగతిన్ । దరుణంబురంబువోలెన్ । బరువంబగుతన
కునొర్వఁబడువేళ్లొకనిన్ ॥ ౪౫ ॥ క ॥ సులభమునఁదీర్చుపనికై । బలువగు
యత్నంబుసేయఁబతిఁజూచినయే । ములుముంటదివియకడిదము । జళిపించిన
యట్టిబేలచందమువచ్చున్ ॥ ౪౬ ॥ క ॥ చేయింపవలయుపనిఁదాఁ । జేయుట
కర్జంబుగాదుశీఘ్రిమతానై । చేయంగవలయుకార్యము । సేయంబనుపుట
యుఁగాదుసిద్ధముపతికిన్ ॥ ౪౭ ॥ క ॥ స్థానబలంబుననధికుని । హీనుఁడునె
ప్పించుబయిలనేగుకొలకున్ । లోనగుమొసలియుదగ్రత । నేనుఁగుఁబడఁదిగు
చుఁగాదెయిరవుననున్నన్ ॥ ౪౮ ॥ క ॥ ఊహచెడితేఁచఁబడెడుమహాహితు
కోపాగ్నిపిదపనార్పుటకొఱకై । స్నేహముసెఱపఁగఁజూచుట । మోహంబభి
వృద్ధిఁబొందుమునుపటికంటెన్ ॥ ౪౯ ॥ క ॥ అధముఁడనిరిపుఁడులోనగు। విధ
మెఱుఁగకయెత్తిపిదపవెడఁదిరిగినయే। నధమతమానిచివానికి । నధికతమొసఁగం
గఁబోవుటంద్రునయజ్ఞుల్ ॥ ౫౦ ॥ వ ॥ ఇంకవిపత్తిప్రకారంబునుగార్యసిద్ధియు
ననిష్టనివృత్తినిరూపణంబునునిష్టప్రాప్తిరూపంబునుబరస్పరసాకాంక్షంబులైప్రా
ప్యంబులగుటంజేసి రాజులకునీ రెండును ద్వివిధంబైనకార్యఫలం బిదియెఱుంగున
ది॥ ౫౧ ॥ క ॥ సకలానిష్టంబునుబా। యకయిష్టప్రాప్తివలననయ్యెడుసుఖమే । మొ
కచేననలముదరికొన । నొకచేఁజందనముఁబూయనూఱటఁగనునే ॥ ౫౨ ॥ క ॥ కా
వుననాత్మాభ్యుదయ।శ్రీవిభవమరిక్షయంబుఁజేకుఱునయబా। హావిక్రమములనఖి
లధ। రావల్లభుఁడైనయతఁడురాజనఁబరఁగున్ ॥ ౫౩ ॥ శా ॥ సర్వక్షోణితలంబునే
కధవళచ్ఛత్రంబుగాసంతతా । ఖర్వశ్రీఁదిలకింపనేలుముభుజాగర్వాతిరేకోన్న
తిన్ । బూర్వాస్తాచలమధ్యదేశనివసద్భూపాలమాళిస్ఫుర । ద్గీర్వాణాధిపరత్న
రుఙ్మధుకరోద్దీప్యత్పదాబ్జుండవై ॥ ౫౪ ॥ క ॥ అనిదీవించినిజాత్మజు । వినయవినమ్ర
తకునలరివీడ్కొనిచనియెన్ । మునివేషంబునఁబావన । వనవాసంబునకులోకవ
ర్ణితయశుఁడై ॥ ౫౫ ॥ మ ॥ జనకుండేగినయట్టిపిమ్మటమహాసామ్రాజ్యభారం
బుగై । కొనిమాంధాతృమహీవరుండుగరచెన్ఘోరప్రతాపాగ్నులన్ । వనజా
తప్రభవాండభాండపరిపూర్ణంబైనదృప్యన్నరేం।ద్రనిజస్ఫీతయశఃప్రపంచనవనీతం
బుల్గడున్వ్రేల్మిడిన్ ॥ ౫౬ ॥ సీ ॥ వక్రభావమధిజ్యవరధన్వమునఁగాని తననెమ్మనం

బునఁదగులనీక। నిశితస్వభావంబునిజఖడ్గమునఁగానితనవర్తనంబులఁదగులనీక। వి
శదభావముకీర్తివిలసనంబునఁగానితనమంతనంబునఁదగులనీక। దీర్ఘభావముశత్రు
దీనత్వమునఁగానితనదుకోపంబునఁదగులనీక। యంబుధులుకేళకుళులుకులాచల
ములు। మేడలచక్రగిరిచుట్టుగోడగాఁగ। నవనిఁబాలించెశుద్ధాంతభవనమట్ల।
కీర్తిలక్ష్మీకళత్రుఁడాక్షితివరుండు ॥ ౫౬ ॥ సీ॥ సర్వసర్వంసహాజనమునర్థార్థిగా
కర్థినర్థించుసమర్థమయ్యెఁ। బాతాళముననుండుఫణికచ్ఛపాదులుభారమేమియు
లేనిబ్రమకుఁగనిరి।ఖచరలోకంబునఁగ్రతుభుగ్జనంబులుతృప్తిమైఁగట్టునఁద్రేఁపఁగని
రి।త్రిజగతిసంతతాతిథిమైనకలహాశినయనంబులాఁకటిభయమునడఁచె।గానగుణ
శాలిభూసముద్ధరణదక్షుఁడనిశమఖదీక్షితుండుమర్త్యారిహరణ। వివృతినిరతుండు
యువనాశ్వవిభుసుతుండు। ఘనుఁడుమాంధాతనృపుఁడైనకాలముననుఁ ॥ ౫౭ ॥
శా॥ ఆలోకోత్సవమయ్యెనంతగజగండావిర్భవద్దానకీ। లాలంబంబుజనీతటీవర
మరాళంబుల్ప్రఖ్యాతాంభస్సరి। తూలంబుత్పలగంధముల్లలితవాతూలంబుదీర్ణేం
దురు। జ్జాలంబంగభవానుకూలముశరత్కాలంబురమ్యాకృతిన్ ॥ ౫౯ ॥ సీ॥
జగతీస్థలముపట్టుచాలమిపరికించి చాలించులీలవర్షములువెలిచెఁ। గైకొన్ననీరె
ల్లఁగ్రక్కించిరవినాకవిడుచులీలమొయిళ్లువిరియఁబాఱెఁ।బ్రావృడ్జననితోడఁబా
సినబిడ్డలైపెంపేదినదులశోషింపఁజొచ్చె। రాజులుదండయాత్రలఁద్రొక్కుడ
గుభీతినిలఁజొచ్చెననరొంపులివురఁబాఱె।జలముకలకదేఱెసస్యముల్పక్వంబు।
లగుచువచ్చెఁదెల్లనయ్యెదెసలు। తెల్లుప్రూఁచెనంచలెల్లెడఁగొలఁకుల। నుల్లసిల్లె
శారదోదయమున ॥ ౬౦ ॥ సీ॥ అంబుదంబులఁగల్గునాసారవర్షంబు కరిమ
దంబులయందుఁగ్రాలుకొనియెఁ। కేకికేకలఁగల్గుకాకలీభావంబుకలమగోపి
కలవాగ్గతులఁజేరెఁ। కేతకీతతిగల్గుకృతవికాసస్ఫూర్తి కుందవాటికలపైఁగు
దురుకొనియె। సురచాపమునఁగల్గుపరభాగసంపత్తిచేలకేగెడుశుకశ్రేణిఁజెందె।
బకకులంబులగతివిజృంభణముదంబు। మధురకలహంసకులములనధివసించె। న
ఖిలలోకప్రసాదావహముగవాన। కాలమరుగంగనవశరత్కాలమైన ॥ ౬౧ ॥
చ॥ శరదుదయంబునన్విగతసంకులపంకముకాటమార్గము। ల్గరగరనైననైన
వెసగాజననేరకయుండిరెల్లెడన్।దెరువరులాత్మదృష్టికతిథిత్వముగొల్పెడుపంట
చేలపా। మరసతులంబదంబడుగుమాటికిమాటికిమాటలాడ్చుచున్ ॥ ౬౨ ॥
శా॥ పారావారజలంబులీకొడిఁదెడుంబ్రాపించియేయిచ్చుచో। ధారాగర్జలు
చూపుటంబుధరబృందంబంచుఁగాంతిచ్ఛల।స్మేరుండైకనుపట్టుయామ్యదిశకుంభీ
పుత్రుఁడాపోశన। స్వైరక్రీడనభూషితోఝ్ఝితచతుర్వారాశికుండంతటన్॥౬౩॥
ఉ॥ కైరవబంధుబింబముముఖప్రతిబింబముతద్గతస్మితాం। కూరముశీతలాతప
ముకుండలసూచితమాక్తికావళుల్। తారలుగాశరత్సమయలక్ష్మిగనుంగొనుర

త్నదర్పణా । కారమునన్నభస్స్థలముగన్నులపండువఁ జేసె రాత్రులన్ ॥ ౧౪ ॥ క ॥
ధాత్రీశుఁడంతదిగ్జయ । యాత్రాసంరంభజృంభితాటోపహతిన్ । శాత్రవుల
గుండెలగలఁగ । జైత్రప్రస్థానభేరిఁ జఱపించుటయున్ ॥ ౧౫ ॥ శా ॥ భూకంపం
బుజనింపరొంపిగమహాంభోరాసులుప్పొంగఁగా । లోకాలోకము పెల్లగిల్లఁగ
మరుల్లోకంబుఘూర్ణిల్లన । స్తోకవ్యాప్తినజాండభాండదళనోదభూతధ్వనింబో
లియు । ద్రేకించెన్ విజయప్రయాణహతభేరీభూరిభాంకారముల్ ॥ ౧౬ ॥ సీ ॥
సజలధారాధరసముదయోదయశోభఁ గాఱొఱనుభద్రేభఘటలపెంపు । నూ
ర్మిమాలిసముద్యదూర్మిమాలికలట్ల నడతెంచుఖత్తులాణములమురువు । సురవిమా
నగణావతరణక్రమక్రీడ గమనించుమణిశతాంగములసొబగు । వివిధసింహకిశోర
విహృతివిభ్రమలీలఁ బైకొనుబహువీరభటులముంపు । నలరనానాత్మవిజయచిహ్న
ములుగ్రాల । ఘనరణోల్లాసమాస్యవికాసమొసఁగఁ । దోడుసూపిరిసన్నా
హదోహలమున । దండనాథులునిజబలోద్దండులగుచు ॥ ౧౭ ॥ మ ॥ జగతీమం
డలనాథుఁడప్పుడుచితాచారంబులందీర్చి మే । లగులగ్నంబునజైత్రతూర్యములు
మ్రోయంగాంచనస్యందనా । ధిగతుండై జయవాక్యవైఖరిబుధుల్దీపింపసౌధంబు
లన్ । జిగురుంబోడులుజాలమార్గములు గాసేసల్పయింజల్లఁగన్ ॥ ౧౮ ॥ క ॥
మదవద్గజహయరథభట । పదసరభసఘట్టనాదిబహుభంగురతా । స్పదమగు
చునఖిలధరణియుఁ । గదలంబ్రాఙ్ముఖముగాఁగఁగదలెనొమ్మొదలన్ ॥ ౧౯ ॥ సీ ॥
అంకుశాహతులకుఁగొంకకతమతమ నీడలఁదఱమి వెన్నాడుకరులు । త్రోవచేకొ
న్నదంతావళంబుల మోయఁదఱమిచివుకుఱనదాఁటుహరులు । ఘననేమిరవము
లగర్జించిపగతురఁ గేతనాగ్రములఝుంకించు తేర్లు । తొడివినమైజోళ్లుతుత్తుమురై
రాలనొడలులుప్పొంగఁగేళ్లుఱుకుభటులు । నగుచునడచెలెకఱకగ్గలంబై సేన ।
యఖిలభువనవితతినాక్రమింప । నుగ్రరభసలీలనుద్వేలమైత్రోచు । బహుళవిల
యజలధిలహరులనఁగ ॥ ౨౦ ॥ శా ॥ ప్రసానారభటీవిశృంఖలచమూరాసోత్థి
తాంతర్మదా । వస్థంభద్రగజంబె సైనికులత్రోవంబోవఁగానీకమా । గ్రస్థంబైన
తెఱంగునైనజయముంగల్పింతుభూభర్తకున్ । స్వస్థానస్థితిమీదునిల్పుఁడనున
చ్ఛందంబుగాకుండునే ॥ ౨౧ ॥ ఉ ॥ కత్తికళేబరంబొఱయఁగాశలవుల్దెగిక్రి
మ్మునెత్తుటన్ । జొత్తిలినోరజొల్లలరఁజూపఱకుందలఁపించెనయ్యెడన్ । మత్తిలి
వాగెవెకఱసపు మావుపయోనిధివారివారణా । యత్తమహానలంబునరుదా
రఁగఁగ్రక్కెడుతొంటిగోడికన్ ॥ ౨౨ ॥ మ ॥ అనతారాతివిఖండనప్రణవబా
హాగర్వదుర్వారున । మ్మనువంశోత్తముఁజెందినట్టిప్రమదోన్మాదాతిరేకంబు పెం ।
పునవిశ్వంభరమిన్నుముట్టెననఁగాఁబొంగారెఁదద్భూమిభృ । ద్ఘనసేనాపద
ఘట్టనోత్థితవియద్వ్యాప్తక్షమారేణువుల్ ॥ ౨౩ ॥ సీ ॥ అంబరజంబూఫలంబున

కగచరు లుగ్రరోచికిరాహువిగ్రహములు । అష్టదిఙ్ముఖములకవకుంతనంబులు
మధువత్కరికపూర్వమజ్జనములు । కులమహీధరములకునవాభ్రపఙ్క్తులుజలరా
సులకుఁగుంభసంభవములు । శాత్రవవదనాంబుజములకుఁదుహినముద్ధరలోకదృ
ష్టికిదర్శనిశలు । నెఱసెసర్వంకషంబులైనిబిడగతుల । వివిధరథనేమిహరిఖురద్వి
రదచరణ । భటపదభ్రమణత్వరోత్పాదితములు । రాజవరదండయాత్రాధరా
రజములు ॥ ౨౪ ॥ గీ ॥ బలవిరావమునకుఁబ్రతిఘోషమొసఁగెడు । కులనగం
బులంతగుహలునిండ । నిబిడధూళిపర్వనిశ్శబ్దగతినుండె । నెలుఁగురాశిపలుకవె
డలునట్లు ॥ ౨౫ ॥ గీ॥ ఆత్మమదవృష్టిచేనెలయందువాసి । మీఁదదళమైనధూళి
చేమెఱసియపుడు । ధరణిమోచినహరిదంతదంతికులము । భావమెఱఁగించెసే
నామధావళములు ॥ ౨౬ ॥ గీ ॥ దానధారలచేధరాతలముగడిగి । హస్త
ముఖబిందువుల విహాయసముగడిగి । సైన్యరేణువునడఁగించె సామజములు।
సత్వనిధులోపరెట్లురజంబునడఁప ॥ ౨౭॥ చ ॥ తమకునయత్నసిద్ధముగదానము
లైయలరించుభూపరాగములనవానిచేఁదమకుఁగల్గెడుదానజలాతివృష్టిచే । స
మయఁగఁజేయఁజొచ్చెఁబటుసైన్యమదేభకులంబులప్పని। క్రమునదియట్లమత్తు
లుపకర్తలకేనియుఁగీడుసేయరే ॥ ౨౮ ॥ క ॥తరళనిజఖురనిపాత।స్ఫురదవనివిభు
ప్రపంచమునకపుడంతః।పురములుగనూరఁజొంగలు । గురియఁగఁగడలేకనడచె
గుఱ్ఱపుఁబౌజుల్ ॥ ౨౯ ॥ క॥ ఆశుగహతిచేఁగేతుని। వేశితబిరుదములుపల్లవితవీర
రసా। వేశమునఁబోలెఁగదలఁబ్ర। కాశితముగఁగదలెఁజిత్రగతులరథంబుల్ ॥ ౩౦॥
గీ ॥ నిబిడధూళీభరంబుచేనింగివిఱిగి । పడుమనశ్శంకనెమరానిపట్టినట్లు । హ
స్తకుంతపరంపరలలరవసుధఁ । గప్పుకొనుచుఁబదాతివర్గంబునడచె ॥ ౩౧ ॥ క ॥
బలగతులధూళిమైమొగ। సిలనింగికిరెండుపాళ్లులెగసినవైనన్ । జిలువలఱేనికిఁ
గ్రిందన్ । బలభరమునఁదొంటికంటెభారంబయ్యెన్ ॥ ౩౨ ॥ సీ ॥ ఇలఁద్రొ
క్కుడునకోర్వకెగసిమీఁదెక్కుడుపగిదిఁగెంధూళిపెల్లెగసిమింట । నేలకుఁజోటి
చ్చినింగిక్రిందికిడిగ్గుపగిదిఁగాననములుబయలువడియె। మముఁజొచ్చినారెఱుంగు
ముసుండిరిపులనుమొరయించుగతిమాఱుమ్రోసెగిరులు । తెగువైరులింకభేదిం
తురన్వోరఁబోలెహేతిదీధితులచేనినుఁడుమాసె। నామసమతాభ్యసూయచేనలు
వఁబోలె। వాహినులుదోఁకిపిండిలివండులయ్యె। పిశ్వవిజిగీషమైయావనాశ్వనృ
పతి । నందనునిసేనలందందనడచునపుడు ॥ ౩౩ ॥ క॥ జలభూములధూళియుని।
ర్జలభూములజలములూరజగదద్భుతభం। గులనడచెనమ్మహీపతి । బలవదసం
ఖ్యేయవివిధబలసంఘంబుల్ ॥ ౩౪ ॥ సీ ॥ రథనేమిఘట్టనారవముచేనగలించెఁ
గొందఱహృత్పుటీకోటరముల । దంతికర్ణానిలోద్ధతినార్చెఁగొందఱతీవ్రప్రతాప
ప్రదీపశిఖల।హరిఖురోద్ధతధూళినడఁగించెఁగొందఱయతివేలవీరరసాంబునిధుల ।

భటభుజాస్త్రచ్ఛవిభంగిం జెఁగొందఱగంభీరగర్వాంధకారతతులఁ। గోపనిశ్వా
సమారుతాటోపమహిమ।దూల్చెఁ గొందఱచిరయశఃస్థూలపటలి। విశ్వవిశ్వంభ
రాచక్రవిజయదీక్ష। నెరపుచోఁ జేర్చె మాంధాతృనృపవరుండు ॥ ౫౫ ॥ సీ॥వం
దనంబొనరించె వంగభూమీశుండు మొగిచెఁ గేల్దోయి కాంభోజరాజు। వినతుఁడ
య్యెఁ గళింగవిశ్వంభరాభర్తతలవంచెఁ గాశ్మీరధరణిధవుఁడు। మ్రొక్కె సౌరాష్ట్ర
భూభృత్కులాధీశుండు దండంబు వెట్టె గాంధారినాథుఁ। డభివందనము చేసె
నంగభూపతి నమస్కారంబు గావించె సాల్వవిభుఁడు। గౌళ నేపాళ పాంచాల కా
శకురు। సింధు మరహాట చోళాది సింధువలయ। వలయితాశేషధారుణీశ్వరు
లు చేసి। రంజలులు తన్మహారాజకుంజరునకు ॥ ౫౬ ॥ శా ॥ చిత్తప్రీతి గనప్పునం
బొసఁగి రాసింధుస్థిరానాయకు। లత్తద్దేశవిశేషవస్తువులు మాంధాతృక్షమా
భర్తకుఁ। మత్తేభంబులు తేజులంగనలు హేమంబుల్మణుల్ధేనువు। లొప్పారుత్తం
బుల్మృదు చేలముల్పరిమళంబుల్కన్నరద్వంద్వముల్ ॥ ౫౭ ॥ చ ॥ కులగురు
మంత్రశక్తినవికుంఠితమైనమహారథంబునం। దలముగ తిన్ననుద్రవియదద్రుల
పై విహరింప నేర్చున। బ్బలుమగఁ డేడుదీవుల నుపాయనముల్గొని యష్టదిక్కుభృ
త్తలములవ్రాసె రూఢబిరుదప్రథమానజయాంకమాలికల్ ॥ ౫౮ ॥ శా ॥ లో
కాలోకమహీధ్రముద్రితమహీలోకంబు బాహాబలో। ద్రేకప్రౌఢి జయించి య
మ్మనుకులాధీశావతంసంబు లో। కైకాశ్చర్యకరానుభావవిభవాహంకారరేఖ
మరు। ల్లోకస్కందనలోలుఁడై కదలె నాలోనేకధాటీగతిఁ ॥ ౫౯ ॥ గీ ॥
ఇట్లు సురలోకజయకాంక్ష నేగి బలము। విడిసె సురగిరిపరిసరోర్వీతలమున। నీ
ర్షనైనా రత్నసానువు నెగిరిముంపఁ। గ్రమ్మి తొట్టెడు రత్నాకరంబువోలె ॥ ౬౦ ॥
క ॥ చను దెంచి రహితవీరులు। నను నాగుహలాక్రమించి నడచిరి మొఱయో। య
నియనిమిషులకు మొఱచే। సిన గతిమార్మ్రోన సెనద్రి సేనాధ్వనికిఁ ॥ ౬౧ ॥ క ॥
ఆరవమున మేల్కని సే। నారేణువు చూచి కనలి నభమునకుర యో। దారగతిఁ జౌ
కళించెం। జేరువన పరంజి మెట్టు సింహపుఁ గోదముల్ ॥ ౬౨ ॥ క ॥ శైలాధిప
తికిఁ బృతనా। ధూళీతతి సోఁకకుండఁ దూలించె సము। ద్వేలనిజవాలలీలా। చా
లనముల నినదచకితచమరీమృగముల్ ॥ ౬౩ ॥ క ॥ బలఘోషమునకు మతులం। గ
లఁగియు గిరిగుహలు వెడలఁగా నకపులులా। బలముల ధూళీసంప। ద్విలసనములు
గలయ వేఁట తెరవైకప్పెఁ ॥ ౬౪॥ గీ ॥ మున్నుగాఁ గొందఱేగి చేకొన్నవిడిది।
పట్లసంకేతకేతనప్రతతిగల్గు। బిరుదుప్రతిమలు తమవారిఁ బిలిచెనపుడు। నిజపటాం
చలచలకింకిణీరవముల ॥ ౬౫ ॥ క ॥ పసిఁడిజలపోసనంబుల। నసమరుచిం బొలుచు
గొల్లియనలున్నతి పెం। పెసఁగఁగఁ బసిండిగుబ్బలి। పసిమి నుగులగతిఁ దదంకభాగ
స్థమువై ॥ ౬౬ ॥ ఉ ॥ దూరపథంబు సేదఁబడి తూలుచు వచ్చినవారి వస్తుసం।

భారముదారు మోచినిజపల్లవశయ్యలఁ జెట్లనీడనిం । పారభజించె సైనికుల నప్పు
డరణ్యమహీమహీజము । ల్చేరినవారిఁ జేకొనువిశేషముఁ జెట్లును నెట్లెఱుంగు
నో ॥ ౯౭ ॥ క ॥ అరదము లెండ నెయుండియుఁ । బరిసరవర్తులకు నీడపట్టై నిలి
చెన్ । ధరపైనున్నతులు నిజా । తురతఁ దలంపుదురె యాశ్రితులఁ బ్రోచు నెడన్ ॥ ౯౮ ॥
గీ ॥ ఆశ్రమించిన శిఖిసమూహములు బెదరి । పోయినప్పుడు మును కంటెఁ బొలిచెన
డవి । ద్రుమానులయ్యెడ వివిధసామంతవరుల । పరిజనముఁ జేర్చు పింఛాతపత్రతతు
ల ॥ ౯౯ ॥ చ ॥ పరువులిడంగ నాత్మఖురపాతములం గనకాద్రి చెంగటన్ । గర
ము పరంజిరా మొరసుగట్టపు నేలలు చూర్ణితంబులై । ఖురళికలట్లయాటబల ఘో
టకకోటికి సేదదేరఁగాఁ । బొరలుటకయ్యెడన్ వదకఁ బోవలదయ్యె రజఃప్రదేశము
ల్ ॥ ౧౦౦ ॥ ఉ ॥ కొంచెముగా నిజాంగకము గుంచి ధరిత్రికి నంతయంతలం ।
ఘించిన లేచు దంతిపరికించు జనంబులు గొందఱాత్మభా । వించిర వంధ్యవింధ్యపృథి
వీధర ఘోరతరోదయంబుగా । వించిరి వేఱ కొందఱు త్రివిక్రమవిక్రమ విస్మయస్మృ
తిన్ ॥ ౧౦౧ ॥ ఉ ॥ దాననిరోధమయ్యెడువిధంబు నెఱింగి జలావగాహముల్ ।
మానుప వేఁడికాళ్లను బెనంగొను షట్పదపఙ్క్తులోయనం । గానవశృంఖలాలతలు
గ్రందుగ ద్రోయఁగ నీడ్చికొంచుఁ బె । ల్లేనుఁగులేగె గాండసెలయేరుల మజ్జనమాచ
రింపఁగన్ ॥ ౧౦౨ ॥ గీ ॥ తరళతరకర్ణహతిశంకదనివినిగుడఁ । గ్రోలఁగాలేని తేఁ
టులు కొదువదీఱఁ । గ్రోలెఁ గండూయమానకపోలకషణ । వనకుజాసక్తజలమదావ
శమదంబు ॥ ౧౦౩ ॥ క ॥ తానడ్డంబుగఁ దిగుచుట । నేనుఁగుమఱలంగఁ బఱచ
నేటికిఁ బ్రభవ । స్థానమగు నీలశైలం । బైనెగడం జూపఱులకు నద్భుతమొదవన్ ॥
౧౦౪ ॥ గీ ॥ నతజలావగాహనమున నుత్థితములై । క్రాలె వక్రకరికరంబులపుడు । కుం
భమణినిధానగుప్తికై యున్నత । ఫణములైన కాలఫణులువోలె ॥ ౧౦౫ ॥ శా ॥
ఝుంకారంబుల పేరనింగిదనకై సంకల్పముం జెప్పఁగాఁ । గ్రుంకుల్వెట్టిన కుంభినీప
తిదిశాకూలంకషామోదసా । హంకారంబు గదానమీనలులకున్ హస్తోదకం బిచ్చు
న । ట్లంకారజ్వలబిందువుల్నభముమూయం జేసె ధూతాగ్రముల్ ॥ ౧౦౬ ॥
చ ॥ వనగజదానగంధియగు వాహినివారికి నల్లియంతఁ గై । కొనక తటోపరిస్థల
ముకొమ్ముల చేవిదళింపఁ జొచ్చె నా । ననమునఁ గెంపు దేఱఁ బలనాగము సేరజలంబు
గ్రోలఁగాఁ । దనకు సరోవరంబొకటి ద్రవ్వికొనందలపోసియో యనన్ ॥ ౧౦౭ ॥
గీ ॥ మావటీలంగములధూళిఁ వోవఁగడుగ । మజ్జనంబాడి వెడలుచో మఱియుదా
న । సామజంబులు ధూళి మైఁ జల్లుకొనియె । మందబుద్ధులకొక నియమంబు గల
దె ॥ ౧౦౮ ॥ క ॥ ఘోటకగజపాలురఘుట । చేటీసల్లాపపరత శీఘ్రంబు
గనా । ఘోటకగజములు మాటికి । నీటికిఁ జను తెరువులెల్ల నిబిడములయ్యెన్ ॥
౧౦౯ ॥ సీ ॥ వివిధపదార్థాభివిశదీకృతిం గృతివ్యాకర్తఁ బోలెను వైశ్యుఁ డప్పు ।

డాతిథ్య మొనరించిహరియించె వేశ్యాజనంబు సైనికులయర్థంబులపుడు। హుంకార
శతమునకొండోడకనుగ్రాసకబళముల్భుజియించెగంధకరులు। ఘోటికాస్మృతిన
గ్రఖురములఁద్రవ్వుచుఁగవణముల్దినియె సైంధవకులంబు। నిజనిజాహారతృప్తిమైని
ఖిలజనము । వేణువీణాదిబహుకలక్వాణమెసఁగ । సరససంగీతగీతప్రస
క్తమయ్యె । రమ్యతరమైననవశిబిరస్థలమున ॥ ౧౧౦ ॥ వ ॥ అనంతరం
బయంబుజహితుండ పరాంబుధింగ్రుంకినం గృతోచితాచరణుండై యుత్తరకోస
లేంద్రుండుకర్పూరతైలకరదీపికాసహస్రపరంపరసౌరభవిశేషంబులు సేవాగత
సామంతజనంబులువివిధగంధానులేపనగంధంబులతోడసంబంధబాంధవంబను
సంధింపఁబ్రౌఢపాఠకోత్తములు నిజవిజయాంకమాలికాపఠనంబులవలన శ్రవణ
సుఖంబుగాముఖరంబైనకొలువుకూటంబునఁబేరోలగంబుండునంత దౌవారికుం
డేతెంచి మ్రొక్కిదూతపురస్సరుండైనదైతేయుండొక్కఁడరుగుదెంచి మోసల
నున్నవాఁడనివిన్నవించిననాకస్మికవిస్మయాయత్తచిత్తంబుననాస్థానంబెల్లందదా
గమనసాపేక్షనిరీక్షణంబయ్యె నప్పుడయ్యధిపతియనుమతంబున నాహూతుండై
యేతెంచినిర్భయంబుననహంకారగర్భంబుగాఁ గర్ణకఠోరంబులైన వచనసంద
ర్భంబులం గొలువెల్లవినంబెద్దయెలుంగునవాఁ డిట్లనియె ॥ ౧౧౧ ॥ శా ॥ ఎవ్వాం
డిందధినాథుఁడోయతఁడనాలేతుచ్ఛుఁడామంత్రియిం । దెవ్వండోవినుఁడింకఁ
దక్కినబలాధీశాఖ్యకీటంబులిం । దెవ్వం డెవ్వఁడొమీఁది చేటెఱుఁగరీహీనిక్క
మేరాజులై। క్రొవ్వుల్మీఱమదింగృతార్థులగతింగూర్చున్నవారిందఱుౘ ॥ ౧౧౨ ॥
సీ ॥ కైలాసశిఖరంబుకందుకంబెవ్వనికండూతినిజభుజాదండములకుఁ । గృత్తా
త్మశిరములునెత్తమ్ములెవ్వనినీలకంఠార్చనానియమములకు । శతమఖాంతఃపుర
స్థితములుగ్గెవ్వనియుగ్రాసిపుత్రికాభ్యుదయమునకుఁ । గనకగర్భాండంబుకరఁ
గెడునుయిదయెవ్వనిరోషశిఖిశిఖావైభవమున । కతఁడుదుర్వారదిగ్విజయప్ర
యాణ । సరళమార్గాంతరాంతరసన్నివేశ । భవనవలయీకృతాఖిలభువనకుం
డు । రావణుఁడువొల్చువిశ్వవిద్రావణుండు ॥ ౧౧౩ ॥ వ ॥ అమ్మహావీరుండు
విశ్వవిజయధాటీసమాటోపంబునం బాతాళభూర్భువనంబులాక్రమించి యెదు
ర్పడుశూరుండులేక యుపరిలోకంబైన స్వర్గంబునకుంజనిన సునాసీరాదులునా
సీనవీరులకుఁ బట్టువడినరోసివిడిచి కసివోనిదోర్దర్పభరంబుతోడన మఱలియదె
నికటనగోపరిస్థలంబునవిడిసి యాఁకొన్నబెబ్బులికి మేఁకలకూఁతయుంబోలెఁబ
రసైన్యకలకలంబువినంబడిననెవ్వరని తెలిసిరమ్మనిననతని యానతింబనిపూనివ
చ్చితినస్మత్స్వామియగునతనిపరాక్రమక్రమంబులొకకొంత యెఱింగికొనుండు
వినిపించెద ॥ ౧౧౪ ॥ మ ॥ సమదైరావతదంతముల్వెఱచిబీజశ్రేణిగాసాధ్వ
స । భ[illegible]మధావత్సురలోకరాడపయశఃపంకంబులోనాటిత । ద్రమణీనేత్రజలం

బులంబెనిచియాదైతేయవంశావతం । సముగొల్వెన్నిజకీర్తివల్లికలనాశాకోటి
పైఁబ్రాఁకఁగన్ ॥ ౧౧౫ ॥ క ॥ దనుజపతిమఖములుడుపఁగ । జనితస్వాహావియు
క్తిసమమయ్యెనుద । కిఁగనసురలకంటెననలున । కినుమడియయ్యెంగళత్రమిదె
చెఱపడుటన్ ॥ ౧౧౬ ॥ ఉ ॥ తోడనెలేచిదండముప్రతోదముగానెనుపోతుతో
జముం । డూడినచక్కటిన్ మడుగులూనిననెత్తుటభగ్నశృంగముల్ । ప్రోడత
నంబునందగినబూఱటకొమ్ములుగాఁగఁజల్లుపో । రాడిరినిన్నరావణరణావనిభూ
తపిశాచబాలికల్ ॥ ౧౧౭ ॥ క ॥ బాడుదలఁబట్టుకొలమునఁ । గూడనిచెడు
గంచుఁబెట్టుగొనఁజూచియుఁజే । యాడకవదలిననూడని । బాడెంగోణపుఁడు
దైత్యపతివెనువెనుకన్ ॥ ౧౧౮ ॥ క ॥ తనుఁగట్టఁద్రాళ్లుతానై । కొనివచ్చిన
జాడయనుచుఁగుదియించికరం । బునఁబాశముఁగొనిదానన । వనధీశునిగట్టెనసు
రవర్యుండాజిన్ ॥ ౧౧౯ ॥ గీ ॥ ఆత్మజవమునచ్చిహరిణంబుడిగిభీతిఁ । బాఱఁ
గాళ్లురాకపవనుఁడసుర । లెగిచికూడముట్టియెకిరింతయిరినోరి । గరికిఁదిగిచి
నోరఁగఱచుకొనియె ॥ ౧౨౦ ॥ క ॥ మిడిగడుపుబ్రేఁకమునసొక । యడుగేని
డలేకయున్నయర్థాధిపతిం । బుడమిఁబడఁద్రోచిపైమరు । పడశవములతిట్టపే
ర్చిపరిజనమరిగెన్ ॥ ౧౨౧ ॥ క ॥ కలవాఁడెవ్వఁడుజడఁడను । పలుకునిజం
బాజిఁబట్టువడియునుదనకుం । గలనిధులనుదండువయిడి । తలతోనూఁదఁబడి
పోయెధనదుఁడుగృతినై ॥ ౧౨౨ ॥ గీ ॥ ఎద్దుచేతిపుర్వునెమ్ములుఁబొడతోలు ।
నెల్లకసురవీరుఁడొడిచికొన్న । చంద్రరేఖనాత్మసతీకీర్తిరేఖగాఁ । దలఁచివగచుఁ
జంద్రధరుఁడతండు ॥ ౧౨౩ ॥ గీ ॥ అసురచెఱసాలయందున్నయమరవరుల । నా
రులిప్పుడుధరియించినారుజడలు । ధూర్తరక్షఃప్రతాపాగ్నిధూమరేఖ । లార్త
నిర్జరలోకాపకీర్తిలతల ॥ ౧౨౪ ॥ వ ॥ గుడిబ్రింగువానికిగుడితలుపులప్పడంబు
లని చెప్పవలెనె యీచందంబునశతమఖప్రముఖులంజెఱవట్టినరావణునకునధమ
మర్త్యులుమీరులక్ష్యంబుగారనియెన్న నేలతలంగిపోయినంగట్టువడిబ్రదుకలేరగుట
బుద్ధిమంతులైననమ్మినావెంటనేవచ్చియతని ప్రోలశరణంబు నొందిప్రాణంబు
లుగాచికొనుండనిపలికిన ॥ ౧౨౫ ॥ సీ ॥ అరుణాయమానంబులైచూపులాద
వంగనిండారదెసలునీరెండఁగనియె । నత్యుష్ణగ్రీష్మంబులైయూర్పులాలయంగ
గాఢంబుగావడగాడ్పువీచె । నాసారవర్షంబులైస్వేదములుగ్రమ్మమణికుట్టిమ
స్థలిమడువుకొనియె । సహహాశబ్దమయంబులైహాసములుపర్వఁగ్రందుగావీతెం
చెఁగలకలంబు । దైత్యకులభర్తృభృత్యధూర్తప్రతాప । దండహతపుండరీకో
గ్రదండనాథ । నిర్నిరోధాగ్రహావేశనియతివలన । మనుకులాధీశునాస్థానమం
డపమున ॥ ౧౨౬ ॥ వ ॥ అప్పుడవ్విభుండునునిటలకుటిలభృకుటీకుటీకపటంబు
నంబొగసినదైత్యకులభర్తృభృత్యరోషానలంబునం బొలయుకీలల తెలుపునంగ

నుంగొనలంగెంపుగదుర నెమరనున్నదనుజదూతంజుఱచుఱంగనుంగొని ॥౧౨౭॥
క॥ దూతనని వెఱకప్రేలెదు। దైతేయాధముఁడెదిర్చితానైయనికి । ట్లేతెంచుప
నికిమదిలోఁ । గాతురుఁడైనోరఁబోటుఁగఱపెన్నికన్ ॥ ౧౨౮ ॥ చ ॥ కొ
లిచినవారినేరమునకుంబతిదండ్యుఁడుగాననిప్పునీ । పలికినప్రల్లదంబులకుఁబ్రాప్య
ఫలంబుగనెల్లియాజిలో । నిలిచినయేనిగూతవుగనిన్నిటుపంపినరాక్షసాధమున్ ।
సెలవులువాయఁద్రొక్కివెసజిహ్వయసిన్ మొదలంటఁగోయుదున్ ॥ ౧౨౯ ॥
ఉ ॥ మేరునగంబునివ్వలిసమీపవసుంధరసంగరస్థలం । బోరినిశాచరాధముని
నుగ్రకరుండుదయాద్రికెల్లిదో । తేరకమున్నపోరికరుదెమ్మనరజ్జులుప్రేలిరాని
నాఁ । డూరకపోదుసుమ్మినకులోగ్రకృపాణికరేఁచిపెట్టునన్ ॥ ౧౩౦ ॥ క ॥
అనివానివెడలఁద్రోయం । బనిచిమహీపాలుఁడెల్లిబవరముసుండో । యని
నిఖిలసైన్యములకును । జనితోత్సాహముగవీటఁజాటించుటయున్ ॥ ౧౩౧ ॥
సీ ॥ కైదువులర్చించికలయర్థమంతయునిలుఁజూఱయర్థులకిచ్చువారు । కద
నోత్సవత్వరఁగనుమాయనెఱుఁగకకోర్కిమైవేఁబోకఁగోరువారు । వెడనిద్రగల
లోనవిమతుఁగూల్చితిమనికలువరింతలఁబేరువలుకువారు । పొలయలుకలెడలించి
పొలఁతులచేబిగ్గఁగంఠగ్రహప్రీతిఁగాంచువారు । భానుబింబంబుభేదింపఁబాత
మాడి । యించుపడఁతులమతులుభేదించువారు । సగుచుబలయోధులారేయి
యనుభవించి । రాహవోత్సాహసన్నాహహర్షరసము ॥ ౧౩౨ ॥ గీ ॥ త్రోపువ
డికోపమునదైత్యదూతయంతఁ । గనకధరణీధరాధిత్యకాస్థలమున । నుగ్రదనుజు
లుగొల్వఁగొల్వున్నదనుజ । విభునిసన్నిధినదివిన్నవించుటయును ॥ ౧౩౩ ॥ ఉ ॥
త్రొక్కుడువడ్డభోగిగతిమ్రోఁగిఘృతాహుతిగొన్నయగ్నియ । ట్లాక్కటమండి
దండహతినొందినక్రోల్పులిమాడ్కిఁజూడ్కికిన్ । వెక్కసమైఘనస్వనమువి
న్నమృగేంద్రమువోలెఁబైఁబడన్నిక్కిసురారియాత్మరథినీవరకోటిమొగంబుచూ
చినన్ ॥ ౧౩౪ ॥ వ ॥ విలయపవనజవనఘూర్ణమాన మహార్ణవోద్రేకరేఖావి
డంబకాండంబున భంగక్రూరభ్రూభంగ భంగితంబును నట్టహాసప్రభాఫేనిలం
బును నవిరతోద్భేదస్వేదప్రవాహ పరివారహితంబును నరుణాయమానావలో
కనసచ్ఛురణకలుషితంబునునై తాలగ్రీవచక్రాక్షు జంఝూశ్వాసగుహాముఖసే
తుఘ్రాణతటి జిహ్వాక్రోశబాహుకూటోదర కుంభహనుప్రముఖంబగు దైతే
యసామంత వర్గంబనర్గళారంభసంరంభ విజృంభణంబునం గొలువుకూటంబు
గ్రక్కదలనొక్కంత దిగ్గనలేచి యేచినతమింబ్రాసాసిభిండి వాలశూలప్రముఖ
ప్రహరణముఖంబుల నిప్పుకలుచిటులంద్రిప్పుచు నొండొరుంగడవ నేయంజక్కా
డి యొక్కడెక్కడనియు నెప్పుడెప్పుడనియు నేమేమియనియువిడువిడుమనియు
వివిధ వీరాలాపంబులు గ్రమ్మకొన వీరనృత్యంబు సలిపిరప్పుడు విభీషణుండను

దండనాయకుం డఖండనాదంబునిగుడ భుజాస్ఫాలనం బొనరించుచు నిట్లని
యె ॥ ౧౩౫ ॥ క ॥ పుడమిసమస్తముఁబిడికిటఁ । బొడిపొడిగానుసిమికినియఁ
బొడమినపైచి । త్తడియడఁగఁజల్లుకొందునె । యెడయేటికి లెమ్మనుజ్ఞ యిమ్మసు
రేశా ॥౧౩౬॥ వ ॥ అనినఁ బ్రబలంబకుండను వాఁడిట్లనియె ॥ ౧౩౭ ॥ గీ ॥ ఉదధి
పుడిసిలించి యొకగ్రుక్కఁగొనిలోని । చిలువసెజ్జతోడి జలజనాభు । నరిగిపాఱఁ
గట్టుమనఁద్రెంచిపుత్తునో । క్రాసియుమిసివిడుతునొ సురారి ॥ ౧౩౮ ॥ వ॥ అని
నవిఘసనుండనుదైతేయనాయకుండిట్లనియె ॥ ౧౩౯ ॥ ఉ ॥ తారలచేరుగ్రుచ్చి
యటుతద్ధరియింతునొ భానుబింబనీ । హారమరీచిబింబములనన్నవరైతగఁగర్ణకుం
డలా । కారముగావహింపుమనొ కంజభవాండకరండఖండముం । గోరఁగఁబ
ట్టియీభువనకోటిగుటుక్కనమ్రింగిపుత్తునో ॥ ౧౪౦ ॥ వ ॥ అనిననందఱ మెచ్చ
కనిఘ్నకుండనుయాతుధానప్రధానవీరుండిట్లనియె ॥ ౧౪౧ ॥ చ ॥ శతముఖున
గ్నినంతకునిశాచరుఁబాశిసమీరునర్థపుఁ । సితిగళుఁగిట్టిబిట్టగఁచిచెచ్చెరఁగైకొనితె
చ్చిపేరితో । నితఁడితఁడీతఁడీతఁడితఁడీతఁడితండితఁడంచునింకనే । నితరులువో
లెనిప్పుడిహిహీ వెడపంతములాడనేర్తునే ॥ ౧౪౨ ॥ క ॥ అనిసామంతులపంత
ప్రుఁ । బెనుగాడ్పులతరతరంబుపెరిగెడుననురే । శునికినుపుగడలిమెఱసెనొ । య
నఁదగిప్రస్థానభేరియంతటమ్రోసెన్ ॥ ౧౪౩ ॥ మహాస్రగ్ధర ॥ బలగర్జానాద
వేదప్రణవరవణమైప్రాణిహింసారిరంసా । బలికాలజ్యోళితాపోపమయికలహ
భుక్పారిణామంత్రణంబై । బలవిద్విత్స్వైరకన్యాపరిణయకలనాబంధురాశీఃపదం
బై । పలభుగ్భర్తృప్రయాణప్రతిహతపటహప్రౌఢరావంబెలర్చెన్ ॥ ౧౪౪ ॥
సీ ॥ వింధ్యాద్రికలయఁబర్విన కారుమొయిలు నాఁగఱుకు నెమ్మేనమైమఱువుదొడి
గి । మున్నీటిపైమండుపెన్నెటిచిచ్చుపైతెవణించుమణికిరీటములుదాల్చి । మద
హస్తిపెఱికినమ్రాను చేకొనునట్లువిస్మయంబగునొకవిల్లుపూని । ప్రళయపర్జ
న్యుండుపవిపరంపరవోలె నదురులీనెడునంపపొదలుపూని । యుగ్రకరుఁడు వెం
డియునమోఘునైదాఘు । తీక్ష్ణగతివహించుతెఱఁగుదోఁపఁ । గ్రూరుఁడైనదను
జకులభర్తభయదస । న్నాహకలితుఁడగుచునడరెననికి ॥ ౧౪౫ ॥ వ ॥ ఇట్లు
సమరసన్నాహదోహలంబున రావణాసురుండువిగ్రహం బెత్తియాగ్రహంబు
నమూర్తీభవించినపరాక్రమంబున నాకారంబుగైకొన్నమాత్సర్యంబునఁ బురు
షభావంబుభజించిన క్రౌర్యంబుననవయవంబులుపూనినభయంకరత్వంబున దు
ర్నిరీక్ష్యుండును దుస్సహుండును దుర్నివార్యుండును నగుచుం జిరమనోరథ సిద్ధి
యైనయుద్ధంబుగలిగిన పరమలాభంబుననుల్లంబునం బట్టువడనిమహోల్లాసం
బు వదనదశకంబునకు మందహాసవికాసంబు నొసంగనగరువెడలినిజోద్యోగా
ను రూపంబుగానున్నతంబైన కామగమనంబైన రథంబునారోహించి సామంత

మంత్రిసుతహితాదివర్గంబుల నర్గళారంభంబుననిరుపక్కియలంబిక్కటిలి సేవిం
పధవళఛత్ర డిండీరంబుగాఁదన యంపువెల్లివిరియువీరరసప్రవాహంబున కలం
కారంబుగావిహారంబుచూపు చామరమరాళంబులకరాళదంష్ట్రాప్రభాపూరం
బులు ముకుటంబులుసంపాదింపశంఖకాహళీసంధుక్ష్యమాణంబగుచుఁబాతకప
తనముఖరంబుగానుద్దీపించు నిజప్రతాపపావకునకు సముత్తాలకీలాకలాపంబు
లై ముందఱనందందసందడి జడియుచుంగనత్కనక వేత్ర పరంపరలునర్తింపనరు
దెంచునపుడు ప్రియాదత్తగండూషహాలారసాస్వాదనంబున రణోన్మాదంబె
త్తితత్తరంబున నోరలుపాయందట్టిన పట్టెంబులంకించుచుఁ దమనీడలుదారు
వెన్నాడుచుం బఱతెంచు వెక్కసపుఁగఱకురక్కసులును మఱియు దక్షిణహ
స్తంబులఁదొడిగ్గినయంతనసమరసంతోషంబున నవయవంబులుప్పొంగనితరహ
స్తంబులందొడువనుదొడివినహస్తంబుల వెడలింపనురాకకవచంబులువెను వెం
టవ్రేలికొనంగంచుకంబు లూడ్చినకాలోరగంబుల భంగిమ్రోఁగుచుఁబఱతెంచు
యాతుధానయోధులును మఱియుమనుపుసురల గెలచినసురలోకంబుచూఱఁ
గొనునప్పుడుచెఱఁబడక మఱుంగునందలంగిలోఁ బడకపోయిరగుట నీరణంబు
నంగోలలు మున్నుగాఁదనువులుదొఱంగి వెనుకొను వారమింతసిద్ధంబనిప్రతిజ్ఞులై
యూర్వశినాకు నాకుందిలోత్తమఘృతాచినాకు నాకు మేనకయనుచు నొండొ
రుంగడవఁబంతంబులాడి వివాదించుచుం జనుదెంచునక్తంచర కుమారవీరులు
ను మఱియునాయోధనోత్సవాగమ హర్షాతిశయంబున నుబుసుపోకలీలాప
రత్వంబునం గొందఱుగంధర్వ దంతావళంబులుం గొందఱురథారోహణులుం
గొందఱుత్తమాశ్వంబులునుంగొందఱు రాహుత్తులునుంగొందఱుశతాంగంబు
లునుంగొందఱు రథికసారథులును మఱియునుంగొందఱు భేరుండశరభశార్దూ
లసింహభల్లూకవరాహాదిక్రూరజంతుభేదంబులునై సర్వతోధికంబైన యనివార్య
రభసంబునంగవిసిపఱతెంచు కామరూపధరులగు ధూర్తదనుజులుం గలిగిశతస
హస్రలక్షకోటి శతకోట్యర్బుద న్యర్బుదాదిసంఖ్యలనతిక్రమించి విరించికీజీవలో
కంబుదోడుచూపుభావంబునం జూపఱులచూడ్కికి వెక్కసంబయియొక్కంతఁ
బట్టుసాలక మేరుమహీధరావతరణ మార్గంబునతిక్రమించి నిండుచెఱువవియునీరు
నుంబోలెమహీమండలంబుగలయముంపుచు వివిధవిభీషణక్ష్వేళాసమున్మేషం
బునదిగంతంబునందొట్టుచు నెడవడనియడియాలంపుగొడుగులం బడగలయంత
రాళంబునదంతురంబుగావించుచు వెల్లివిఱియు నమ్మహాసుర చమూసమూహం
బులువిలయసమయంబునం జెలియలి కట్టనతిక్రమించుమహార్ణవతరంగపరం పర
లందలంపించెనివ్విధంబున॥౧౮౬॥సీ॥తీవ్రదంతిప్రభా తేజోధరంబులు విరళాంధ
కారంబు వెన్నడింపఁ। బదసముద్ధతమేరుపదవీపరాగంబు తొలుసంజరుచులకుఁ

దోడుపడఁగ । వివిధతూర్యధ్వనిక్ష్వేళారవంబులు గతనిద్రముగభూతగణము
గలఁప । నస్త్రరోచులుదీప్యదర్కబింబమునకుదీధితిప్రతినిధిస్థితివహింప । భయ
దనిజధాటికాటోపపటిమకులికి । డాఁగిపోయినగతినిశయేగువేళ । నాహవో
త్సాహసన్నాహమతిశయిల్ల । విడిసెఁబతిసేనకెదురొడ్డివిమతసేన॥ ౧౪౭ ॥
వ ॥ సూర్యకులనృపసూర్యుండును సూర్యోదయంబునం గృతకాల్యకరణీయుం
డై జగదండభాండంబు బూరటిలసన్నాహభేరి చఱిపించిదనుజసేనకుం బ్రతిగా
నిజబలంబుల మాఱొడ్డుసంఘటించుటకు దండనాయకులనియోగించిన॥ ౧౪౮ ॥
క ॥ హరికరిగరిహరిహరికరు । లరదమురదముకరిహరులహరికరిరథము । లు పు
రుషునిఁబురుషుఁడురథకరి । హరులంగాచికొనఁబన్నిరధిపతివీటన్ ॥ ౧౪౯ ॥ ఉ ॥
వీళ్లవిరెండుఁబన్నుడుదివింగలహాళనమానిచూడుకలు । వ్వీళ్లుగొనంగఁజొచ్చెన
లవేల్పుపడంతుల నెమ్మనంబుతుం । పిల్లొగిఁగూయఁ జొచ్చెఁదమిఁబెకుకవ
మృత్యువుప్రమింగఁజొచ్చెఁగ్రు । కిక్లవియంగఁజొచ్చెరవికిన్ హృదయంబఖిలం
బునయ్యెడన్ ॥ ౧౫౦ ॥ గీ ॥ పన్నివేగిరించుపరనిజధ్వజనులఁ । జూ
చికోపమేచిత్రోచియపుడు । పోరనొండొకంటిఁబొడుచుటకవనీశ । విబుధ
రిపులు గేలువిడుచుటయును ॥ ౧౫౧ ॥ క ॥ శ్రుతికటువుగనిరువాగునఁ ।
జతురంగధ్వనులుతూర్యశబ్దములేకా । త్మతఁజూపుటయునుదికుకలు । ప్రతి
వాకుకలుగానభిన్నభావముదెలిపెన్ ॥ ౧౫౨ ॥ మ ॥ రతివాదంబులు
దకికభర్తలస్వయంగ్రాహాంకపాళీసమ । న్వితులంగానెనరింపసిద్ధవనితల్ని
ద్రాణకంఠీరవ । ప్రతతుల్గర్జిలనమ్మహాబలయుగా రావంబుభూభృద్గుహా ।
ప్రతిఘోషాధిప దీర్ఘమైపగిలిచెం బంకేజగర్భాండమున్ ॥ ౧౫౩ ॥ గీ ॥
కుంతములఁజిమ్మిశక్తులగ్రుచ్చిమొత్తి । ముసలముల మోఁదికరవాలములదళించి।
పరశువులఁద్రెంచిగదలచేఁబంపుచేసి । ఘోరగతిఁబేర్చి యిరువాగుఁబోరొన
ర్చె ॥ ౧౫౪ ॥ క ॥ కలననొకటొకటిమారొకని । కలసికచాకచివిచిత్రగతిఁ
బోరఁగనా । బలములకుడిగెవిభేదము । బలభటులకుఁగలిగెఁగానిప్రత్యంగము
లన్ ॥ ౧౫౫ ॥ సీ ॥ మదితత్తఱంబెత్తి మొదలప్రొముకలుచూపిపట్టిపైకోకలుపాఱఁ
దిగిచి । కేలిమైగుణములగ్గించియగ్గించుచునడుములుడాకేలఁదొడికిపట్టి । కుటి
లభావములుగైకొనియున్నఁబరికించిపరుసనైరంపిల్లుబిరుసుమెచ్చి । పరిచితస్నే
హానుపాకంబుమదినచ్చివదలకకొప్పులువాలఁదిగిచి । యచ్చలముమీఱిమెలపిన
యట్లవచ్చు । తరుణులునుబోనివిండ్లతోదండిమగలు । విషమశరఖేలనముచూ
పువేళయందు । నభినవక్షతులెసఁగెఁబెల్లంగములను ॥ ౧౫౬ ॥ క ॥ సలలితవి
కాసలక్ష్మీ । నిలయములగుయోధవదననీరజములపైఁ । బొలసెఁబరంపరలైయ
పు । డలఘుశిలీముఖకులంబులారవమెసఁగన్ ॥ ౧౫౭ ॥ క ॥ తొడవినమొడ

లనుఅవికల । నెడలిచియనురక్తరచనతేర్పడభటులఁ । మెడలుగబల్లించివివశ
తఁ । బొడమించెనొక్కారఖడ్గపుత్రికలంతఁ ॥ ౧౫౮ ॥ గీ ॥ పటవణించినయరి
గెలపాఁజుమీఁదఁ । గూడివిలుకాండ్రుతూపులుగురియమ్రోఁత । సమరవీరుల
ద్రిమ్మంగుకోపమునజముఁడు । పెటపెటనఁబంట్లుగీఁటెడుపెల్లుచూపె ॥ ౧౫౯ ॥
గీ ॥ పోటుపూఁచిపట్టునీటెలుదగెరెండు । వీక్షయందుసమరవీరవరుల । ద్రిమ్మఁగ
వెఱచియున్నమృత్యుముఖంబున । బయలువడినదంతపఙ్క్తులనఁగ ॥ ౧౬౦ ॥
గీ ॥ తీవ్రచక్రనిహతిఁదెగికాళ్లుగుత్తుల । కొలఁదికూడిచనినఁగూలఁబడక । నిలిచి
పోరిరపుడునిజహస్తకుంతంబు । లూఁతగాఁగవీరయోధవరులు ॥ ౧౬౧ ॥ క ॥
ఎడమకడవాఁడువొడిచినఁ । గుడిచేబాణములకొఱిగికొఱప్రాణముతోఁ । బుడమి
కివ్రాలఁగఁజేయం । బడకయుశరతల్పవసతిభటులకుఁగలిగెఁ ॥ ౧౬౨ ॥ గీ ॥
విడిచివాటులవీఁపునవెడలుగొరక । లొగ్గినిలుపుటఁగూలకమ్రొగ్గతిల్ల । నీటుదప్పని
యరిగెలచాటుకలిమి । నీల్గియునుగొందఱహితులునిలిచిరాజి ॥ ౧౬౩ ॥ గీ ॥ నన్నుఁ
జిన్నపుచ్చినాకంబుపెద్దసే । యంగఁబోవుటెట్లటంచుఁబుడమిఁ । దెగినవీరు
లరుగుతెరువరికట్టెనా । సమరధూళిమింటసాంద్రమయ్యె ॥ ౧౬౪ ॥ గీ ॥
తూర్యములఁబెట్టుచప్పుడుదోఁపకైన । కప్పుకొనుధూళినొండొరుఁగానకైన ।
పోరనిరువాగునెమరుగఁబొడుచుపోటు । లందునొకటియువృథగాదుక్రందుకలి
మి ॥ ౧౬౫ ॥ క ॥ ఇలకునునింగికిభేదము । గలుగకరణధూళిపర్వఁగానిరుమొ
నలఁ । విలుకాండ్రేసెడితూపులు । నెలవుగనాకసముగాఁడినిలిచెన్నడు
మఁ ॥ ౧౬౬ ॥ గీ ॥ తనువుతనువునుదారొక్కన్నదాఁకఁగాన । రానిబల
ధూళిఁజేతిశస్త్రములువదలి । పొదివియొండొరుఁద్రోపాడిపోరుకతన । మల్లుపో
రాటమైఁబోరుచెల్లెనపుడు ॥ ౧౬౭ ॥ క ॥ తొరఁగెడునెత్తుటఁదేలియు ।
నొరిగెడుప్రాణములనింగియునుగప్పచునా । మరమునధూళియడంచిరి । పర
స్పరాస్త్రములఁగ్రువ్వఁబడువీరభటుల్ ॥ ౧౬౮ ॥ సీ ॥ చెఱకుపన్నిదమాడు
తెఱఁగునగొడ్డండ్ల నడుములురెండుగానటికినటికి । యంత్రమాడెడుభంగిన
ట్టలుదలలునువిడసినధారలవ్రేసివ్రేసి । కఱకుటుల్లుగ్రుచ్చుసంగతినల్వురేవురగుదు
లుగాగొరకలగ్రుచ్చిగ్రుచ్చి । దొంతులకుఱుకురీతులనొడ్డణములతోశిరముల
దొడలఁజిదిపచిదిపి । ప్రల్లదమునఁబలుక్కపంతంబునెకఁడుగాఁ । బోటుగరపు
కన్నపోల్కిఁజూపు । శివములెత్తినట్లుచేతులతీఁటవోఁ । బోరిరిందునందువీరభ
టులు ॥ ౧౬౯ ॥ క ॥ ఇదిహస్తంబదిమస్తం । బిదితొడమెడడొకఁపిక్కయిదికా
లిదిద్రవే । లిదివదనంబిదిరదనం । బిదియిదియనిమెఱుఁగకుండనీల్గిరిసుభటు
ల్ ॥ ౧౭౦ ॥ గీ ॥ ఉభయబలములబిడుమరాహుత్తులెదిరి । తోలుగుఱ్ఱంపు
పాఁజులధూళికతన । నపుడుకాలనిశావేళమైనచోటఁ । దగియెఖద్యోతనా

మంబుతపసునకును ॥ ౧౭౧ ॥ చ ॥ ఇతరబలాంగకోటిగలహింపఁగసంగరభూ తభోజనో|చితముగఁ బ్రోవులై పడియెఁ జిత్రముగాఁగవిరూపరూపము|లుగ్రతలము దూటునక్లెదిరిగుఱ్ఱపురౌతులు వ్రేటులాడన| ద్భుతముగఁదద్భుజక్రియకుఁబో లెడు నట్లుగఁగల్గెఁబచ్చడుల్ ॥౧౭౨॥ క॥ పగరౌతులెడమభుజములు। తెగ వ్రేసినవా గెవట్టు తెరగేదియునుం। దగునిజహయములనద్భుత। మగరాగలసన్న మెలపి పోరిరిరౌతుల్ ॥ ౧౭౩ ॥క ॥ రౌతులసందిటఁగొని చను। రౌతులవడిగుఱ్ఱము లకరొత్తికృపాణీ। సాతితహయులై తిరిగెడు। రౌతులురౌతులయిపోరురణమల రారెౕ ॥ ౧౭౪ ॥ గీ ॥ రౌతువాడిచినఁబుడమికి వ్రాలుభటులు। ఖడ్గములవ్రే యముందటికాళ్లు ద్రెవ్వి। హయముగూలంగనిజపటాగ్రాంతమునన। త్రెళ్లునా రౌతుతలయునుడొల్లనడఁచె ॥ ౧౭౫ ॥ క ॥ నెత్తురుమడువులుపోఁజుల। మొ త్తపుపొదులుగలకలనుమోదముఁబెనుపఁ౯। మత్తకరిఘటలశృంఖల। వృత్తినెదు ర్పడియెరెండువీడులయందుఁ౯ ॥ ౧౭౬ ॥ గీ ॥ ఉపరిసామంతజనము పెంపొప్ప వారి। ణములకులవృద్ధులనిచేరిననెమళులన| నోలినిరువాగుతరులపై వ్రాలుశత్రు| శస్త్రికలు గ్రాలుఫింఛగుచ్ఛములువోలిచె ॥ ౧౭౭ ॥ గీ ॥ ఉభయబలములునె దిరిపోరొడ్డికదియు। కరిఘటలయంతరాళంబుగాననయ్యెఁ। గపటపాఠీనవిహృ తివేగంబువలనఁ। బాయవడితోఁచుజలధిగర్భంబువోలె ॥ ౧౭౮॥క ॥ దూరము నశరముఁలేయుచుఁ। జేరువబల్లెములవొంచి చేరినయపుడా। ధోరణవరులుపర స్పర। వారణములకుఁజికిరిపులవధియించిరని౯ ॥ ౧౭౯ ॥ గీ ॥ క్రొత్తయినుప కట్లకొమ్ములనన్యోన్య। ఘట్టనములనిప్పుకలుజనింపఁ। గర్ణచామరములఁగప్పు చుఁగనొంపొగ। లెగయఁబోటులాడెనిభములపుడు ॥ ౧౮౦॥క ॥ కొమ్ములువిఱి గినబిరుసునఁ। గ్రమ్మరు ప్రతిగజముపార్శ్వకముకరివొడిచె౯। గొమ్ములకొలఁ దియుఁదిగఁబడఁ। గ్రమ్మినదీతటము గ్రొచ్చుకైవడిఁదోఁప౯ ॥ ౧౮౧ ॥ క ॥ కలనంబిఱుసనవయ్యును। బలవద్భద్రేభములకుఁ బ్రతిగజదేహం। బులుమునుఁ గనాఁటికొమ్ములు। వెలువడఁబెఱుగుటకొకింత వెనుచనవలసె౯ ॥ ౧౮౨ ॥క॥ కుంజరమువాజిఁగొమ్ముల గ్రుచ్చియెత్త। జడియకసిధారమావంతుఁబుడమిఁగూ ల। వ్రేసిరాహుత్తుఁడామదద్విపము నెక్కి। మలపిధీకొల్పి శాత్రవబలముఁబఱ పె ॥ ౧౮౩ ॥ గీ ॥ చాయదప్పించికొమ్ములసందికొదిగి। గ్రుంకితొండముఁ దెగ వ్రేసికొంచుఁగాళ్ల। నడుమనరిగినభటునిగానఁడునిజాగ్ర| హస్తఖండంబుభ టుఁడంచుహస్తివొడిచె ॥ ౧౮౪ ॥ క ॥ దురమునమృత్యువుశూరుల। కరము లరెంటనవసించికరులకుశుండా। చరణరదనాలముఖములఁ। దరలకయవ్వేళ యష్టధావసియించె౯ ॥ ౧౮౫ ॥ క ॥ తమయెక్కియున్నమదనా। గములకు ననిపోటుగరపుగా నెదిరినరూ| పము నెల్లఁదారమునుమును। సమయుఁదోఁటంగిం

చిచంపఁజనిరాకొమరుల్ ॥ ౧౭౬ ॥ క ॥ శరములఁదరించిముందఱ । ప
రబలములఁద్రుంచి తెరపిఁబన్నత్రోవలుగా । నరదంబులునడపించుచు । సరినిరు
వాగునురణంబు సలిపిరిరథికుల్ ॥ ౧౭౭ ॥ క ॥ ఆహూతివీరరథిక । క్రూరాశు
గనిహతి నేలఁగూలియున్నైశైలా । కారంబులైనగజములు । తేరులు చనకుండవారి
తెరువరికట్టెన్ ॥౧౭౮॥ వ॥ ఇవ్విధంబున ॥ ౧౭౯ ॥ క ॥ నారదమునిచూడ్కికి
సుఖ । పారణగానింగి వేల్పుపడఁతులయిండ్లం । గోరికనాథులపండువు । గారవి
మండలముడొలుకఁగాననిచెల్లెన్ ॥ ౧౮౦ ॥గీ॥ దురములోఁదఱుచైన నెత్తురు
మడుగులు । కాళ్లుద్రెవ్వినకరులునక్రంబులయ్యె । లూనతత్కరవితతిజలూక
ములయ్యె।భిన్నతత్పదసులముతాఁబేళులయ్యె ॥ ౧౮౧ ॥ క ॥ నలుగడలనట్టలా
డుచుఁ । బొలుపారఁగ మొదలనిడినపుష్పాంజలులై । దళితకరికుంభముక్తా । ఫ
లములురణరంగవీథిఁబ్రకటములయ్యెన్ ॥ ౧౮౨ ॥ క ॥ పలుచని నెత్తురుమడు
గులఁ । బొలిచె౯ రథనేమివలయములురణహతవీ । రులుదూరఁగరవిబింబము ।
దొలుకైరుచిమాలినీడదోఁచినమాడ్కి౯ ॥ ౧౮౩ ॥ క ॥ ఖరభల్లనిహతిఁద్రె
వ్విన । తురగంబులవాలవితతిదురమునఁగ్రొన్నె । త్తురుమడుగులఁజూపట్టె౯ ।
విరిజల్లులఁగుసుమనూనె వ్రేసినమాడ్కి౯ ॥ ౧౮౪ ॥ గీ ॥ ఎదురుపోట్లమిడిసి
మొగసిబోరగిలంగఁ । గూలి నేలఁగఱచుకొన్నదొరలు ।సచ్ఛిమైనఁదముకుసడలని
భూమిభృ।ద్భావలోభ మెఱుకపరచిరపుడు ॥౧౮౫॥ సీ॥ వివిధమాంసంబులువివిధ
భోజ్యములుగా నెత్తురుల్పెక్కుపానీయములుగఁ ।బదహస్తతతులపూపవిశేషము
లుగాఁగబహుగాత్రఖండముల్బచ్చడులుగఁ । బ్రేవులప్రోవులు సేవెలుగాఁదెట్టె
గొన్నక్రొన్నెదడులుజున్నుగాఁగ । ఛిన్నాస్థిఖండముల్చెఱకుముంటలుగాఁగ నె
రవైనయయ్యాటనెయ్యిగాఁగ।సమరవీరులనప్సరస్సతులుపెండ్లియాడునప్పుడు
పెండ్లివిందారగించి । భూతబేతాళఖగమృగవ్రాత మొందెఁ । జాలసంతృప్తి
నారణస్థలమునందు ॥ ౧౮౬ ॥ వ ॥ మఱియునుం గ్రోధంబులకుసామ్రాజ్యం
బునుగ్రూరత్వంబులకు నామనియు మదంబులకుసాఫల్యంబును మాత్సర్యంబులకుఁ
గృతార్థతయు నభిమతంబులకువిలసనంబును నాశ్చర్యంబులకును ద్వేలనంబును
నుత్సాహంబులకుంబురిటిల్లునునున్మాదంబులకుం బ్రాఁకుడునుసాహసంబులకుఁ
బర్వంబును సత్వంబులకుదాయంబును బ్రాయంబులకుంగైసేఁతయుఁబంతం
బులకుంబరిణతయు సత్కీర్తిలతలకుంబాదును స్వర్గంబునకు ఘంటాపథంబును
నగునమ్మహాహవంబునం బేరుకలరౌతులాయశుద్ధిగాఁదారమెఱింగి వ్రేసినజన్ని
దంబువ్రేట్లంబంచి వేసి నగతింగాలు చేయాడకనిలువునంగుప్పలైకూలినపట్లును
నిక్కుబాయలై వడినమొడలునుంబరిఘా ఘాతంబులంబలకలతోడనపునుకలు
తుందునకలై రూపు చెడిమడిసిన చోట్లనువాడిగుదియలమోఁదిన నొడల్లుగుల

సులలైతల మోపులుదిగవైచిన గతిగాలు సేతులాడక నిలువునంగుప్పలైకూలినప
ట్లును నిక్కఁగలడొక్కఁచిప్పలవలనఁగొనంజిమ్మినంబందివొడిచినగతినాపాదచూ
డంబుగా నొదవినక్రొంగంట్లనుడుగక వెడలుక్రొన్నెత్తుటఁజొత్తిల్లిత్రెళ్లిజొత్తు
పాపలవిడంబించు చక్కఁట్లనుజొరువగనితఱిసిగండ్రగొడ్డండ్రఖండించినంగీలెడ
లినజంత్రంబులక్రియనడుములుదెగియపరభాగంబులున్నయట్లయుండనూర్ధ్వభా
గంబులుజాఱినవంకలును మఱియుఁ గుంతతోమరశరశక్తిముసలగదాపట్టసప్రా
సపాశభిండివాలశూలప్రముఖప్రహరణప్రహారంబులంగన్నువెన్నుడొక్కపిక్క
కాలుప్రేలను భేదంబు సేయరాక కలిపిక్రుమ్మినగతిందఱిగి మెదపినతెఱంగునంగు
డిచిక్రక్కినచందంబునంబగిలియునొగిలియు దుసిసియుంచుమురయ్యుంగండలునె
త్తురుంబ్రేవులుమెదళ్లునుగలయంబడిపేరి పేరెండతాఁకునంగరంగినిగ్గుదేఱుతా
వులను వెండియు నెండెడలంగుంభముక్తముక్తాఫలశర్కరీలంబులగు నేనికమె
దళ్లు కెళ్లుకొనియు నమలిచవిగొనలేక మరలవెడలఁగ్రక్కుడాకి నీగణంబులును
మాంసంబులే పెరిగిమిసమిసలువారుమృతసామంతజనంబులపెన్నురంబులన్న
నంగవిసికబళ్లించియంతర్మగ్నభగ్నంబులగునస్త్రభంగంబులంగుళ్లనాటినమిట్టిప
డివెరదేఱనోళ్లు విదిర్చికొనుచుం బారుభూతవ్రాతంబునురక్తపానమదోన్మత్తం
బులై ద్విపరదనఖండంబులందురంగవదనంబులుచేర్చికిన్నరాకారంబులుపన్నియు
గజవక్త్రంబులుగూర్చి గణపతిప్రతిమలుసేసియు నెక్కొఁకటంబెక్కుతలలు
హత్తించి చతుర్ముఖషణ్ముఖాదిరూపంబులొనర్చియుం బరితఃపతితమృతవీరులత
నుత్రాణశిరస్త్రాణభూషణ వస్త్రవిశేషంబుల యథాతథంబులుగాఁబూన్చిమా
తంగతురంగశవంబులారోహింపించి లెమ్మనుచు నార్చిమోదియు వినోదించు
పిశాచలోకంబును నిజముఖాగ్రఘట్టనంబులచేతం బ్రహారవశంబునంగప్పి నమూ
ర్ఛలుదెప్పిరిలి కొఱప్రాణంబులతోఁ బొరలువీర యోధులపైమూఁగుచు విరియు
చు జిఱ్ఱుమట్టాడు కాకోలూకాదివిహంగసంఘంబులును శతమతింబతితకేతన
బిసదప్రతిమలంగదిసి పసిగొనంగదిలిన నెదిరిఝుంకించుటగాశంకించి వెనుకద్రొ
క్కనక్కపదువులుంగలిగి మహాప్రళయంబునుంబోలె సర్వతఃకబంధబంధురం
బును దివసావసానసమయంబునుంబోలె వియుక్తరథాంగసంఘంబును నంధ
కారంబునుంబోలె హతసహస్రాతపత్రంబును మత్తురాజ్యంబునుంబోలె విధ్వ
స్తసమస్తధర్మంబును సుకవికవితయుంబోలె భగ్నోరుపార్సంబునుశూన్యపురం
బునుంబోలె శిథిలపరిఘాకులంబును వార్ధకంబునుంబోలె భిన్నగదాసంకులంబు
ను అవగ్రహంబునుంబోలెఁ బ్రశాంతనిశ్శేషవాహినీసంకులంబునునై సంగ్రామ
రంగంబుచూపఱకు వెరపువెరగు వెక్కసపాటునొదవించె నయ్యవసరంబున॥
గీ॥ బలములడఁగినఁదమకెదుర్పడగఁదెరపి। గలుగుటకుఁబొంగియార్చిశంఖంబు

లూత్తి। తాఁకిరెక్కటిరెండుమొత్తములుదొరలు। నోర్చిఫణిపతితలలునుఱ్ఱూఁ తలూఁగ ॥౧౯౮॥ క॥ కడపడకకూలుగోడుగులుఁ। బడగలుఁజామరలుఁగలయఁ బడిమూర్ఛితులై। పడియెడుతారలకుమునుము। న్నొడఁగూడెడుమెత్తపఱపునొ అపువహించెన్ ॥ ౧౯౯ ॥ గీ॥ యోధవరులయొడళ్లుపెల్లుబ్బిపాఱి। తన్నుఁ గట్టినతూపులతలుచువలన। నెత్తురులఁగొమ్మెదళ్లుమునింగిసమర। [illegible]రణిగిరు పాఱియున్నవిధంబుసూపె ॥ ౨౦౦ ॥ క॥ ఈరీతినుభయబలములు। పోరా డఁగఁదత్ప్రతాపములుసూచిమదిం। గూరినలజ్జఁబ్రతాప। ప్రారంభంబుడుగు నట్లభానుఁడుగ్రుంకెన్ ॥౨౦౧॥ క॥ అనిఁదెగువీరులుదివికిం। జనుచుందనుఁజిం చికొనుచుఁజనఁజనసంధ్యా। ఘనదీప్తిరుధిరమొలుకఁగ। ననువఱియనుఁడస్త్రశిఖ రినల్లనసోలెన్ ॥ ౨౦౨ ॥ క॥ కదనమునఁగినియుశూరుల। వదనంబులఁబదను గొనుచువడినాకసముల్। బొదివెనొకోసమరశోణిత। సదమలరుచులనఁగఁ బర్వెసాంధ్యమరీచుల్ ॥ ౨౦౩ ॥ గీ॥ భానుకులముఖ్యుబలముపైఁబగఁదలం చి। తననిశాచరవరులబాంధవముదలఁచి। పోరనోడింపగెలిపింపఁబూనికాదె। పర్వెననని ర్లుదట్టమైపర్వుటయును ॥ ౨౦౪ ॥ వ॥ అట్టియెడంబ్రళయసమయం బునవిడివడిన మహావలాహకంబునుంబోలె దిశావలయంబద్రువగర్జిల్లుచు నిజత నుచ్ఛాయాచ్ఛటాస్ఫురణంబునం జిమ్మచీఁకటిరెట్టింపం గుటిలచటులదంష్ట్రా ఘట్టనంబులంజిటులు విస్ఫులింగంబులు విద్యోతమానఖద్యోతంబులకుం బ్రాపు చూపంగఠోరహుంకార భయంకరంబులగుచుం గులాచలమహాగుహాకుహరం బుల విడంబించు వదనగహ్వరంబులకంఠపర్యంతంబుగాఁదెఱచి యెదిరించు వీరులంబట్టివిఱిచివైచుకొని మ్రింగుచుంబొంగుచుం బ్రహస్తమహాకాయప్రముఖ ప్రధానవర్గంబునునగ్నికేతురశ్మికేతు విరూపాక్షాదిబలాధ్యక్షులు నింద్రజిదతికా యదేవాంతకనరాంతక ప్రభృతికుమారులును మున్నుగానసంఖ్యేయులగు యా తుధానవీరులేచి త్రోచిహాలాహలానలంబు ద్వేలనంబుచూపు రూపునంగవిసెని జమాయావిజృంభణంబులమహార్ణవంబు వెల్లివిరియించియుం బ్రళయానలజ్వా లాకలాపంబులంజుట్టుకొలిపియుం గ్రూరోరగపాశంబులంగట్టువఱచియునఖండ గండశిలావర్షంబు లొండొండఁబయింగురియించియు మఱియుననేకంబులగు మి థ్యామహోత్పాతకల్పంబులభ్రమియించిగుండియలవియించినంజెదరిబెదరిన సజ్జనవచనంబులునుంబోలె మఱుగులేక సాధుజనంబునుంబోలె నొకఁడొకని తెఱువువోకయా మనిక్రొన్ననలునుంబోలెఁబరువుమిగిలియమ్మహీనాథుయోధు లాయోధనంబుమఱచి వెఱచఱచి దైన్యంబులతోడనకైదువలు విడిచియుండో రుంగడచివిజయశంఖ నాదంబులతోడంబిశితాశనవీరులార్చుచును వెనుకందల లుపీడంబఱచిన ॥ ౨౦౫ ॥ శా॥ కించిద్భ్రూకుటిఫాలవీధిమెలయంగింకమ్మహీ

భర్తదో । రంచచ్చాపగుణధ్వనుల్చెలఁగబాణౌఘంబుచేయామినీ । సంచారో
ద్ధతులైనరక్కసుల నాశ్చర్యంబుగావ్రేల్మిడిం । జించెంద్రుంచెవధించెనొంచె
నొలచెంజెండాడెఁజండాకృతిన్ ॥ ౨౦౬ ॥ క ॥ మిడియుతలలతునియ
నడుమును । బడుతొడయునువిఱుగుకాలు పగులుతనువులై । బడలువడియ
సురబలములు ।పొడవడఁగెన్విభునిబాణములవెల్లువలన్ ॥ ౨౦౭ ॥ క ॥ ప
రహృదయకమలభేదక । శరకిరణసహస్రకర్కశంబైమనుజే । శ్వరకర
వలయితమగువిలు । పరికింపఁగఁదత్ప్రతాపభాస్కరుఁడయ్యెన్ ॥ ౨౦౮ ॥ క॥
కనుఁగొననొకఁడయ్యుమహా । త్యనుమితమైనైకమయ్యెనధిపతితెగకె । కిక్కన
తూపుతీవ్రభావం । బునదీపజ్వాలవోలెభువనాద్భుతమై ॥ ౨౦౯ ॥ మ ॥ అది
యెల్లంగనిరావణుండులయకాలాగ్నిక్రియన్మండుచుం । బదిదిక్కుల్పదినోళ్లచే
తఁగబళింపంజూచుచందంబునన్ । వదనౌఘంబపుడట్టహాసరచన । వ్యాలోల
జిహ్వాభయ । ప్రదమైయుండఁగవిస్ఫులింగములునేత్రశ్రేణివర్షింపఁగన్ ॥ ౨౧౦ ॥
క ॥ నిలునిలునృపనీవగుదువు । బలియుఁడనీబీరమెల్లఁబదిలపఱుపునీ । పలలములు
నీకునోడిన । పలభుక్కులమునకుఁబంచిపొలిదువాఁడన్ ॥ ౨౧౧ ॥ గీ ॥ కా
మువోవ్రేఁగునాఁడుముక్కంటితోడ । వెండికొండయునాభుజాదండమునకు ।
దురముగఱవొటనైన ప్రాఁద్రుప్పుతోడి । చంద్రహాసంబురీతి నోజనవరే
ణ్య ॥ ౨౧౨ ॥ క ॥ బలభిత్ప్రభృతులెదుర్పడ । బలవంతులుగామిఁబ్రాఁత
వడినకృపాణం । బులుగడుగువాఁడనిదెనీ । గళరక్తముచేతనేఁడుఖరకరవం
శా ॥ ౨౧౩ ॥ గీ ॥ అనినఁదద్వచోనిలాహతిఁగోపాబ్ధి । వెల్లివిరిసినెఱసివేల
ముంచి । తొట్టిమెఱయునురుగుదెట్టువవోలెఁగె । మ్మోవిఁజిఱుతనవ్వుమొలక
లెత్తె ॥ ౨౧౪ ॥ క ॥ తనుఁదానెపొగడుకొనుటది । ఘనమతులపథంబుగాదు
కైదువచేతం । గొనియుండియునసురాధమ । పనిమాలినరజ్జులాడఁబౌరుషము
గునే ॥ ౨౧౫ ॥ వ ॥ అనినమిగులం గోపించి ॥ ౨౧౬ ॥ క ॥ ఒకవింటికిఁబ
దివిండ్లను । బ్రకటించినఁగాదునాకుఁబంతముపరిపం । థికిఁబెంపొసఁగుటయనివి
ల్లొకటనెదనుజేంద్రుఁడేసెనుగ్రాస్త్రంబుల్ ॥ ౨౧౭ ॥ మ ॥ అవిదోడ్తోఁదమను
మాడిభూవరుఁడునుగ్రాకారుఁడైశింజినీ । రవమాశాంతరముంజెవుడ్పఱపనా
రాచంబులొక్కుమ్మడిం । గవియింపందశకంఠుఁడద్భుతరసక్రాంతాత్ముఁడైహ
స్తలా । ఘవమగ్గించితదీయబాణవితతుల్ ఖండింపరాకుండుటన్ ॥ ౨౧౮ ॥ క ॥
ఒండువిలుసాలమినివే।ఱొండొకవిల్లెత్తిచాలకుండినఁబైఁబై । నొండొండఁబూ
నఁగార్ముక । దండంబులువదియునయ్యెదశకంఠునకున్ ॥ ౨౧౯ ॥ క ॥ వదలక
విభుఁడునువివిధప్రదరంబులవెల్లిగొలుపఁబటువగుదీప్తుల్ । పొదిగొన్నవేళనింగి
యుఁ । దుదినేమనిచెప్పనంపదొనమైతోఁచెన్ ॥ ౨౨౦ ॥ సీ ॥ భూరితరంగి

తాంభోధమైకనుపట్టునురగకులంబుచే నొక్కమాటు । నికటకాంచనరాజినిక షోపలముఁబోలునురుగరుత్మతాక్కాంతినొక్కమాటు । కాచపాకక్రియాకరకుటీరముఁబోలుహుతవహజ్వాలలనొక్కమాటు । చటులమహో వటక్ష్మారుహంబునుబోలునుదకధారలచేత నొక్కమాటు । నభముచూపలకిట్లమాంధాతృమనుజ । నాయకుండునురాక్షసనాయకుండు । నిగిడిపన్నగమారుతాగ్నేయవారు । ణాదిదివ్యాస్త్రములఁబోరునాహవమున ॥ ౨౨౧ ॥ చ ॥ ఉడుగక పెద్దకాలమిటులొండొరుగెల్వఁగలేకకోపము। ల్విడువకపోరిపోరితుదవేసరిదైత్యుఁడుచంద్రహాసముం । బుడమివిభుండుపాశుపతమున్విడిఁబూనినమ్రొగ్గదిక్కరు । ల్జడధులుఘూర్ణిలెంబెకలైశైలములల్లలనాడెలోకముల్ ॥ ౨౨౨ ॥ గీ ॥ అంధులై చేయునదిలేకయమరులింకఁ । క్రుంగెఁబోవిశ్వమింతటితోడననఁగ । నంతలోననవారలయంతరమున । నలికనేత్రుండుప్రత్యక్షమగుచునిలిచె ॥ ౨౨౩ ॥ శా ॥ ఓహోహాచాలుఁబు రేమహాహవముమీకొండొక్కరుండక్కఁగా । బాహాహంకృతియొందువేరసరిచెప్పంగానమీవిశ్వని । ర్దాహక్రీడకుమిమ్ముఁబంపడితినేతప్పయ్యెమీకీజగ । ద్ద్రోహంబేటికిఁబొండుమీరిరువురుందుల్యప్రభావాధికుల్ ॥ ౨౨౪ ॥ గీ ॥ అనినహరునియాజ్ఞకసురేంద్రుఁడట్లకా । సమ్మతించెవిభుఁడుసమ్మతిలక । యసితుమీఁదికోపమారకభువనంబు । తలఁకభవునిజూచిపలికెనపుడు ॥ ౨౨౫ ॥ క ॥ నినుదశశిరములఁబూజించినవాఁడనికాదెవీనిఁజేపట్టితివే । నునునీమదిదెక్కినయా । తనితలలంత్రుంచినిన్నుఁదగఁబూజింతుర్ ॥ ౨౨౬ ॥ వ ॥ అనుటయు ॥ ౨౨౭ ॥ ఉ ॥ మెచ్చిహరుండురాజవినుమీయొకమాటమదంఘ్రిభక్తిసం । పచ్చరితార్థుఁడీయసురభక్తనిసర్గబలాధికుండవీ । విచ్చితినీకయజ్జయమునింతియకామువరంబునొక్కటే । నిచ్చితినిన్నునెవ్వఁడుజయింపఁడుపొమ్ముజగత్త్రయంబునన్ ॥ ౨౨౮ ॥ గీ ॥ అనివిభుండుసేయువినయంబుగైకొని । పోయెహరుఁడుదిన్నఁబోయెనసుర । విజయశాలియపుడువిజయకాహళములు । మొరయసాత్మసైన్యములుభజింప ॥ ౨౨౯ ॥ ఉ ॥ హేలమెయిన్మహీరమణుఁడెక్కెను నిశ్చలనమ్రదేవతా । సాలముగంధరస్థసురచారణదంపతిగానవీచివా । చాలముఁదుంగశృంగతటసక్తమణీపునరుక్తతారకా । జాలముఁబారిజాతవనసంస్థితిమూలముహేమశైలమున్ ॥ ౨౩౦ ॥ వ ॥ మఱియు నమ్మహామహీధరంబు తారకితనభోభాగంబునుంబోలెం బ్రతిఫలితోత్తుంగశృంగ తరుప్రసవపరంపరావిరాజితంబులగు విశాలహరినీలవప్ర స్థలంబులచేతను వప్రస్థలంబులవ్రేలుచు మొదలంగులిశఖండితంబులైనపట్లం గ్రమ్మఱనిగిర్చిమొలచి పొలుచుపక్షశ్రేణియుంబోలెఁగనుపట్టి నవీనధారాధరంబులచేతను ధారాధరంబులమదాంధసింధురంబులనురోషంబునఘోషింపుచుం బయింబడనుఱికి నిజనిపాతవిశీర్ణగర్భంబులగున

య్యంబుధరగర్భంబులుదొఱఁగి ధాతుస్థలంబులంబొరలి పాఱునీరంబులురక్తపూరంబులంబ్రోవులై గానంబడు వడగండ్లుగుంభ నిర్ముక్త ముక్తాఫలంబులుగాఁదలంచిగర్జించు సింహకిశోరంబులచేతను, సింహకిశోరంబులజాడలువెనుకొనుభిల్లపల్లవాధరధనుర్గుణక్వణనంబులుగుహాముఖంబులం బ్రతిశబ్దంబులు చూపమేఘ గర్జితంబులనుతర్కింతంబులై యాలకించు నీలకంఠంబుల ముఖంబులంగబళితవాలంబులై వ్రేలెడుఫణుల ఫణామణులు ప్రాకులకులంబుల కుదివియలై వెలుంగఁజీఁకటిమెఱుంగని దినకరకర నికరదురధిగమ వనీగర్భంబులం గ్రీడాగృహంబులును మఱియుఁబ్రతిరాత్రంబును వెన్నెలలంగఱంగునుపరిచంద్రకాంతంబుల జలంబులుపయిందొరుఁగఁ దట్టిఘర్షణంబునంజలిత పటీరతరుశాఖలవలన జారిక్రిందమృగనాభిమృగాధ్యాస్తవిస్తీర్ణశిలాతలంబులుగుప్పలు గొనితత్పరిమళమిళితంబులైనచందనపంకంబులను లేపంబులను వెండియునర్కకిరణసంపర్కంబునసూర్యకాంతంబులంజిటిలెడునలకణపరంపరలసోఁకునం బరిసరమదకరిభగ్నకాలాగరుతరుకాష్ఠంబులవలననెగసిపరిభ్రమచ్చమరీ మృగవాలవీజనవశంబునంగలయవిరిసినెరసికమ్మతావులుబుగులుకొనునునుఁబొగ ధూపంబులుగొనఁబ్రయత్నసిద్ధోపచారంబులుద్దీపనంబుంగొలుపనిచ్ఛావిహారంబులంగ్రీడించుకిన్నర మిథునంబులచేతనుగిన్నరమిథునంబులుమధురగీతికలంగరంగునుపల కులంబులజలంబులుగూడి యేఱులై ప్రవహింపనిమ్నోన్నతస్థలపత నావసరంబులంబెల్లెగసిగగనలక్ష్మీశిరంబునన చలపతితననించుసేసఁ బ్రాలచందంబుననందంబులగుజలకణాసారంబులచేతనుం గన్నులపండువుసేయుచు భగవంతుండునుంబోలెభృగుపాదలక్షితోత్కర్షంబును జతుర్ముఖుండునుంబోలె హంసోపరివిలసితంబును శంకరుండునుంబోలె నిజమూర్ధన్యంతర్గతచంద్రంబును బురందరుండునుంబోలెనధఃకృదభీష్టవృష్టిదమేఘంబును, ఐరావతంబునుంబోలె నఖండగండస్థలప్రమదాపాదకంబును శబ్దశాస్త్రంబునుంబోలెఁ బ్రకలితధాతువిశేషంబును, చార్వాకసిద్ధాంతంబునుంబోలెఁ గూటయుక్తిప్రతిషిద్ధాకాశంబునునై వెండియునొండుచందంబునభీమసత్వసంపన్నంబయ్యును, గీచకకులవర్ధనకారణంబును గుహాశోభితంబయ్యును దారకాసుర విహారోచితస్థానంబును బహుకోటివజ్రవిజృంభితంబయ్యును గరుత్మదుపలకలితంబును నిరంతర చంద్రకాంతంబయ్యును బద్మరాగపరభాగ స్ఫురితంబునగు విచిత్రశోభాస్పదంబగు నన్నగోత్తమంబునంగలుగు వివిధవిశేషంబుల కరుదందుచు నుత్సాహంబున ॥ ౨౩౧ ॥

క॥ మేరునగమెక్కియటఁజని । యారాజశిరోవతం సమటఁగాంచిసుధా ।
ధారాపాతక్షాళిత । రారాజత్కనక కంధరముమంధరముఁ ॥ ౨౩౨ ॥

సీ॥ కస్తూరి కామృగీకర్ణేజపంబులు నిర్ఝరీనివహాపాణింధమములు । బహు

మహీజపరాగపశ్యతోహరములు ఫణిమిథునప్రియభావుకములు । శబరసతీరతి
శ్రమతాళవృంతముల్ వంశసారస్వతావాపకములు । చమరవాలసమీరసద్బ్ర
హ్మవాదులు తతబర్హిబర్హసంధాయకములు । కుంజవిహృతికళాభద్రకుం
జరములు । మందరాచలవనమందమారుతంబు । లెమరుకొననమ్మహాగిరిమె
క్కియందు । జనవరుఁడునిల్పె నిజజయస్తంభపటలి ॥ ౨౩౩ ॥ వ ॥ ఇట్లుస్వ
ర్గపురప్రాంగణ క్రీడాశైలంబైనమందర మహీధరంబుపయింజయస్తంభంబుప్రవే
సిన ॥౨౩౪॥ ఉ॥ విస్మయమగ్నుఁడైయటకు వృత్రహరుండరుదెంచిభూవిభుఁ ।
సస్మితసాధువాక్యరచనంబ్రియమాడివిరోధిమండలీ । ఘస్మరినీకుసీడుత్రిజగంబుల
లేరనిమెన్న నేలశౌ । ర్యస్మయరేఖరావణ మహాసురగెల్చితివాజినెకఁటిఁ ॥
తే ॥ గీ ॥ అనుచునగ్గింపఁబూజించియనుపమరలి । ఖేచరీగీతవిఖ్యాతకీర్తియ
గుచు । విజయవాదిత్రములుమ్రోయనిజపురంబు । వేడ్కఁ మెయిఁజొచ్చిపాలించె
విశ్వధరణి ॥ ౨౩౫ ॥ ఉ॥ ఫూతపిహారహారరుచిపూరతరంగితవత్సవత్సల। త్వా
తిశయాత్మదావినయ దాంతికగోచరగోచరాంగనా । జాతపయఃపురోహరభు
జంగ భుజంగశయానయానలీ । లాతురగోత్తమక్రమవిలం ఘనచంచలకుండ
లాంచలా ॥ ౨౩౬ ॥ క ॥ గోవర్ధనధృతిదర్శిత । గోవర్ధననిజఘృణానుగుణ
సజ్జనబృం । దావనపదపాలితబృం । దావనసంశ్రితకృతాసుధావనచరితా ॥
స్రగ్విణి ॥ సమాశ్రితవిశేషణాసమత విద్విషద్భీషణా । సమాయతచతుర్భుజా
సమర రంగభూభృద్భుజా । నమఃపతపరాయణానత జనార్తిజంబాలమా । ల
ముద్యజఘృణాసుధాలహరిఘూర్ణమానార్ణవా ॥ ౨౩౭ ॥ * *

గద్య ॥ ఇది శ్రీ మద్భట్టపరాశరదేశికేంద్రచరణ సరసీరుహసేవకో
పసేవకనరసింహ నామధేయప్రణీతంబైన కవికర్ణరసాయనంబను కావ్యంబు
నందుద్వితీయాశ్వాసము ॥ ... ... ... *

శ్రీరామచంద్రార్పణమస్తు.

శ్రీ రస్తు.

# కవికర్ణరసాయనము.

## తృతీయాశ్వాసము.

శ్రీరంగవలయరూఢా । ధారమహీరుహాసమస్తధరణీతరుణి । హారాయమానవిమలక । వేరసుతామధ్యఖచితవిమలేంద్రమణీ ॥ ౧ ॥ వ ॥ ఇట్లువిశ్వదిగ్విజయంబుసేసి మాంధాతృ మహీమండలేశ్వరుండు జగత్సామ్రాజ్యంబు గారాజ్యంబుసేయుచున్నకాలంబున ॥ ౨ ॥ క ॥ చిత్తరువువ్రాయనేర్చిన । యుత్తమశిల్పకులువచ్చి యొకయిద్దఱుభూభృత్తపనుఁగాంచియవ్విభు । చిత్తమురంజించిరాత్మచిత్రక్రియలన్ ॥ ౩ ॥ క ॥ మెచ్చితమకమ్మహీవరుఁ । డిచ్చుపదార్థంబులొల్లకేమిచ్చటికిన్ । వచ్చుటకుఁగారణముగల । దిచ్చంగృపసేయవలయునేకాంతంబున్ ॥ ౪ ॥ వ ॥ అనిన ననుగ్రహాతిరేకంబునం గార్యజిజ్ఞాసాకుతూహలంబుననట్లయేకాంతంబొసంగినవారలిట్లనివిన్నవించిరి ॥ ౫ ॥ క ॥ కుంతలపతికింగలదలి । కుంతలవిమలాంగియనఁగఁగూఁతురురజనీ । కాంతునిపదియేడవకళ । కంతునియాజవశరంబుగణుతింపంగన్ ॥ ౬ ॥ గీ ॥ రత్నపుత్రికవోలెనారాజకన్య । పుట్టినప్పుడయొకమహాద్భుతపుఁగాంతి । నుదయమందినఁగనుఁగొనియుచితమగుటఁ । దండ్రివిమలాంగియనుపేరుదానికిడియె ॥ ౭ ॥ గీ ॥ కన్యయైమాకొకానొకకారణమునఁ । గలిగెనదిదేవతామూర్తిగానిమనుజ । జాతిగాదనిబహుమానసహితమతులఁ । దల్లిదండ్రులుపెనుపనత్తన్వి పెరిగె ॥ ౮ ॥ క ॥ కుందనముగమ్మవలపుం । జెందెడుచందమునఁదెల్లచెఱకునఁబండై । సుందరియగునకన్నియ । యందెలప్రాయంబువిడువనాయతమయ్యెన్ ॥ ౯ ॥ క ॥ తొడరియుఁదొడరనిసిగ్గునఁ । బొడమియుఁబొడమనియురోజములచాపలమున్ । విడిచియువిడువనినడపులఁ । బడఁతుకపైనూఁగునూఁగుప్రాయంబయ్యెన్ ॥ ౧౦ ॥

చ॥ దివసమువోలె శైశవముదీఱఁగఁబ్రాయపురేయిదోఁచుచో । నవకపుమోవికెంపునఁగనంబడిమన్ నెఱసంజవోలెన । కువలయపత్రనేత్రనవకుంతలబాలతమోవితానముల్ ; గవియఁగఁదానఁబోమరునిగర్వముదుర్వహమయ్యెనయ్యెడన్॥

చ॥ గురుకుచకుంభసంస్థితికిఁగూడెనురంబుననాలవాలముల్ । పొరసెఁగురుల్ ముఖాబ్జమునఁబొడ్మెడుతావికిఁజేరుతేఁటులై । గరువపుఁజూపులోరసిలెఁగన్నులక్రేవకుసిగ్గలర్పనా । వరనృపకన్యయందభినవంబుగజవ్వనమంకురింపఁగన్॥౧౨॥

చ ॥ విరివియెకానిపైపొడవు వెల్వడకుండెడుపూఁపచన్నులన్ । సరవియెకాని

దంతురతచాలనిసన్నపుముత్తరంగలన్ । దరళవిధంబె కాని సిరితత్త్వమెఱుంగ
నిక్రొత్తచూపులన్ । సరసిజనేత్రపాల్పెసఁగె శైశవయవ్వనసంధిచూడఁ
గన్ ॥ ౧౩ ॥ సీ ॥ విస్తారవిలసనప్రస్తావనలుదోఁచె సురవిఁదటప్రదేశములయం
దుఁ । గ్రసుముతోఁదలలెత్తెఁగడకంటిచూపులయందుఁగౌటిల్యపూర్వాంకురము
లు । సరసవైదగ్ధ్యరసాయనోదయమునఁబలుకులామ్యెయ్యనపదనుకోనిమె ।
నురముపైఁజెకిరుపయోధరంబులు చేసెలాలితోద్భేదకోలాహలములు । నవ
యవంబులునైగసేఁతలభిలషించెఁ । జెవులుసంభోగవార్తలచవులుమరిఁగె । జన
వరాత్మజకంతనుశైశవంబు । వీడిక్రొత్తగఁబ్రాయంబుగూడునపుడు ॥ ౧౪ ॥
వ ॥ అంతఁగ్రమక్రమంబున ॥ ౧౫ ॥ మ ॥ స్మరశాతాసివిలాసపుష్పమధుమా
సంబక్షువృత్తిస్వయం । వరమాలోకనభాగధేయముమదస్వాతంత్ర్యమవ్యాజల ।
బ్ధరహఃకేళికళామనోరథలతోపఘ్నంబునారోపితా । భరణప్రాయముప్రా
యమయ్యువతిపైఁబ్రాపుర్భవంబొందినన్ ॥ ౧౬ ॥ చ ॥ కవగౌనినిల్పుపేరనఁ
టికంబములయ్యెమృదూరుకాండముల్ । కువలయతోరణావలినికుంభనమయ్యెఁ
గటాక్షవిభ్రమం । బవిరళపూర్ణకుంభయుగమయ్యెవిరాజదురోజయుగ్మము ।
య్యవనిపకన్యయందునవయౌవనలక్ష్మిసమాగమంబునన్ ॥ ౧౭ ॥ సీ ॥ ప్రథమ
హాలాహలప్రథమానకీలలై వీఁగెఁగ్రూరకటాక్షవీక్షణములు । దరహాసచంద్రి
కాంకురములుదలలెత్తెనుదితేందుబింబమైయొప్పెమొగము । సమసముమ్మగ్న
వాసవకుంభివరకుంభయుగ్మమైకుచకుంభయుగళిదోఁచెఁ । బ్రకటసుధాపూర్ణర
త్నకుండికయయ్యెనరుణాభమైమధురాధరంబు । విశ్వమోహనలీలనావిర్భవించె ।
మదనజగదేకపూజ్యసామ్రాజ్యలక్ష్మి । సతిపయోనిధియైయున్నశైశవంబు । మహి
తయవ్వనమంథానమథితమైన ॥ ౧౮ ॥ చ ॥ ఉరుతరవజ్రకర్కశతయుంగుచ
రోన్నతియుంగుచంబులన్ । సరసిజసద్వికాసమును జంద్రవిలాసమునెమ్మొ
గంబునన్ । గరికరలక్ష్మియుంగదళికాతరువిస్ఫురణంబునూరులం । బొరయుటచిత్ర
మయ్యెనృపపుత్రికకాయెలజవ్వనంబునన్ ॥ ౧౯ ॥ ఉ ॥ కన్నులఁజంచలత్వము
నుగ్రౌర్యమపాంగవిలోకనంబులం । జన్నులఁగర్కశత్వముఁగృశత్వముఁగౌనున
మందభావము । న్నెన్నడవక్రతంగురులనెకొలఁజేసియునెట్టిచిత్రమో । కన్ని
యజవ్వనంబుత్రిజగజ్జనసన్నుతమయ్యెనయ్యెడన్ ॥ ౨౦ ॥ ఉ ॥ నీరజసూతిదీనిత
నునిర్మితకాలమునందుడించినం । గారుమెఱుంగులయ్యెనునుఁగాంతికిగీసినయట్టి
పైపొరల్ । సౌరభహీనభాగములుసంపఁగిక్రొవ్విరులయ్యెమార్దవ । శ్రీరహి
తాంశముల్నవశిరీషములైవిలసించెధారుణిన్ ॥ ౨౧ ॥ ఉ ॥ కారుమెఱుంగు
లయ్యెనునుఁగాంతికిఁబైపొరగీసివేయబం । గారువులయ్యెఁజేసెగలఁగందినపల్లటు
త్రోవఁజంపకా । కారములయ్యెఁగర్కశతగల్గినపట్లటుప్రేయదీనిన । న్నీరజసూతి

సేయు నెడనికఱమ నాఁదనువొప్పెనింతికిన్ ॥ ౨౨ ॥ చ ॥ కమలను మోము
నందునొకకన్నులమాత్రముఁ బోలదన్నచోఁ। గమలవిరోధియందునొకగండతలం
బునుబోలఁడన్నచోఁ।గమలముఁజందురుండుసరిగారని వేఱగణింపనేటికిన్। రమ
ణిదరస్మితేక్షణతరంగితమోహనమైనవక్త్రమున్ ॥ ౨౩ ॥ చ ॥ తరళగతిద్యు
తిచ్ఛటలఁదమ్మికోలంకులు సేయుదిక్కఱలం। గురియుఁగటాక్షపాతములఁ గోణ
ములన్మదనాస్త్రవర్షముం। గరువపుఁజూపులం గొలుపుకాఱు మెరుంగులుమింట
సాటియే। తరుణివిలోకనమ్ములకుఁదమ్ములునమ్ములుగ్రొమ్మెఱుంగులున్॥ ౨౪ ॥
గీ॥ మహితకటిచక్రవక్షోజమండలంబులప్పుడకృశసమృద్ధిచేనతిశయిల్ల। సంత
తక్షామమిందెట్లుసంభవించె। నాఁగమధ్యప్రదేశంబునాతికమరె ॥ ౨౫ ॥ గీ॥ ఒ
త్తుకొనివచ్చుకటికుచోద్వృత్తిఁజూచి। తరుణితనుమధ్యమెచటికో తలఁగిపోయె।
నుండెనేనియుఁగనఁబడకున్నెయహహ। యుద్ధతులమధ్యమునఁ బేదకుండఁదర
మె ॥ ౨౬ ॥ సీ ॥ అవనిపైనుండుఁగాకనఁటికంబము లెట్టులనఁటికంబములపైనవని
నిలచె। గగనంబుగిరులపైఁగనుపట్టుఁగాకెట్లుగగనంబుపైగిరుల్గాననయ్యె। జ
లధరంబులమీఁదశశియుండుఁగాకెట్లుశశిమీఁదనున్నదిజలధరంబు। నాళంబుపైఁ
గాకనలినకోశంబెట్లు నకోశంబుపైనాళమున్న। దనుచుఁజూపఱులకువిస్మయం
బుగొలుపుఁ। దొడలుఁగటిమండలంబునునడుముఁజన్ను। లాననముఁగొప్పునాభి
యునారునలర। నలరెవిమలాంగినవయౌవనాగమమున ॥ ౨౭ ॥ ఉ ॥ త్రాసు
నఁదూఁపవచ్చుముఖతామరసంబునునిండుచందురు। న్వాసిమెఱుంగరాదుమగ
వాలికమీలకుఁగన్నదోయికి। న్వాసముదప్పలేమునెరివేనలికింజిఱుదేఁటిదాంట్ల
కుం। దోసముగాదెయయ్యతివతోఁబెఱతొయ్యలినీడుసేసినన్ ॥ ౨౮ ॥
చ ॥ ఘనపథమధ్యనిర్భరముగానుదయించినిరుద్ధలోకలో। చనముగసన్నికృష్ట
ముఖచంద్రములైశ్రితతారకంబులై। యనయముకుంభసంభవమహత్వవిజేత
లునాటఁగన్యకా। స్తనములువింధ్యముందెగడి సాటికిహెచ్చిన మేరుకూట
ముల్ ॥ ౨౯ ॥ మ ॥ స్మరసమ్మోహనమంత్ర దేవతమనోజప్రౌఢసామ్రా
జ్యల। క్ష్మిరమానందనభాగ్యరేఖమదనక్రీడావనీపుష్పమం। జరికామావరకీర్తి
మన్మథపునస్సంజీవినీవిద్యనా। ధరణీశోత్తమకన్యయొప్పెవిలసత్తారుణ్యసంప
న్నయై ॥ ౩౦ ॥ వ ॥ ఇట్లభినవతారుణ్యభువనైకగణ్యయగునిజకన్యంగనుం
గొనిజయభద్రుండుదీనికిందగువరుండు స్వయంవరంబునంగాని కలుగండైనం
గలహమూలంబగుట నదిగాదనియత్యంత నిపుణులునంతరంగులునగు చిత్ర
కారులమ్ముఱహస్యంబుగా నియోగించినంబనిపూనినేమును విచిత్రచిత్రక
ళాకౌశలవశంబున నిఖిలదేశాధిపతులంగనుంగొనియుపకృతులమగుచు నంద
ఱయాకారంబులు యథారూపంబున రహస్యంబుగాఁబటంబులం జిత్రించి

కొనివచ్చి వచ్చియక్కన్యాభాగ్యపరిపాకంబున నస్మదీయతపః ఫలోదయంబున నిన్నునిట్లుసందర్శింపంగంటి మిటమీఁదివిశేషంబొకటి విననవధరింపుము ॥
గీ ॥ కన్యయదియెట్టులాలోకకారియట్ల। యీవునతిలోకతేజోభిహితుఁడవగుట। యుగళమగుటకుఁదగుటమీయొండొరులకుఁ । గాఁగలదిటులయనియునిక్కముగ నెఱుఁగ ॥ ౩౨ ॥ క ॥ దేవభవత్తేజముమా । భావంబులనిట్లుబయలుపఱచుటకిటము । న్నేవలనఁబరులెఱుంగరు । గావుననిత్తలఁపుదైపికమునఫలమగున్ ॥
ఉ ॥ ఆసతిమేనుచెల్వుఁగల యంతవచింపఁగనేరమన్నచో । వ్రాసితిమన్నరాదెయపరాధముపోలికమాత్రచిత్రవి । న్యాసముచేసినారమిదెయంచుఁదదాకృతిలేఖనక్రమో । ద్భాసిపటంబువిప్పినరపాలునిసన్నిధిఁబెట్టిచూపినన్ ॥ ౩౪ ॥
క ॥ వినునెడఁగరఁగినమనమున । యనమార్గంబునస్రవించియవయవములలో । నెనయంగఁజేరునట్లుగఁ । గనుఁగొనియెన్విభుఁడుగన్యకారూపంబున్ ॥ ౩౫ ॥
సీ ॥ కచభారరుచులఁజీఁకటిఁగొన్నయపరాధమానేందుద్యుతినపనయించుఁ । గ్రూరకటాక్షముల్గొన్నఁబైకొనుమూర్ఛనధరసుధారసంబానితెలియుఁ । కుచశైలతటులడిగ్గుచుఁగొన్నకంపంబుద్రివళిసోపానమూఁదివిడఁగాంచు । మధ్యకార్శ్యముఁజూడమదిఁగొన్నకరుణంబుకటిబింబసంపదఁగాంచిమఱచు । నూరుయుగలక్ష్మిఁబాసిరామెదవుతాప। ముడఁచుఁబదపల్లవంబులయందుఁబొరలి । రాజవరుదృష్టికుంతలరాజకన్య । సుందరాకారముత్కంఠఁజూచునపుడు ॥౩౬॥
క ॥ చనుఁగవపొడవైనాభిం । గనుఁగొననిమ్నమయిమఱియుఁగటిపొడవగునం । గనవిషమాకృతిపథమున । జనపతిమదిదొట్రుకొనుచుఁజాలఁజరించెన్ ॥౩౭॥
క ॥ వనితనతనాభిఁముంగ । స్తనములఁగడచిచనలేవుజనపతిచూడ్కుల్ । ల్మనమున నుయ్యోకొండో । యనియాందోళించువారికగునేతెగువల్ ॥ ౩౮ ॥ వ॥ఇట్లత్యంతాసక్తుఁడయ్యునుధీరనాయకుండగుటఁజిత్తవృత్తిబయలుపడనీకయిట్లనియె॥
గీ ॥ నిక్కముగ నిట్టి రూపంబు నెలఁత యొకతె । గలిగెనేబ్రహ్మనిపుణుఁగాఁదలఁపవలదె।కలిగెలేకుండెనిట్టియాకారమిట్లు । వ్రాయనేర్చినమీనేర్పువలయుఁబొగడ ॥ ౪౦ ॥ వ ॥ అనియుచితసత్కారంబులంబ్రీతులంజేసివీడ్కొల్పినవారును నిక్కార్యంబుసంఘటించిమఱికదా దేవరచేతమెచ్చులంబడయువారమనిపంతంబులాడుచునిజదేశంబునకుంజనినయనంతరంబ ॥ ౪౧ ॥ క ॥ చిత్రకళావంతులచేఁ । జిత్రపటముచన్నైనచిత్రముహరిణీ । నేత్రంజిత్రించినతచ్చిత్రపటంబయ్యెవిభునిచిత్తంబంతన్ ॥ ౪౨ ॥ సీ ॥ భద్రేభకుంభసంస్ఫాలనక్రీడలఁదన్వంగికుచములఁదలఁచితలఁచి । కరకృపాణీసముత్కంపనక్రీడలఁదరలాక్షికన్నులఁదలఁచితలఁచి । ధరవైరిమణిహారధారణక్రీడలఁదరుణికుంతలములఁదలఁచితలఁచి । సజ్యకార్ముకలతా సంగ్రహక్రీడల ల లనబొమ్మ ల తీరుఁ ద

లఁచితలఁచి । రుచిరతరభద్రపీఠాధిరోహణములఁ । దామరసనేత్రికటి పెంపుఁ
దలఁచితలఁచి । యవనిపతిస్వపదార్థానుభవములెల్లఁ । గన్యరూపానుభవ
ముగాఁగఱఁగుచుండె ॥ ౮౩ ॥ వ ॥ ఇట్లునిరంతరచింతాతిశయంబునఁదదాయ
త్తచిత్తుండగుచు నృపోత్తముండిట్లనివితర్కించె ॥ ౮౪ ॥ గీ ॥ చిత్రకారులరా
కఁజర్చింపనొక్క । దేవతామాయగాదెయాత్రిజగదేక ।సుందరాకృతిఁజిత్రిం
చిచూపు టెట్లు । చూచునంతనమఱిదగు లేచు టెట్లు ॥ ౮౫ ॥ వ ॥ అనితలం
పు పెంపునంజిత్రితవిచిత్రాకారక్రమంబు సంస్మరించి ॥ ౮౬ ॥ సీ ॥ హరినీల
ములఁజేసియంధకారముఁజేసి మొలకతేఁటులఁజేసిముద్దుగుడిచి । మీనులఁబుట్టిం
చి మెఱుఁగులఁబుట్టించిశుక్తులఁబుట్టించిస్రుక్కిణంగి । యర్ధముల్నిర్మించియమృ
తాంశునిర్మించివనజమునిర్మించివణఁకుదేఱి।గుచ్ఛముల్సృజియించికోకముల్సృజి
యించికుంభముల్సృజియించికొంకువాసి । ప్రోడయైమీఁదనిర్మింపఁబోలునలువ ।
కన్యకామణికురులుకన్గవయుమొగముఁ।జన్నుదోయియునట్లుగాకున్నసిట్టి । య
నుపమానాంగములుసృష్టియందుఁగలవె ॥ ౮౭ ॥ వ ॥అనిమఱియును ॥ ౮౮ ॥
సీ ॥ మెట్లకుఁదరమిడమెయికొంటయాయింతికుచములప్రతిఁజూపఁగోరుటెల్ల ।
ఖడ్గధారావ్రతగ్రహణంబుసేయుటసుదతియూరుపమింపఁజూచుటెల్ల । గగనా
రవిందంబుఁగనుటయాసతిమధ్యగతినాభితోసాటిఁగాంచుటెల్ల । నంధకారము
ద్రవ్వుటాయింతికుంతలములసాటివెట్టంగఁబూనుటెల్లఁ । జందమామకుగ్రుక్కి
ళ్ళాయిందువదన । వదనసామ్యంబుసేయంగవాంఛసేఁత । పృథివికడగాం
చుటారామపిఱుఁదుతోడ । సదృశవస్తువుగనుటన్నఁజమరులెల్ల ॥ ౮౯ ॥ వ ॥ అ
నివెండియునిజమనోగతానురాగంబుపలక్షించుకొని ॥ ౯౦ ॥ సీ ॥ బింబో
ష్ఠిముఖమిందుబింబమైయుండనాడెందంబునకునేలకందుగలిగె । ముగుదచన్ను
లుతమ్మిమొగ్గలైయుండనాచిత్తమేగతిఁబొందెమెత్తఁబాటు । సతినితంబమురథ
చక్రమైయుండనాభావంబునకునెట్లుప్రాణమొదవె । నబ్జాక్షిపెందొడలనఁటు
లైయుండనాయుల్లంబులైసార్వమొంచుటెట్లు । ముగువజిగిమేనుకుందనంబగు
చునుండఁ । గాఁకఁగఱఁగెడునామనోగతులిదెట్లు । వనితయవయవములఁగల్గు
వస్తుగుణము । చూపఱులయందుఁబొరయుటచోద్యమొక్కొ ॥ ౯౧ ॥ వ ॥
అనిమఱియురసాతిరేకంబున ॥ ౯౨॥ ఉ ॥ మానముమూరుమాటముఖమండల
మెత్తఁగనియ్యకొల్లకే । పైనిగుడించునూర్పుప్రసభాచరణంబులకుంబ్రతిక్రియ ।
ల్గానొనరించుచున్నపతికన్యకనూతనసంగమంబునన్ । భానువుపైమదీయభుజ
పంజరమెన్నఁడలంకరించునో ॥ ౯౩ ॥ చ ॥ తమకమునాఁగిముచ్చటకుఁదార్చి
నెపంబునసోఁకిహస్తసం । గమమునకియ్యకొల్పుపులకంబులుమైనొదవించివంచ
న । క్రమములనెయ్యఁబయ్యెదయుఁగంపమునన్దొలఁగింపఁబూనికిన్ । సమకొని

సిగ్గునీవియునుజార్చిదెమెదన్నతిగూర్చు టెన్నఁడో ॥ ౫౪ ॥ చ ॥ స్థిరమతినీకు మేము మ్ముఁ చెకుఁలవ్రాసినపత్రభాగము। ల్వరుసయురంబునన్గలిగవచ్చెఁగదేవిపరీతవృత్తిమీ । సరసరసప్రసక్తిననిచాయలఁబాఱఁగనాగునెచ్చెలీ । గరకమలాహతిన్నిలుపఁగన్నియనెన్నఁడుప్రోడఁజేతునో ॥ ౫౫ ॥ క ॥ అనిమఱియుఁబెక్కుకోరుకులు । బెనఁగొననక్కన్యవలనఁబ్రేముడివలన। న్మనుజపతియంతనిపత । న్మనసిజశరశరధిసదృశమానసుఁడగుచున్ ॥ ౫౬ ॥ సీ ॥ దొరలవిమర్దంబుఁబొరయుతల్పముదక్కఁగెలననిద్రాహానిదెలియనీక । పదలెడుభూషణావలిదక్కనితరులమేనిపైకార్శ్యంబుగాననీక । మొనయనియింద్రియంబులుదక్కనన్యులక్రియలయందరుదిలక్షింపనీక । తగవుమాలినకోర్కెదక్కఁదక్కొరులకుహృత్పరిత్యాగంబునెఱుఁగనీక । మలయపవమానచలనముల్లలిగినైన । దవ్వులకునిశ్చలంబైనతరువువోలె । మదనవికృతిక్రమాక్రమ్యమానుఁడయ్యుఁ । బరులకవికారుఁడైయుండెఁబార్థివుండు ॥ ౫౭ ॥ వ ॥ ఇట్లనుదినప్రవర్ధమానమనోభవదశావిశేషంబులవలనన మ్మహీపాలశేఖరుండేటికెమరేగుచందంబునదుర్భరంబైనకాలంబుఁగడపుచుండెనటఁజిత్రకారులుకృతార్థమతినతిత్వరితగతినిజదేశంబునకుంజనితమరాకకెదురుచూచుచున్నవేలికం బ్రహృష్టహృదయుంజేయుచు నుచితగతిం గాంచియేకాంతంబునఁదమతెచ్చినచిత్రపటంబులునివేదించి యందుఁజిత్రించినవివిధదేశాధిపతులంగ్రమక్రమంబునవేత్వేఱఁజూపియిట్లనిరి॥ ౫౮ ॥ క॥ దేవరయానతినిఖిల । భూవరులన్వ్రాసియిట్లుసమ్ముఖమునకుం । దేవలసెఁగానిపనిలే । దీవిస్మృతిమాకుఁజూడనిదియెట్లన్నన్ ॥ ౫౯ ॥ మ ॥ అరవిందప్రతిమల్లఫుల్లనయనుండాజానుబాహార్గళుం । డరతోత్తాలవిశాలవక్షుఁడుసమగ్రాకారలోకైకసుం।దరుఁడుల్లోకవిచిత్రతేజుఁడిలమాంధాతృక్షమామండలే। శ్వరుఁడాతండొకరాజమాత్రుఁడటెసాక్షాద్విష్ణుఁడూహించినన్ ॥ ౬౦ ॥ క ॥ అతనిఁగనుఁగొన్నచూపుల । నితరమహీపతులుసృష్టినెంతటితేజో । యుతులేనిసూర్యుముందటఁ । బ్రతిదీపములట్లయతఁడుప్రభుమాత్రుండే ॥ ౬౧ ॥ క ॥ నీకన్యకతఁడుదగునా । భూకాంతాగ్రణికినీమఘత్రికయతగు । న్నాకుందోఁచినమతమిది। టీకలుపదివేలునేమిటికినిప్పటికిన్ ॥ ౬౨ ॥ క ॥ అతిమానుషమైనతడ । ద్భుతతేజమువ్రాసిచూపఁబోలదతనియా । కృతిమాత్రముచటఁజిత్రిం । చితిమిదెయనిచూపఁజూచిచిత్తంబలరన్ ॥ ౬౩ ॥ వ ॥ కుంతలేంద్రుండును వారలుపలికినంతకునిక్కంబగుటకుమెచ్చి పారితోషికంబొసంగియనిచిన పిదపవిమలాంగికింబ్రియవయస్యయుఁ బ్రోడయునగుపాలికయను శుద్ధాంతచారిణిరావించి నిజప్రారంభంబునుం జిత్రకారాభిప్రాయంబునుఁదెలిపి తత్తద్దేశనగర నగనదీవిహారప్రదేశవిశేషంబులతోఁగులగోత్రచరిత్రనామాంకంబులతోయథారూపంబులతో

నిందుం జిత్రింపనిరాకుమారుండు సగ్గ్ంసహోచక్రంబునంగలుగండీ నృపనంద
నుసందోహంబు మదీయనందన డెందంబుగందళింపం జేసిన యనురూపభూపకు
మారునిం దెలిసికొని రమ్మని యాజ్ఞాపించినంబనిపూనిచని యకుల్ మారికకుమా
సంతోషం బెఱుంగించియచ్చిత్రచిత్ర పటంబువిప్పిచూపునపుడు ॥ ౧౪ ॥ ఉ ॥
పాలికచూపఁగానవనిపాలతనూభవసూచె దేశత। చ్ఛాలనదీవనీనగరసత్కులనా
మయశస్సనాథులం । గౌళకళింగవంగకురుకాశకరూశవిదేహచోళపాం । చా
లవనాయుసింధుముఖసర్వమహీవలయాధినాథులన్ ॥ ౧౫ ॥ గీ ॥ చూచియెవ్వ
నిఁగైకొకసుదతియంతఁ । జూచెడెందంబెనసియెత్తఁజూడఁ నాఁట । గుణవిసి
స్తంభ్రమనుత్తరకోసలేంద్రు । నిరుపమాకారుయువనాశ్వనృపకుమారు ॥ ౧౬ ॥
శా ॥ ఆకంఠప్రణయప్రమత్తములపూర్వాశ్చర్యనిష్యందము । ల్యాకూతాయత
పాతముల్సుఖవిశేషాంతర్ముహుర్ముగ్ధముల్ । వ్రీడాకోణాంచలచంచలాలసవశ్రీ
తిప్రసాదోదయ । వ్యాకోచంబులునైనవీక్షణములన్వామాక్షిసూచెంబతిన్ ॥
మ ॥ అనురాగాకృతికందకందళముభో గైకాంతసారంబుయా । వనసర్వస్వ
మశేషవిభ్రమకళాస్వాంతంబువిశ్వైకమో । హనశృంగారరహస్యముంగజవి
జృంభావాహనాగ్రక్షణం ; బునరేశాత్మజచూడఁగ్రోలెనపుడాభూపాలసౌంద
ర్యమున్ ॥ ౧౭ ॥ ఉ ॥ చిప్పిలుచెకుల్పైఁజెమటచిత్తములంగరపల్లవంబులం।
గప్పుచుఁజన్నుఁగేవఁబులకంబులుపయ్యెదనెత్తియోరఁగాఁ । ద్రిప్పినమోమువం
ఁ ~~…ంగడచి~~ చేఁ దప్పకచూచిరాజసుతతానునుజిత్తరువయ్యె
…ప్పకదశాధ్యయనంబునకుఁబ్రథమప్రణవంబైన
ఖనం దగిన కన్నియ నెఱింగి యంత నెఱుంగనియ
ర్తైన్ గై గ్రైటు యస్యసోపాలంభనంబుగా నిట్లనియె ॥ ౨౦ ॥ ఉ ॥ ఒ
నిట్లుమాఱు మొగమొందియుసుందడవేలసాల్వభూ। వల్లభుఁజూడుమీఁడెగుణ
తుఁడనాఁదలవంచి నెచ్చెలిన్ । హల్లకపాణిపాణిధృతహల్లకతాడితుఁజేసెఁ
ంపుసం। ధిల్లఁగసిగ్గులేనగవుదేఱెడుకన్నులచేనదల్చుచున్ ॥ ౨౧ ॥ వ ॥ అ
న్నడప్పాలికయు బాలికఁగనినవ్వుచు ॥ ౨౨ ॥ క ॥ కోపించెదేలయట్టిమ। హీ
తిఁబతిగావరించుటే నెఱుఁగుమనే । వాపుచ్చకొరులమనసుల । లోపలితలఁ
పెఱుఁగుటెల్లలోకమునఁజెలీ ॥ ౨౩ ॥ వ ॥ అనియుచితసరససల్లాపంబులం
గలపికొని ॥ ౨౪ ॥ గీ ॥ రూపముననెల్లఁద్రిజగదారూఢలట్ల । బుద్ధియందును
సకలైకపూజ్యనైతి । నెల్లరాజులలోనమేలేర్చితగిన । వరునిఁగోరితివతిభాగ్య
వతివిసఖియ ॥ ౨౫ ॥ వ ॥ అనియమ్మనోరథంబప్పుడమ్మహీపతికి విన్నవిం
చిననతండును జిత్రకారాభిప్రాయంబునం దనతలంపునుం గన్యామనోరథం
బునొక్కటియగుట దైవఘటనంబకాఁదలంచి ప్రహృష్టహృదయుండై తతా-

ర్యసంధా నోన్ముఖుండయ్యెనంతనిక్కడ ॥ ౭౬ ॥ క ॥ నెచ్చెలితనకుంజూపిన ।
యచ్చిత్రపటంబులోనియధిపతిరూపం। బచ్చొత్తినగతిఁదోఁపఁగ। నచ్చెలువమునం
బుసంతతాంతర్ముఖియ్యై ॥ ౭౭ ॥ సీ ॥ పూర్ణచంద్రునిఁజూచిపూర్ణచంద్రుని
యందువిపులనేత్రయుగంబు వెదకఁజూచు । మణికవాటముఁజూచిమణికవాట
మునందుతారహారంబులుడడవఁజూచు । నునుఁగంబములఁజూచినునుగంబముల
యందుఁగంకణాంగదములు గానఁజూచు। వికచాబ్జములఁజూచివికచాబ్జములయం
దుశుభదోర్ధ్వరేఖలుచూడఁజూచుఁ । దరుణమృగలోలనేత్రసంతతముఁదనమ ।
చిత్తసింహాసనమునధిష్ఠించియున్న । యధిపమన్మథుభువనమోహనములైన ।
యవయవంబులుచెలిగన్నయట్లయ్యైన ॥ ౭౮ ॥ చ ॥ చెలులమొఱంగియేకతమ
చెన్నునహస్తములందుఁదూలికా । ఫలకములన్వహించితనభావములోఁబతిరూ
పువ్రాయఁగాఁ। దలఁచిలతాంగిచిత్రముగఁదానవిచేష్టతచిత్రరూపమై । నిలిచెఁద
దాకృతిస్మరణనిర్వృతిచేవివశాంతరంగయ్యై ॥ ౭౯ ॥ చ ॥ వదనము వ్రాసితోనగరు
వంబునఁజుంబనకేళిసల్పుచుఁ।హృదయము వ్రాసితోననిలువేదికవుంగిటఁజిక్కఁ
జేర్చుచుం। బదములు వ్రాసితోనకరపద్మములఁబ్రియమారనొత్తుచు। న్నుదతిపతిన్లి
ఖించుమఱిచూడనెఱుంగమికోరిక పెక్కువర్ ॥వ॥ ఇట్లుతీవ్రంబులగుకోర్కల
త్రొక్కనంజిక్కవడియక్కన్యతనలోన ॥ ౮౧ ॥ఉ॥ మారునిచేతిఘాతనభిమాన
మువోకసఖీజనంబుచే। నారడిగప్పినన్వలపులంగడికెక్కకకోరినప్పుడే। కూరిమి
వల్లభుంగలసికోర్కెఫలించిసుఖించుకన్నియ। ల్భారపునిష్ఠఁబూనితొలుబాములనో
ములనేమినోఁచిరో ॥౮౨॥ ఉ ॥ వల్లభుపేరఁజిత్తరువువ్రాసినరూపముఁజూచినం
తనా । యుల్లమునీరమైకరఁగుచున్నదినిక్కమతండువేడ్కరం। జిల్లఁగవుంగిటం
బిగియఁజేర్చినయేనియురంబుపైఁదనూ । వల్లియునేను బెంజెమటపట్టఁగబిట్టుగ
రంగిపోవనే ॥ ౮౩ ॥ క ॥ అనిమఱియుఁబెక్కుగోర్కులు । దనమదిఁబైకొనఁ
గవెలఁదిదరళోర్ములనాఁ। గినయట్లయోర్చిచెలులం । గననీకవెలుంగుచుండెఁ
గన్నియయంతట్ ॥ ౮౪ ॥ చ ॥ ఉదయమెకానియస్తగతినొందకతీవ్రగతిన్వె
లుంగున । మ్మదనభుజప్రతాపరవిమండఁగనెప్పుడుమోడ్పెఱుంగమి । న్నిమరకఁ
బాసియచ్చెలువనేత్రమహోత్పలముల్జయించెనె ।ల్లిదమునరాత్రులెల్లముకుళీ
పురవిస్ఫురదంబుజంబులట్ ॥ ౮౫ ॥ ఉ ॥ అంగనకౌనుయావనసహాయము
నంగయిచేసినట్లనే । డంగజుప్రాపుఁగల్గియఖిలాంగములేనయలంకరింపఁగా ।
నంగములందునేలయివియంచుఁగృశత్వమహంకరించితా । నంగదకంకణాదు
లగునాభరణంబులఁజార్చెనింతికిన్ ॥ ౮౬ ॥ ఉ ॥ వారణరాజయానను
నువారముగుంతలమధ్యవీథిసిం । దూరముదూరమయ్యెమగతుమ్మెదప్రోడలుగో
డగించుర్ఘుం । కారముకారమయ్యెఁజెలికత్తియలంబలికించువాక్యసం । భార

ముఖారవమయ్యెనుదిఁబర్వినమూతనకామవిక్రియన్ ॥ ౮౭ ॥ చ ॥ విరులుశరంబులయ్యెఁ జలివెన్నెలయొట్టినమంటయయ్యెనుం । గరువలివజ్రమయ్యెఁ జెలికత్తియమెప్పనిదయ్యెహస్తపం। జరమునఁ బూని పెంచుశుకశారికముల్పగచాటుదయ్యెన। త్తరుణికిఁబంచబాణుఁడనుదైవముదాఁ బ్రతికూలమౌటచేన్ ॥ ౮౮ ॥ చ. ॥ పులకకదంబముల్పొనిచె ఫుల్లముఖాబ్జవిలాససంపద। ల్లొలఁగెమరాళికాగతులుదూరములయ్యెశ్రమాంబుపూరము । వ్వెలివిరియంగఁజొచ్చెఁబురివిచ్చినటింపఁగ నెమ్మిగోరిక । న్వొలఁతుకయందుమన్మథుఁడుపూర్ణముగాశరవృష్టిఁజూపఁగన్ ॥ ౮౯ ॥ తే ॥ తాపమునుబాండిమయునాఁగఁదరుణిమేన । నెండయును వెన్నెలయుఁగూడి రెండునుండి । భావిలజ్జావినాశసంప్రాప్తికొఱకొ । ధైర్యహానికినోముమెహూత్సాతమయ్యె ॥ ౯౦ ॥ వ ॥ ఇట్లంతకంతకుఁ బెరుగు విరహపరితాపంబునిలువరింపఁగ్గొలందిగాక నెచ్చెలులం గను మొఱంగి యొకర్తె నాఁడొకర్తెయు మందిరారామంబునకుంజని ॥ ౯౧ ॥ సీ ॥ అలరుతేకువలయలుఁగులుమీఁదఁగురియుచోఁ జేలకొంగుముసుంగు చేసిచేసి । చిలుకపలుకులుగాఁడిజీవంబులెడలుచో నంగుళంబులవీనులానియాని । యడుగులఁబువ్వొడులంటిచుట్టడుచుచో నున్సురుమనివేచ్చనూర్చియూర్చి । కమ్మదెమ్మెరలుపైఁగలయంగసోఁకుచో వల్లరియునుబోలెవణఁకివణఁకి । సాహసమెతోడుగాఁగనచ్చపలనయన । మందిరారామవాటికామధ్యవీథిఁ । దటిసిచనియొకర్తెపువ్వులతాగృహమున । ధవళకరకాంతశయ్యపైఁదనువువైచి ॥ ౯౨ ॥ ఉ ॥ లేనిప్రియుండుఁగన్గొనఁగ లేనివిలాసమువిన్నవింపఁగా । లేనిప్రియంబుఁబైకొనఁగ లేనికడంకలుఁగౌఁగిలింపఁగా । లేనిముదంబుఁజేకొనఁగ లేనిరతుల్మదిఁబట్టుకొల్పఁగా । లేనిసుఖంబుఁదాల్మిఁగబళింపఁగసింధురయానదీనయై ॥ ౯౩ ॥ వ ॥ ఉండునంతనిచ్చటం బ్రియవయస్యాంగానమింజేసి చెలికత్తియ లెత్తినతత్తఱంబున నస్తలోదరిపదారవిందంబులచొప్పునం జనుదెంచి యుద్యాననికుంజంబుడాసి పరికించునప్పుడు ॥ ౯౪ ॥ ఉ ॥ తూలినమోముచెల్వుఁబయిమూఁకొనుఘర్మజలంబువెల్లువం। దేలినమేను నెమ్మనముత్రిక్కులఁజిక్కులఁజేసివెల్వడం । దోలినతాల్మివల్లభుఁడుదోఁచినరిత్తకురిత్తకౌఁగిటన్ । సోలినచందముంగలయఁజూచివయస్యలుభీతచిత్తలై ॥ ౯౫ ॥ క ॥ తత్తఱిలువారినందఱ । నత్తఱిమఱుపడఁగనలిపియస్సాలికదా । నత్తన్విఁదెలిపికౌఁగిట । నొత్తికురుల్నిమిరియుల్లమూఱడిలంగన్ ॥ ౯౬ ॥ ఉ ॥ మచ్చికగల్గునెచ్చెలులమమ్ము మొఱంగిలతాంగిరొంటిఁనీ । విచ్చటికెట్లువచ్చితివియీవనవాటికదాఁ బ్రకర్మేమే । పచ్చనివింటిజోదుతగుబందుగుఁడేమఱిచిలుకలేమినీ । నచ్చినతోడఁబుట్టుగులెనాయమువప్పఁగదమ్మయియ్యెడన్ ॥ ౯౭ ॥ చ ॥ హిమకరుఁడంకకాఁడుమధు వెప్పుడుజాతివిరోధిరాజకీ । రముప్రతిపక్షి తెమ్మెరలుప్రాణముదాయులు

కాచియుండుఁజూ । తముగడుఁజూడఁజాలఁడలదర్పకుఁడింతయొఱంగియుంజెలీ।
మముసఖులందొఱంగిరిపుమధ్యమమీవనమొంటిఁజొత్తురే ॥ ౯౮ ॥ చ ॥ మన
మునసీవుగోరునన్నృపమన్మథుతోనినుఁబెండ్లిసేయనీ । జనకుఁడుసంభ్రమించెనదెస
మ్మదమొందుదుగాకఁబేలవై । వనరుహపత్త్రనేత్రయిటువాఁగెవదల్చినకోర్కుఱ
లఱమనో । జునకెరయిచ్చిడిల్లపడఁజూచినఁజూచినవారుమెత్తురే ॥ ౯౯ ॥
వ ॥ అనిసిగ్గఱంచిపలికిననెచ్చెలికంఠంబుకరంబులంబెనఁచి తనవాడినవదన
పద్మంబునొఱగాఁ దదీయకుచమధ్యంబునంజిఱంజేర్చి నిడుదకనుఁగొలంకు
లఁ గ్రొవ్వేఁడిబాష్పకణపరంపరలొలుకనిట్టూర్పునిగిడించి ॥ ౧౦౦ ॥ క ॥మగ
బొమ్మఁజూడనెల్లని । ముగుదతనంబెల్లమూలముట్టుగనిటుపై । ల్లగిలించుకొంటి
నేనే । తగనిమనోరథమువలనఁదప్పదుచెలియా ॥ ౧౦౧ ॥ క ॥ చెలులెఱిఁగి
ననాడెదరను । తలఁకదిప్రావడియెనిపుడుదర్పకశరబా । ధలవలననాకుఁబ్రాణ
ము । నిలుపుటగండమయినయదినిక్కముసకియా ॥ ౧౦౨ ॥ ఉ ॥పయ్యఁదొఱం
గెఁగంతుఁడెడయాకశరంబులవేఁడివెన్నెలల్ । గాయఁదొఱంగెఁజందురుఁడు
గర్ణపుటంబులువీలఁగోయిలల్ । కూయఁదొఱంగెవల్లభులఁగొరెడుకన్నెలకెల్ల
నిట్టిదే । నాయమొలేకదైవమిదినాకుఘటించెనొనేఁడునెచ్చెలీ ॥ ౧౦౩ ॥క ॥
కరమర్థినేనపెనుపం । బెరిగినశుకమోటలేకప్రేలుచుహృదయం । బెరియింపఁ
దొణఁగెనింకం । బరభృతములుచెప్పనేలపంకజవదనా ॥ ౧౦౪ ॥ చ ॥ వలపుల
తేనిచేతివలవంతలకోర్వకచల్లగాలిపై । నొలయనెదిర్చియేశుకపికోక్తులకుంజెవి
యొగ్గియేనిమొ । కఱలమునమొకమావిపయిఁగన్నిడియేఁదనువుందొఱంగఁగాఁ।
జెలులమొఱంగియొకఱతియసేరితిసీవనమధ్యకుంజమున్ ॥ ౧౦౫ ॥ క ॥ చెప్పితిఁ
దలంపునీకుం।దప్పకయిదియెట్లుసేయుదానన్వినుమో। యప్పరహస్యంబొకఱటి।
యొప్పగుఁగాకుండునింకనొడఁగనేలా ॥ ౧౦౬ ॥ ఉ ॥ సత్తుగనొఁచనెట్లుఁ
బతిసంగతికింబ్రతిరూపమేనినా। చిత్తముపూనికంగుఱచచేసినసోలముతోడినన్
ప్రియో । ద్వృత్తివిశాలవక్షమునఁదేఆడునట్లుగవ్రాసిచూపినా । యుత్తలపా
టుమాన్పుమదినూఱడివెన్నెలచిచ్చుచొచ్చెదన్ ॥ ౧౦౭ ॥ వ ॥ అనిసప్తమంబై
నయవస్థాంతరంబుదేటపడంబలికిననులికిపడిపాలికయునిబ్బాలికమనఃపరిపాకం
బుఁబరికించినంగార్యంబుపరువంబుదప్పినయది యైననిరంతరంబగుకంటెనిప్పటి
కింగొంతయూఱడిలంబలికి తెలుపుటుచితంబుగాకేమియని లేనిబింకంబుదెచ్చు
కొని ॥ ౧౦౮ ॥ మ ॥ అలరుందూపులమూలపాల్పఱిచి సొంపొనిక్షుచాపం
బునం । గలపెంపెల్లఁదృణీకరించిమకరాంకంబవ్వలంద్రోచియ । చ్చలమేపా
రఁగఁజిన్నిబాలకులచేఁ జప్పట్లువెట్టింతున । వ్వలతేనింజెలియొకఱపోటుదొర
గావాల్మూఁదిచింతింపకే ॥ ౧౦౯ ॥ సీ ॥ అహికులాధిపువ్రాసియంత్రించిదక్షిణ

గంధవాహునిరాకఁగట్టువఱుఁగు । రాహుపూజాభిచారవిధాన మొనరించిశశిబిట్ట
బిరుగుడుచంపివైతు। నలువైనశ్రీరామనామమంత్రంబుచేఁగలకంఠతతులవాకట్టి
విడుతు । సంపంగినౌషధసంప్రయోగముచూపి మొకరితుమ్మెదపిండుమూర్ఛవు
త్తుఁ । భ్రాంతభూరుహములఁగల్లుపండ్లుడులిచి । త్రుళ్లుచిలుకలనాలుకలముండ్లు
విఱుతుఁ । బోలఁతినాయంతనెచ్చెలిప్రోడగలుగ । నించువిలుతునిపగకునీకేలత
లఁక ॥ ౧౧౦ ॥ తే ॥ డెందమునయందుప్రీడనాటింపవలదె । యతితిహారంబు
నులిగొన్నదకటమేలె । యొంటినిలనేలయిచటరాయుత్పలాక్షి। ప్రోదిచూతంబు
నకునీరువోయవలదె ॥ ౧౧౧ ॥ వ ॥ అనినసప్పలుకులయెడననాదరంబు తేటప
డవెడనవ్వినవ్వి ॥ ౧౧౨ ॥ ఉ ॥ ప్రోడవుగాననీపలుకుపోలదుగాదనరాదుగాక
యీ । వీడనితాపవేదనలవేఁగెడుచెన్నటిమేనప్రాణముల్ । గూడివసింపనో
ర్వవిదిగోచనుచున్నవియేలప్రీడయుం। గ్రీడయునాకుహారమునుగీరముఁజూతముశీ
తముంజెలీ ॥ ౧౧౩ ॥ వ ॥ అనుటయునకన్నియమేనిసంతాపాతిశయంబుప
రికించి యలంతులంబోకుండుటయెఱింగి కొంతయుపశమంబుసేయకున్నఁ బ్ర
మాదంబగునని నెచ్చెలులంబిలిచి యచ్చెలువ వారునుందానును శిశిరోపచారం
బులుసేయసమకట్టియప్పుడు ॥ ౧౧౪ ॥ ఉ ॥ ఈరపుమోకమావిఁగమియుకుక
వగొజ్జెఁగలంచుజాలుప । న్నీరులయేఁటనయ్యనఁటినిట్టలపైఁబొరలూడిరాలుక ।
ర్పూరపుదీవిచెంగలువపువ్వులుగప్పినచప్పరంబులో । సారపుఁదమ్మిపుప్పొడుల
శయ్యకుఁగన్నియఁదెచ్చినెచ్చెలుల్ ॥ ౧౧౫ ॥ వ ॥ హారపటీరకర్పూరపన్నీర
పల్లవహల్లకాదిశిశిరద్రవ్యంబులుగొనివచ్చి విరహాధిదైవతంబగు భావభవునాకా
రంబుప్రతిష్ఠించి యారాధించి యతనినుద్దేశించి ॥ ౧౧౬ ॥ ఉ ॥ గిల్లియగోరఁ
దీర్పపనికిన్మఱిగొడ్డలియొల్లకేకదా । బల్లిదమైనసాధనముఁబట్టకమన్మథనీవులోక
ముం । దెల్లమిగాజయించితివితెయ్యనివింటనుగమ్మఁదూపులం । జల్లనిమంత్రిచే
శ్రుతిరసాయనమయ్యెడుతేంట్లయార్పులన్ ॥ ౧౧౭ ॥ సీ ॥ నీవిక్రమక్రీడనిజహృ
దయంగమంబైమెచ్చుశ్రీధరుండనుఁగుఁదండ్రి । నీయాజ్ఞకొండననేరకముద్రితవ
దనుఁడైవర్తించువాగ్వరుండు । నీతూపుకోర్వకనిటలాక్షుఁడుమతనూఫలకంబు
చాటునఁబాయఁడెపుడు । నీబిరుదోక్తిచిహ్నితజయజంగమస్తంభమైయున్నాఁ
డుజంభవైరి । యింకఁదకిననబడుగులనెన్ననేల । యిట్టినీవిట్లుపనిబాలనేఁచుటె
ట్లు।పర్వతంబెత్తుకేలనబంతియెత్తి । కడిమినెఱపంగఁజూచితేకాయజన్మ ॥౧౧౮॥
వ ॥ అనిమఱియును ॥ ౧౧౯ ॥ సీ ॥ ముద్దియమెడఁగల్గుమోమోటమఱచితేకా
ఱించెదేలరాకాశశాంక । మగువనీకిచ్చినమాటపట్టెటుఁగవేయించుకకృపసేయ
వేలచిలుక।కోమలాంగికినట్టుఁగుత్తికవైయుండికలకంఠమాకినికరమువలదె । చె
లిమోముఁదమ్మితావులఁ గ్రోలుచుండియుఁ గుడిచినింటికిఁ గీడుఁగోరకుమలి

కాలమెల్లఁబగలుగావచ్చినదిమీకుఁ । గొమ్మ నేఁచఁదగదుకోకయుగము । య
కటసతికినంతరంగమైయుండియు । మలయకయ్యనీవుమలయపవన ॥ ౧౯౯ ॥
వ ॥ అనిసపరివారంబుగామదనదేవతాప్రార్థనంబొనరించి ॥ ౨౦౦॥ ఉ ॥ పత్ర
ముపుష్పముల్ఫలముభక్తినొసంగెడువారమింతెయీ । మాత్రమునంబ్రసన్ను
లయిమానినిఁగన్గొనుఁడయ్యమీకృపా । పాత్రముగాఁగనంచుఁదగుభంగిఁబికంబు
లఁదేంట్లఁజిలుకలం । బత్రము పుష్పము ఫల ముపాయనమిచ్చి భజించి యచ్చె
లుల్ ॥ ౨౦౧ ॥ సీ ॥ స్వర్ణకుంభములకువర్ణలేపనముగఁజన్నులఁగుంకుమంబలఁది
యలఁది । వెడవిల్తునలుఁగులుదొడయుటగాఁగన్నులెడపకపన్నీటఁదుడిచితుడిచి।
లేఁతతుమ్మెదలకుమేఁతగావిరిదమ్మిపుప్పొడిఁగురులపైఁబోసిపోసి । యనుఁగుఁ
జుట్టములతోనాలింగనంబుగాఁబదకరంబులఁజిగుళ్లదిమియదిమి । కప్పురపుధూ
ళిమేనిపైఁగుప్పికుప్పి । విపులకదళీదళంబులవీచివీచి । విరహపరితాపవతియైనవె
లఁదికపుడు । చెలులుశిశిరోపచారములేయఁజేయ ॥ ౨౦౨ ॥ ఉ ॥ ధాతుప
టంబులంబొగసిదట్టపుఁబుప్పొడిరాఁజిచందన । వ్రాతముచేతఁగాల్కొనిప్రవా
ళముఖంబులవీవవీవను । ధ్మాతమహోర్చులంబెరిగితోరపుఁగొజ్జఁగనీటిపేరిపె ।
న్నేతఁబదీప్తమయ్యెఁదరుణీమణిపైవిరహాగ్నియెంతయున్ ॥ ౨౦౩ ॥ మ ॥ ప
టికిన్మార్చినలీలఁజందనముపైఁబైఁబూయనంగారక । చ్ఛటలంగాఁచుతెఱంగు
నంజిగురుసెజ్జంబొర్లఁగానప్పట । ప్పటికింజేరఁగనిచ్చినట్లొడలిపైఁబన్నీరుచల్లం
గను । తఱటమయ్యెంబెనుఁగాఁకబంగరుసలాకంబోలునబ్బాలకున్ ॥ ౨౦౪ ॥
వ ॥ ఇట్లువిరహానలంబగ్గలించుటకుఁ బెగ్గిలి నెచ్చెలులు శిశిరోపచారంబులుచాలిం
చి చంద్రమందానిలకందర్పాదులంబ్రార్థించుటుడిగి వారిపయింగినుకవొడమి ॥
ఉ॥ పైకొనివచ్చెదేలనినుఁబాముదినంజలిగాలిప్రార్థనం । బైకొనవేలచంద్రనిను
గాముడువకామెలఁపేదిప్రేపెలెదో । కోకిలయేటికిట్లునినుఁగొర్తఁబడందరలాక్షిసే
యునీ । పాకముదప్పవేలనినుభస్మముగావలరాజయిత్తటిన్ ॥ ౨౦౫ ॥ తే॥ త
లఁపదోషాకరుండఁటేతగినప్రాపు । సహచరుఁడుజాతిమాలినచైత్రుఁడట్టె । యె
ప్పుడునుసీవునీయెడలెఱుఁగవింక।మదనమఱిమేమిచెప్పనీమధుపగుణము॥౨౦౬॥
వ॥ అనునంత నుదయగిరిశృంగాటకంబునం దుహినకిరణకిరణోదయసూచకంబ
గుచు నునుఁగెంపు జగజంపుగొనం గనుపట్టిన బిట్టులికి యబ్బాలికపాలికకరంబు
కరంబుననప్పళించియీరెలుంగున ॥ ౨౦౭ ॥ఉ॥ కూయఁగనిమ్ముకోయిలలఁగోప
ముదీరఁగఁబువ్వుఁదూపులి। ట్టేయఁగనిమ్ముమన్మథునినీయెడమాఱఁగనీకునేటికిన్।
మ్రోయఁగనిమ్ముతుమ్మెదలఁగ్రూరతమైననునేఁచుటెల్లఁదా । రీయుదయించువె
న్నెలవయింబడునంతకుఁగాదెకోమలీ ॥ ౨౦౮ ॥ క ॥ చిచ్చునకుఁగాడ్పుదో
డై । వచ్చినగతిమరునికబ్జవైరియుఁదోడై । వచ్చెనదెయాసవలదిఁక । మచ్చిక

దలపోసినన్నుమదిమఱవకుమీ ॥ ౧౩౦ ॥ వ ॥ అనియఖండపాండురప్రభాఢంబ
రంబున నంబరంబుఁగళింపుచు శుభ్రకరుండభ్యుదయవిభ్రమంబుచూపిన॥౧౩౧॥
చ ॥ పొడిచినచంద్రుఁజూచినృపపుంగవవచ్చితెయంచులేమపైఁ । గడువడిఁగేలు
సాఁచిబిగికౌఁగిటికందకయున్నఫ్రూనిక । ల్పడలివిషణ్ణయైమరలశయ్యపయింబడివె
చ్చనూర్చున । ప్పుడఁతిమనోజతీవ్రశరబాధలఁజిత్తగతుల్ భ్రమించెనర్ ॥౧౩౨॥
వ ॥ ఇట్లుచిత్తవిభ్రమణరూపంబైన దశాంతరంబు నొందివెండియు శశిమండలం
బుపయింగన్గొడి ॥ ౧౩౩ ॥ ఉ ॥ నిప్పులకుప్పమింటనదెనెచ్చెలికాదదిచంద్రబిం
బమో । యప్పయదేలమీఁదఁబొగయుంగనకాదదిపైకళంకిపుం । గప్పుతపింపఁ
జేయునఁటెకల్వలఱేఁడతఁడేలసేయునీ । ముప్పిరిగొన్నతాపమదిమోహము
నొందకువేతలోదరీ ॥ ౧౩౪ ॥ వ ॥ అనిసఖీప్రయత్నంబునంజంద్రుండకానె
ఱింగి నిజవిరహప్రవర్ధకవహ్నికింబయఃప్రపూరంబైన చంద్రికాసారంబు దుస్స
హంబగుటయుఁ గటకటంబడి యుడురాజునుపలక్షించి ॥ ౧౩౫ ॥ తే ॥ ఉవిద
వీఁడుసుధాంశుఁడైయుండితాప । మెట్లుసేయువియోగికినట్లుదలఁప । జలధిజ
న్మించునపుడెలత్మ్మంబుపేర । నడుమహాలాహలముఁదాల్చినాఁడుగాక ॥౧౩౬॥
తే ॥ పథికసంహారనిజపాపఫలమువలన । దినదినక్షయమునఁగడతేఱిపోయి । వి
రహిజనపాపఫలమునవీఁడుమరల । ననుదినంబునకభ్యుదయంబుఁబొందు॥౧౩౭॥
తే ॥ హాలహాలమునకంటెనీయమృతకరుఁడు । దుస్సహుండనుదృఢబుద్ధిదోఁచె
నాకు । మృడుఁడుహాలాహలముదక్కమ్రింగెఁగాని । వీనిమ్రింగియురాహువు
వెడలఁగ్రాయు ॥ ౧౩౮ ॥ క ॥ నిజమెఱుఁగలేదులోకము । నిజగురుతల్పగుని
యామినీపతివీనిన్ । ద్విజరాజనుచునుబేర్కొను । గజగామినినేతిబీఱకాయం
బోలెన్ ॥ ౧౩౯ ॥ సీ ॥ పుట్టండు ౹గొండఱుపుట్టయేమఱివృద్ధిఁబొందకుండఁగ
హానిపుట్టవలదె । వటమంద్రుగొందఱువటమేనియూడలువాఱిమండలమెల్లఁబ్ర
బలవలదె । మృగమంద్రుగొందఱు మృగమేనెదుగనీక మృదుకరాంకురములు
మేయవలదె । శశమంద్రుగొందఱు శశమేనిదేవతా పథికులకిరవు మార్పంగవ
లదె । వీనిలోనొక్కటెద్దియేనైననంక । ముండియునుజెడకున్నవాఁడువిదవీఁడు।
ధర్మపరుహేతువునఁగీడుదాఁకుఁగాని । పాపపరుఁదాఁకదనియెడు పలుకునిజ
ము ॥ ౧౪౦ ॥ ఆ ॥ అనుచునంతలోననతిసాంద్రచంద్రికా । స్పర్శనమునఁదను
వుపరవశముగ । నున్నశిశిరవిధులనొకభంగినబ్బాలఁ । దెలుపుచెలులఁబ్రోడచె
లువఁజూచి ॥ ౧౪౧ ॥ తే ॥ చాలుమనసేయుశిశిరోపచారవిధులు । మెలఁతకం
గజదశలుతొమ్మిదియునిండె । నింకఁబదియవదశఁబొవనీకవేగ । మగనితోఁగూర్పు
టయచల్లమందుసతికి ॥ ౧౪౨ ॥ వ ॥ అనిపలికియక్కన్యనంతఃపురంబునకుంగొని
వచ్చియప్పుడంతయునుమహాకాంతునకువిన్నవించినంజంచలస్వాంతుండైయతం

డును శీఘ్రంబవరునిఁగూర్చునుపాయంబు చింతించుచున్నసమయంబున॥౧౪౩॥
సీ॥ ఆగతిఁజిత్రస్వయంవరంబునఁదన్నుఁగుంతలేశ్వరపుత్రికోరుటెల్లఁ। జారు
లవలననిశ్చయముగవినిహర్షమెసఁగమాంధాతృమహీశుఁడనుప। దూతమోసల
నుండిప్రీతిమైఁదనరాకదౌవారికునిచేతఁదనకుఁజెప్పి। పంపినవినిజయభద్రుండు
సాద్భుతప్రమదుఁడైతోతేరఁబనుపవచ్చి। యుచితగతిఁగాంచిసత్క్రియారచ
నఁబొంది। చేరియర్హాసనముననాసీనుఁడగుచుఁ। గుశలసంప్రశ్నముఖసుఖగో
ష్ఠిఁజరపి। యాగమనకార్యమెఱిఁగింపనాత్మఁగోరి ॥౧౪౪॥మ॥ స్వగతక్షో
ణికిమేరకంబములుప్రాక్శైలంబునస్తాద్రియుం। జగతీనాయకులాత్మజంగమజ
యస్తంభంబులింద్రాదిదే। వగణాస్యంబులునైజసద్గుణలతావ్యాప్తోచితోపఘ్న
ముల్। తగదేసన్నుతిసేయనెవ్వరికిమాంధాతృక్షమావల్లభుఁ॥౧౪౫॥ తే॥
అమ్మహాత్ముండునీయల్లుఁడగుటఁగోరె। నెంతభాగ్యైకశాలివోకుంతలేశ। య
నుడుమదివెల్లివిరిసినహర్షజలధిలహరిమైవక్త్రమునసముల్లసనమెసఁగ॥౧౪౬॥
వ॥ మొదలఁజేసినచిత్రస్వయంవరప్రయత్నంబును వెనుకటిచిత్రకారోక్తియుఁబిద
పనైనకన్యామనోరథంబును దురీయంబైనవిచారవిశేషంబును సవిస్తరంబుగా
నెఱింగించి యాశ్చర్యైకథనంబైనయీయావిలంబఘటనంబు దైవకృతంబగుటఁ గృ
తార్థుండనైతింగన్యామనోరథపరిపాకంబు పరికించినందడయుటదగదు శుభస్యశీ
ఘ్రమ్మనునయంబయవలంబనీయంబని యప్పుడ మౌహూర్తికులరావించి చేరువ
నలగ్నంబునిశ్చయించి దూతపురుషు నుచితసత్కృతులఁబ్రీతునింగావించి నిజపు
రోహితసహితంబుగా నతనినయోధ్యకనిపి శుభలేఖాప్రేరణంబుననిజనిఖిలబం
ధుహితలోకంబురావించి పరిణయోచిత సమస్తవస్తుసంపత్సంపాదనంబునకుం
దగినయధికారులనియమించి పురంబుఁగైసేయంబనిచి నిజరాష్ట్రంబున నయో
ధ్యానగరమార్గంబున విడుమలాయితంబు సేయించి జామాతృసమాగమప్రతీక్షా
పరుండైయుండునంతఁ గతిపయదినాంతరంబున ॥౧౪౭॥ శా॥ సప్తద్వీపధ
రాధవుల్నిజచమూసంయుక్తులైశ్రీకరుల్। సప్తాశ్వాన్వయజుల్భజింపఁద్రిదశై
శ్వర్యప్రదంబైజగ। ద్వ్యాప్తాశ్చర్యమెలర్పవచ్చెఁదగమాంధాతృక్షమాభర్త
సం। ప్రాప్తాభీష్టమనోరథంబగుటకుఁ భావంబునంబొంగుచుఁ ॥౧౪౮॥
వ॥ ఇట్లరుగుదెంచి నిజబంధుసామంతసేనాసమేతుండై దూరంబునఁగుంతలేం
ద్రుండెదురుకొనితోతేర మంగళాలంకారసంకులంబైన తదీయపురంబుంబ్రవే
శించి రాజమార్గంబునంజనునప్పుడు ॥౧౪౯॥ సీ॥ క్రొవ్వెదయూఁదినకుడిచే
తికరమూలకాంతులుకేయూరకాంతిఁబొమవఁ। బెఱకేలికందనిబిగిగుబ్బచనుఁ
గ్రేవనిగ్గుపయ్యెదకువన్నియయొసంగఁ। దఱుచుటూర్పులతావికెఱఁగుముంద
టితేంట్లదినిరెడునునుఁజూడ్కితెలుపుసేయఁ। గడుఁబేదయగుకౌనుగమనవేగం

బున మెలఁ పేదిజవజవజలదరింపఁ । గులుచ నెట్టుననంటియల్ చలిచి మొరయఁ । బిఱుఁదుద్రేకంబు చేసీవిబిగువుసడలఁ । జూపరుల కెల్లఁదనుఁగనుచూఱయొసఁగి । వేగపఱ తెంచిచూచెభూవిభు నొకర్తు ॥ ౧౫౦ ॥ చ ॥ తరుణియొకర్తుకంఠమునఁదాల్పఁగఁదావసమేదిహారముల్ । కరములయందుఁబూనిపతిఁగన్గొనవచ్చెరయంబుమైస్వయం । వరమునఁదానమున్ననృపవర్యువరింపఁగఁగోరిమంగళా । విరళమధూకదామకము వేడుకఁజేకొనివచ్చెనోయనన్ ॥ ౧౫౧ ॥ చ ॥ నెఱఁకులుగాఁడదన్మరుఁడునిర్దయుఁడేసినతూఁపు లేఱియ । త్తెఱఁగెఱిఁగింపభూపతికిఁదెచ్చుగతిన్విసదోఁపవచ్చుచోఁ । దుఱుమనెఱుంగకొక్కసతితోడనతెచ్చినఁబొల్చెదోయిటన్ । గిఱికొనుపాణిపద్మరుచిఁగెంపువహించినకమ్మగ్రొవ్విరుల్ ॥ తే ॥ తమకమునఁబాదలాక్షయంగముననలఁది । నృపతిఁగన్గొనవచ్చెఁగన్నియయొకర్తు । విటులనెత్తుటజొత్తిల్లివెఱపుఁగఱపు । మకరకేతనుఖడ్గపుత్రికయుఁబోలె ॥ ౧౫౩ ॥ క ॥ ఇలఱేనిఁజూడఁజనుతమి । లలనయొకతెతడఁబడినయలంకారముతో । వలయువడిగూడనిపద । స్ఖలనంబునుగలిగికుకవికవితయుఁబోలెన్ ॥ ౧౫౪ ॥ ఉ ॥ ఆరనిచెక్కులేఁజెమటలప్పటియుంబొడమంగనిక్కుచొ । ప్పారనిమేనిముత్పులకలగ్గలమైయుదయింపప్రూనుపా । టారనిచూడ్కిఁవెండియునునన్ననసోలరతాంతతాంతియ । ల్లారకమున్నవచ్చియొకయంగనచూచెనరేంద్రచంద్రునిన్ ॥ ౧౫౫ ॥ ఉ ॥ భారపునిండువెక్కసపుఁబ్రాయపుజవ్వనియోర్తుమందిర । ద్వారమునందునిల్చినృపవంశమనోభవుచిత్తమోహనా । కారముఁజూడనంగజవికారవశంబుననీవిజాఱినం । గూరినసిగ్గుమైఁదలుపుగొబ్బనమాటుగఁజేసెనాభికిన్ ॥ ౧౫౬ ॥ ఉ ॥ అంబుజనేత్రయోర్తువసుధాధిపుఁగన్గొనుచోరసాతిరే । కంబునఁజేతమున్నతమకంబునఁదెచ్చినదర్పణంబునం । బింబితమైనరాజుప్రతిబింబముచెక్కులనొక్కిగ్రక్కునం । జుంబనమాచరించిచెలిఁజూచిముఖాబ్జమువంచెసిగ్గునన్ ॥ ౧౪౭ ॥ తే ॥ మానలేకనిగిడ్చిరిమఱియుమఱియు । సతులుదృగ్జాలములురాజచంద్రుమీఁద । నతనిలావణ్యజలధిలోనణఁగియున్న । తమిమనంబునశోధింపఁదలఁచిపోలె ॥ ౧౫౮ ॥ క ॥ పెల్లుకొనఁగురిసిరప్పుడు । దల్లుగఁదమచూడ్కులకునుదలమిచ్చుచుభూ । వల్లభుపైఁబురభామలు । కొల్లలుగాలాజమిళితకుసుమాంజలులన్ ॥ ౧౫౯ ॥ వ॥ ఇట్లుపౌరవిలాసినీదృక్చకోరచంద్రుండగుచుఁ జనుదెంచినరాజచంద్రుం గుంతలేశ్వరుండాత్మనిర్దిష్టంబును మంగళాలంకృతంబునగువిడిదివిడియించి యితరసామంతమంత్రిపరివారచమూవర్గంబులఁదగిననెలవులవిడియించి యుచితోపచారంబులం బ్రీతులంగావించి వివాహమంఁడపంబునకుందగిన వస్తువులొడఁగూర్చుటకుఁదగువారినాదేశించియనంతరంబపతంగుండపరదిగంగనాసంగతుండగుచువచ్చినం గుమారికనలం

కరింపనియమించినంబనిపూని పాలికాదిసఖీజనంబులంతిపురంబున ॥ ౧౬౦ ॥ తే॥
విరహపరితాపశాంతికై వెలఁదిమున్ను । చలువలొనరించినట్టిచేతుల నెనీకుఁ । బ
రిణయాలంక్రియలు సేయు భాగ్యమబ్బెఁ। జెలియమున్నెమినోము నోఁచితిమొ
మేము ॥ ౧౬౧ ॥ వ ॥ అనివెండియు ॥ ౧౬౨ ॥ సీ ॥ అంగసంభవుఁడింకన
జ్ఞాజ్ఞనీకువిధేయుఁడై కనుసన్నఁదిరుగుఁగాక । నఖపదచ్ఛలమున సఖియాకళా
నిధివచ్చినీశరణంబుఁజొచ్చుఁగాక । చెమటలార్చుచు సేవ చేసి సుందరిమందపవ
నుఁడునీకృపఁబడయుఁగాక । తరుణిసోలపుటూర్పు తావియెంగిలిగ్రమ్మి తేంట్లునీ
లెంకలై తిరుగుఁగాక । సీతుకృతులనభ్యసించినశిష్యులగుచుఁ । జెలువచిలుకలు
నీమాటసేయుఁగాక । తొలుతవలవంతగొలిపినద్రోహులగుటఁ । గాంతనీవింక
రతిఁబతిఁగలసినపుడు ॥ ౧౬౩ ॥ వ ॥ అనిసమేలంబుల మేలంబులాడుచు లజ్జా
వనతసస్మితముఖారవిందయగు నక్కన్నియకు మంగళాభ్యంగంబు మొదలును ద
ర్పణదర్శనంబు తుదయునుంగా విచిత్రభంగుల శృంగారించిన ॥ ౧౬౪ ॥
ఉ ॥ శారదలక్ష్మిఁజేకొనినచంద్రకళాకృతి నెల్లసానలం । దేరినరత్నలేఖికగతిన్మ
ధుపుష్పితపల్లవస్థితిం । గారునఁబుట్టిక్రొత్తసిరిగైకొనిక్రాలు మెఱుంగుభంగిశృం ।
గారముపూనియచ్చెలువకన్నులపండువయయ్యెనయ్యెడన్ ॥ ౧౬౫ ॥ ఉ॥ చొ
క్కపుజల్లిమీఁదనిరుసూరెలఁగుండలరత్నముల్పయిన్ముక్కరము త్తియంబుగలము
ద్దియముద్దుమొగంబుచూడగాఁ । జుక్కలరాణివాసములుచుట్టునుగొల్వబుధుం
గుమారుఁజే। రక్కనగ్రుచ్చియెత్తుకొనియాడెడురాజునుబోలెనత్తఱిన్ ॥ ౧౬౬ ॥
క ॥ కరివంకబొమలపైఁగ । స్తురిదీర్చినతిలకరేఖసుదతికిఁబొల్చె । న్మరుఁడువెడ
వింటఁదొడిగిన । యరవిరిననల్లగల్వయమ్మునుబోలెన్ ॥ ౧౬౭ ॥ తే ॥ ఉ
న్నఁగరికుంభములకులోనుండునంద్రు । గానిమరుపట్టబద్ధయోగ్యగజకుంభ ।
ములకునదెమీఁదగ్రాలెడుముత్తియంబు । లనఁగసతిచన్నుఁగవఁబొల్చెహారమ
ణులు ॥ ౧౬౮ ॥ తే ॥ హారరత్నప్రతిచ్ఛాయలడరఁగలసి । క్రాలుకరమూలకు
చమూలకాంతివలన । నింతిమృదుబాహులతలయందెఱుపలుప । నర్పితముల
య్యెఁగనకశతాంగకములు ॥ ౧౬౯ ॥ క ॥ గురుకుచభరభంగురమగు । తరు
ణీమణికౌను పేదతనమేతనకా । భరణముగఁబొలిచెఁగలదే । పరభరణముకం
టెసొమ్మపరికింపంగన్ ॥ ౧౭౦ ॥ క ॥ తరుణీమణికటిరత్నా । కరమేఖల
యగుచుఁబృథ్వి గావునఁబొలిచెం । బరికింపఁబృథ్వీరత్నా । కరమేఖలయగుచుఁ
బొలుపుఁగైకొనుఁగాదే ॥ ౧౭౧ ॥ సీ ॥ మగువచన్నులఁగుంకుమముపూయు
టాత్మీయకరికుంభయుగళిఁజెందిరముగాఁగఁ । దెఱవక్రొమ్ముడివిరుల్ దుఱుము
టనిజతూణీనేర్చినారాచంబులిడుటగాఁగఁ । గడకంటఁజొక్కపుఁగాటుకఁదీర్చు
టతనవింటనళిగుణోద్ఘాటనగాఁగ । గజయానకటిరటత్కాంచివహించుటనిజస

మారంభడిండిమునుగాఁగ । బాలికామణిశృంగారభంగులెల్ల । విశ్వవిజయై
కదీక్షాప్రవృత్తుఁడైన । తనకుసమరోక్తసన్నాహదశలుగాఁగ । దర్పితుండ
య్యెమిగులఁగందర్పుఁడపుడు ॥ ౧౭౨ ॥ వ ॥ అంతట మహీరమణచంద్రముఁ
డునుంబారిజాతమహీజాతంబు వసంతవిలసనంబునుంబోలెఁ బరిణయోచితా
లంకరణంబుఁబూని పంకజహితుండపరజలధింగ్రుంకినం *గరణీయంబులు నివ
ర్తించి మౌహూర్తికదత్తంబైన సుముహూర్తంబునికటంబువిచ్చేయుమని భా
వుకవిజ్ఞాపకుండై ॥ ౧౭౩ ॥ సీ ॥ మూర్ధాభిషిక్తులముకుటరత్నద్యుతులకు రదీపదీ
ప్తులఁగలిపికొనఁగ । రత్నవేత్రపరంపరారుచుల్పురసతీనీరాజనాంశులనిలిపికొనఁ
గ । స్మేరముఖాంబుజశ్రీపార్శ్వదోధూయమానచామరలక్ష్మిమాలుకొనఁగ । వంది
మాగధులకైవారంబురావంబుశుభతూర్యరవములఁజూఱకొనఁగఁ । బసిఁడిరథ
మెక్కి విపులవైభవము మెఱయఁ । జూపరులకెల్లవేఁకపుఁజోద్యమొదవ । సాంగ
మైవచ్చుభాగధేయంబుఁబోలె । మామయింటికివచ్చెజామాతయపుడు ॥ ౧౭౪ ॥
వ ॥ ఇట్లరుగుదెంచి రథావతరణంబొనరించి యెడనెడఁబ్రాయంపుఁ బడంతులు
తమమెఱుంగుఁజూపులతోడి కర్పూరదీపకళికలనిగిడింప మంగళాలంకారసం
కులంబులగుకక్ష్యాంతరంబులుగడచిచనినయనంతరంబయభ్యంతరంబున ॥ ౧౭౫ ॥
చ ॥ కదళములూరుకాండములుగాఁగఁదలంపుచుఁబూర్ణకుంభసం । పదఁగుచ
కుంభభావనయపైకొనదర్పణలక్ష్మిచేహస । ద్వదనముచూచినట్లయిప్రవాళరు
చింజిగిమేనఁదోఁపఁగా । నెదుటనెయున్నకన్నెసవియోపతిచూచెవివాహవే
దికన్ ॥ ౧౭౬ ॥ వ ॥ ఇట్లు కన్యావిలోకనమనోరథంబు తమకంబు రేఁపం
గల్యాణరంగంబు గదియంజనుదెంచి యచటనర్పితమహార్హమణిమయోన్నతపీ
ఠాసనంబుననాసీనుండై విద్వదుపదిష్టమార్గంబునం గుంతలేంద్రుండుగావించు
మధుపర్కాది యథోక్తశుభసమర్చనంబులు గైకొని నిజహృదయచిరమదనవ
హ్నికింబ్రశామకంబుగా నతండొసంగు కన్యాదానోదకధారంబరిగ్రహించి
కౌశేయయవనికావ్యవహితయగు గుంతలేశ్వరదుహితం గదియవచ్చినప్పుడు ॥
క ॥ ఒండొరుఁగనుఁగొనఁదివురుచు । నుండువధూవరులమదనుఁడొగిఁదూపుల
చే । నిండుదెరచాటుగైకొని । రెండును దనయంపదొనలు రిత్తగ నేసెన్ ॥
క ॥ వెలిపట్టుపచ్చడము తెర । వోలిచెవధూవరులమధ్యమునవారిమది । న్వల
రాచశివముఁగొలుపఁగఁ । దొలితొలిఁగర్పూరధూపధూమంబనఁగన్ ॥ ౧౭౯ ॥
క ॥ రమణీజనంబుకల్యా । ణముపాడఁబవిత్రతూర్యనాదములెసఁగన్ । సుము
హూర్తమయినవేడ్కలఁ । దిమురువధూవరులనడిమితెరయెత్తుటయున్ ॥ ౧౮౦ ॥
తే ॥ తగవుప్రాపునలజ్జనధఃకరించి । నెలఁతనెమ్మోముజిగిఁగ్రోలెన్నృపునిదృష్టి ।
తెరయెడల్చినఁగనుఁదెప్ప తెరవహించి । నిగిడెనధిపతిమూర్తిపై నెలఁతచూడ్కి ॥

మ ॥ తెరవట్టించినవేళఁ జేతివిలసద్దివ్యప్రసూనాస్త్రముల్ । సరిపోనేసిసుమా
స్త్రుఁడేసెఁ బిదపన్ జంద్రాననన్నృపవరుం । దెరయెత్తించినవేళఁ గూర్మియలుఁగు
ల్దీండ్రించుచుం గోరుక్కల । న్గరులన్గల్గినతత్పరస్వరసమీక్షాతీక్ష్ణబాణంబులన్ ॥
॥౧౮౨॥ వ ॥ తదనంతరంబ ॥౧౮౩॥ తే॥ మన్మథుఁడు తానతనదు సామ్రాజ్యమున
కుఁ । గాంక్షయువరాజ్యపట్టంబుగట్టఁ జేసె । శీతకరునకుముక్తాభిషేకమనఁగ ।
భర్తచంద్రాస్యపైఁదలఁబ్రాలువోసె ॥ ౧౮౪ ॥ చ ॥ ఎగయుచున్నజక్క
వలనేలుచనుంగవద్రేఁగునందెగెం । దెగెననఁగౌనుసాఁగికొననిక్కబయల్పడు
బాహుమూలమున్ । దగదగమించునిండుజిగిదట్టపుఁబైఁడివసంతమాడఁగా । మ
గనిశిరంబుపైనినిచెమానిని వేతలఁబ్రాలుదోయిటన్ ॥ ౧౮౫ ॥ క ॥ ఒండొరు
లువోయుతలఁబ్రా । లొండొరుదేహములుసోఁకియుల్లంబులయం । దొండొరుఁ
గౌఁగిటఁ జేర్చిన । నిండుముదంబొదవఁ జేసె నెలఁతకుఁ బతికిన్ ॥ ౧౮౬ ॥ క ॥
అంగజవికారవశమున। నంగుళములువణఁకవణఁకనప్పుడు భూభృ।త్పుంగవుఁడు పె
ద్దదడవున । మంగళసూత్రంబుగట్టెమానినియెడన్ ॥ ౧౮౭ ॥ క ॥ పరిరం
భత్వరగలయొం । డొరులమనంబులకుఁ గొంతయూఱటగాసుం । దరియొక్క
తెముడిచెవధూ । వరులకునపుడుత్తరీయవసనాంచలముల్ ॥ ౧౮౮ ॥ తే ॥
తనదుపంతంబుచెల్లినదర్పకుండు । వేడ్కరతిచేతఁదనచెయివేసినవ్వె । గురుజ
నులయాజ్ఞనపుడొక్కతరుణినగుచు । బాలకెంగేలుపతికేలఁగీలుకొలిపె॥౧౮౯॥
క ॥ సంగతిలేనితరసమ । స్తాంగంబులఁదొఱఁగిగన్నియకుఁ బతికిమిథ । స్సంగ
తములైననిజహ । స్తాంగుళములయందునిలిచెనపుడుల్లంబుల్ ॥ ౧౯౦ ॥ వ ॥ అ
నంతరంబగురుజనపురస్సరంబుగాఁ గల్యాణరంగంబునకువచ్చి యథోక్తవిధిశుభ
హోమకృత్యంబునిర్వర్తించునప్పుడు ॥ ౧౯౧ ॥ సీ ॥ తఱివేచియొండొరుమొ
ఱఁగికన్గొను నాసఁదారలుకడగంటఁ జేరిమెలఁగఁ । బార్శ్వదృష్టికిఁగానఁబడునం
తనంతనయంతయుఁగనుటగానాత్మలలర। హోమధూమంబులకొఱగుపేరిటఁ
జూడకైననొండొరుమోములభిముఖముగ । స్పర్శలేకున్ననాసన్నపార్శ్వంబు
లుపెరపార్శ్వములకంటెఁ బ్రియముగాఁగ। హోమవేదియందునొక్కపీఠంబు
న।నొప్పిరపుడుకన్నెయునువరుండు।గంతుఁడిరువురందుఁగలకూర్మిలొక్కంత ।
చూచికల్లవైచితూఁచుకొనఁగ ॥ ౧౯౨ ॥ వ ॥ ఇట్లువివాహంబునిర్వర్తించిక్ర
మంబునదినచతుష్టయంబరిగినం బంచమవాసరంబునఁ బ్రభాతంబగునంతఁగుం
తలేశ్వరుండుపరిణయాగతరాజసమాజంబుఁబూజించి శుభముహూర్తంబునవ
ధూవరులంబయనంబుచేసి ॥౧౯౩॥ రగడ॥పగడపుదీఁగెలుగోమేధికములు పచ్చ
లుఁగెంపులుపుష్యరాగములు । నిగనిగమనువైడూర్యములునుహరినీలములంభో
రుహరాగమ్ములు । ముక్తాఫలములువజ్రోపలములు మొదలగునవమణిసందో

హంబులు । శుక్తిపాలికలు శంఖపుటంబులు శుద్ధసువర్ణాదికలోహంబులు । వెలి పట్టులు మంజిడులును దోఁపులు వెల్లులుఁ జెంగావులు సకలాతులు । వలిపంబులు దుప్పట్లును మాదావళులును జీబులు జిలిబిలిజాతులు । గింటెంబులు బత్తీనీల్ పసలీగిముకాకరకులు సుకదట్టమ్ములు । కంటకిగుజ్జరిమదుపులు మొదలుగఁ గలిగినపలువన్నెల పుట్టమ్ములు । కుంకుమపువ్వగరును దట్టపునుంగును గస్తూరియు హిమవాఃపూరము । సంకుమదంబు గుమంజియుఁ బూతియుఁ జందనఖండంబులుఁ గర్పూరముఁ । దెల్లనిజల్లులు వింజామరములుఁ దెగగలసవరాలేనికకొమ్ములుఁ । జల్లనిగందపుఁజిప్పలు రత్నపుసానలు శశికాంతము నద్దమ్ములుఁ । బగడపుబరణులు దంతపుఁబెట్టెలుఁ బలువన్నెల చిలుకలయడకొత్తులు । జిగిగలపగడపుగిండ్లును గిన్నెలుఁ జిత్రములగు ధూపంబుల వత్తులు । జాలవల్లికలు పలుమానికముల చదరంగంబులు సొగటాసారెలు । కాళాంజులు మసగపుప్రతిమలు మేల్కట్టులు నేకాండపుఁదెరచీరెలు । సరసపుఁబలుకులు గద్యపద్యములు చదువఁగ నేర్చిన శుకశారికలును । నిరతము నాడఁగఁ బాడఁగ నేర్చిన నెచ్చెలి నెఱజాణకుమారికలును ॥ ౧౯౪ ॥

క ॥ మున్నుగు వస్తువులరణము । కన్నియకిడి వెంటమూడుగమనములరుగన్ । మన్నించి నిలిపి వీడ్కొని । యున్నతముగఁ బతియుఁ గూర్మియు విదయుఁ దానున్ ॥ ౧౯౫ ॥

వ ॥ సైన్యసమేతుండై కతిపయ ప్రయాణంబుల నయోధ్యాపట్టణంబు గదియం జని నిజసామంతపౌరవర్గంబు లెదుర్కొన మహోత్సవాలంకృతంబైన పురంబు ప్రవేశించి సఫలమనోరథుండై మఱునాడు వివాహసమాహూతులై వచ్చియున్న సకలరాజలోకంబును చితసత్కారంబులం బ్రీతులం గావించి నిజదేశంబులకనిపి యుచిత వ్యాపారంబుల దినశేషంబు గడపి నిశోదయంబునఁ గృతకరణీయుండగుచు నవోఢారిరంసామాంసలంబైన చిత్తంబున ॥ ౧౯౬ ॥

సీ ॥ రతిబంధబంధురప్రతిమావితానంబు కల్పితకల్హారకల్పకంబు । సురభితైలోదయచ్ఛురితప్రదీపంబు కర్పూరధూపసమర్పణంబు । శుక్తివిన్యస్తకస్తూరీపటీరంబు వీటికాపరిపూర్ణపేటికంబు । శయ్యాసమీపకాంచనకళాచికంబు గంధవద్వారిభృంగారుకంబు । భర్మపంజరశుకశుకీపఠ్యమాన । కామశాస్త్రోక్తబహుపద్యగద్యకంబు । కరణనికరసమున్మాదకారణంబు । మనుజపతిసౌచ్ఛె మోహనమందిరంబు ॥ ౧౯౭ ॥

వ ॥ చొచ్చి క్రీడాగృహమధ్యంబున సమున్నతరత్నపీఠంబున నలంకరించి యుచిత పరిచారికలు సేవింపనుండునంత నటమున్న పాలికాదిప్రౌఢసఖీజనంబు విమలాంగిం జేరనరిగి ॥ ౧౯౮ ॥

తే ॥ జుపూసకుఁగనకనిష్కములు వ్యయము । సేఁతతకెక్కినపసులుగై సేఁతసతికి । జాతిమణిగొనఁగనకనిష్కములు వ్యయము । సేఁతవరుగూర్చుపనికిఁగై సేఁతసతికి ॥ ౧౯౯ ॥

వ ॥ అట్లగుటనీకునిప్పుడు సఫలంబైనశృంగారంబంగీకరింపవలయురమ్మని ప్రారంభప్రయోజనంబు

చేటపడంబలికిఁ బ్రహర్షజనిత ముఖవిలాసాలంకృతయగునచ్చెలువకుఁ బునరుక్తం బుగా సమయసముచితాలంకరణం బొనరించితోతేర లజ్జాప్రవాహంబునకు నెదురేగుటగా నెట్టకేనియుం గేళీమందిరంబునకు వచ్చునప్పుడు ॥ ౨౦౦ ॥ తే ॥ నిబిడవీచీపరంపరానీతయగుచుఁ । గొలనిదరిఁ జేరు జలరుహంబుల పరాగ । రేఖయును బోలెఁ బ్రియసఖీప్రేరణమున । నెయ్యనెయ్యనసతి కేళిశయ్యఁ జేరె ॥ ౨౦౧ ॥ తే ॥ తల్పమునకు సఖీప్రయత్నమున వచ్చు । నభినవోఢకు నడుగడుగామడయ్యె । దలఁపు పురపురఁ గొనఁ దత్తఱిలు తదీయ । కాంతునకుఁ దత్క్షణము బ్రహ్మకల్పమయ్యె ॥ ౨౦౨ ॥ క ॥ మరుఁడును లజ్జయు డెందము । సరిపాలం బంచికొనఁగ సాధ్వసమునఁ । దత్పరిశిష్టాంశము గొనియే । వరతల్పమునకు నవోఢ వచ్చెఁ గడంకన్ ॥ ౨౦౩ ॥ వ ॥ ఇట్లరుగుదెంచి ప్రాంతరత్నస్తంభంబు దాపుగొని సఖీజనంబుల మఱువున లజ్జావనత వదనారవిందయగు సుందరింగడచి ముందఱికి వచ్చి తనకు మ్రొక్కిన పాలికం జూచి నృపాలతిలకుం డాఁగిన మనఃప్రమోదంబు మొగంబున దరహాసంబు మొలపింపనిట్లనియె ॥ ౨౦౪ ॥ ఉ ॥ పాలిక యేమి వార్తధరపైధరకేమిటి వార్త దేవనీ । వేలఁగ నొవ్వగోరుకొను దీవనుభీతి యెదకఱ మానెఁగా । కేలభయంబు సేయు పనియెవ్వరు మానుమనంగఁ గర్తలీ । వేలిక వొంటరెంటనయమిమ్మని కాకిటు విన్నవించుటల్ ॥ ౨౦౫ ॥ చ ॥ ఇది తఱియయ్యెఁ జంద్రుఁడుదయింపఁడదేముదయింపకుండు టెట్లుదయముపై మొగుల్పొదివియున్నది యింతియె కాక యద్దెసం బొదలెడు నాఁకటన్బడలెఁ బొమ్ము చకోరములంతయేల పైనొదవెడు మేఘముల్దొలఁగకుండఁగ వచ్చునె శీతరోచికిన్ ॥ ౨౦౬ ॥ వ ॥ అనియిట్లు నర్మగర్భంబుగా నన్యాపదేశవచనసందర్భంబులం దనతలంపునకనుగుణంబులుగాఁ బ్రత్యుత్తరంబులిచ్చిన ప్రౌఢతనంబునకు మెచ్చి పాలికను నితరసఖీజనంబులకుం గర్పూరవీటికలొసంగి నచ్చెలువలు విభుని హృదయపరిపాకంబెఱింగి యొక్కొక్క నెపంబునం గన్నియ మొఱంగి యందఱుం గ్రీడామందిరంబు వెలువడిన యనంతరంబ ॥ ౨౦౭ ॥ క ॥ కెలని మణికుడ్యతలమునఁ । బొలసిన తననీడ దోడి బాలయనుచు న । చ్చెలువ విభుఁడంత నొయ్యనఁ । బలికించినఁ దెలిసి యులికి పడి వెడలు నెడన్ ॥ ౨౦౮ ॥ ఆ ॥ చెట్ట యొడిసి పట్టి సెజ్జకుఁ దివియుచో । నడుగు బిగ్గఁ ద్రొక్కియతివ యపుడు । కూర్మి విభుని మీఁద గొనయ మెక్కించుచో । నల్లవంగు మరుని విల్లువోలె ॥ ౨౦౯ ॥ చ ॥ తలిమముఁ జేరకున్న [illegible]ఁ దత్తఱమెత్తి విభుండు బాలికన్ । నిలువునఁ గౌఁగిలింప రమణీరమణీయశరీరయష్టము । త్పులకితమైనఁ బొల్పెసఁగె భూవరకల్పకబాహుశాఖలన్ । వలగొనియున్న కోరకితవల్లి మతల్లియుఁ బోలెనయ్యెడన్ ॥ ౨౧౦ ॥ సీ ॥ వెడలిపోఁదలఁచుచో నొడిసి కేల్పట్టినఁ దిరిగి నెచ్చెలిఁ జూచు దీనదృష్టి । శయ్యకుఁ దిగుచుచోఁ జనుదేక బిగ్గరఁ జరణాంబుజము ద్రొక్కు

చండితనము । బలిమిఁగౌఁగిటఁగ్రుచ్చితలిమంబుఁజేర్చుచో నెడఁబాటుచాలనిని
డుదయూర్పు । ముంగేలవంచినమొగమెగయించుచో మెయికొను నేత్రనిమీలనం
బు । మాటలాడకచేకొన్నమౌనముద్ర । రైమెదునివిపంచబాణునికైదుతూపు। ల
వ్యోఁబతిడెందమునఁగాఁడునట్టులేయ । నంగనామణిసవిక్రొత్తసంగమమున ॥
సీ॥ తలవంచుటయెకానితప్పకకనుప్రేమఘనమనిలోచూపుగతమువెట్ట। మౌనము
ద్రయెకానిమాటాడువేడుక గడుసనిముఖకాంతిముడియవేయ । నడ్డగించుటె
కానియాలింగనప్రీతిబలువనికంపంబుబాససేయఁ । బైవెట్టమియెకానిపైకొనుత
మికల్మిసత్త్వనిపులకలుసాక్షిపలుక । కరుణముగవేఁడఁజొరమియెకానిమనసు ।
కరఁగినదియనిచెమటపైకంటఁజాట । హృదయనాథునిమదిదకక్కనేలుకొనియె ।
బాలికామణియపుడుదాఁబ్రథమరతిని ॥ ౨౧౨ ॥ చ ॥ బలిమిరసాతిరేకమునఁ
బయ్యెదకొంగెడలింపఁగంపముం । డళుకునుగల్గుతొల్కరిఁ గనంబడుక్రొత్తమె
ఱుంగుఁబోలెన । ప్పొలఁతిమెఱుంగుమేనదియు భూవరుతాల్మిమరుండుదెంపఁ
గాఁ । బెలుచనెరన్వెడల్చిజల్లిపించుకృపాణికయయ్యెనయ్యెడన్ ॥ ౨౧౩ ॥
క॥ కొల్లలుగోనట్టాడెడు । వల్లభుదృఙ్మధుపతతులవ్రాలఁగనీకు । త్ఫుల్లకుచగుచ్ఛ
ములఁగర । పల్లవపుటయుగళిచేతబాలికపొదివెన్ ॥ ౨౧౪ ॥ తే ॥ కంకణ
క్రేంకృతులపేరఁగలహమాడి । యధిపుకరములతోబాలహస్తయుగము । సరిఁ
బెనంగఁగనాకేలజగడమనుచు । జాఱుగతినీవితనుఁదానెజాఱెసతికి॥ ౨౧౫ ॥
తే ॥ పయ్యెదనుబలముదూలినఁబణఁతిబాహు । శక్తిఁగుచదుర్గములఁగాచిజా
ఱునీవిఁ । బట్టఁబోయినరాజుచేఁబడియెరెండు । భేదముననెంతకార్యంబుగా
దుతలఁప ॥ ౨౧౬ ॥ తే ॥ ముగ్ధయగుగాకయేమింతముగ్ధగలదె । బాలజఘనాం
శుకంబింకనేలపెనఁగ । రాజవరునకురోజదుర్గములురెండుఁ । జేపడియెనట్టె
యిఁకఁగ్రిందిసీమయెంత ॥ ౨౧౭ ॥ క ॥ ఒడిసిజఘనాంశుకంబపు । డెడలిం
చినవిభునిదృష్టికెడయీనిమతిన్ । బడఁతుకలజ్జావశమునఁ । గడువడితోఁబొ
దివిబిగ్గఁగౌఁగిటఁజేర్చెన్ ॥ ౨౧౮ ॥ ఉ ॥ చూడనిచూడ్కియున్నలుకఁజూ
డనివాక్కనుగౌఁగిలింపఁగాఁ । జూడనికేలుగంటియిడఁజూడనిమోవియుమాఱు
సేయఁగాఁ । జూడనిచెయ్వుఁబైకొనఁగఁజూడనికాయముఁగల్గితొల్తొలిన్ । జే
డియసంగమంబునృపుచిత్తముఁదత్తఱపెట్టెనింపునన్ ॥ ౨౧౯ ॥ చ ॥ వెఱపు
నలంతికంపమునుపీడనివ్రీడయుమా యఁగా । నెఱుఁగమియేపులేమిపరియె
త్తైడుచొక్కలగోలుముందుగా । మఱుపుమొగంబునోరయునుమాటుగతె
ప్పలఁగప్పుచూడ్కియుం । దెఱవనవాగ్రసంగతిఁబ్రతిక్రియలైయలరించెభూవి
భున్ ॥ ౨౨౦ ॥ సీ ॥ కేలితోఁగేలుకెంగేలఁగీలించుచోఁబులకోద్గమమువెంట
వెలువరించి। యొయ్యనెయ్యనమీఁదిపయ్యెదఁదివియుచోఁబొఁడముకంపములతో

నెడలఁదూల్చి । కడునించు మెత్తని కౌఁగిటఁ జేర్చుచోఁ గ్రమ్ము లేఁజెమటలఁ గరఁ
గజార్చి । మరపించి యొల్లని మర్మంబు లంటుచోఁ బుణికి కిళ్లనెళవులు పుణికి వైచి । ప
లుదెఱంగుల మది సిగ్గు వెలితిపఱిచి । దినకరాన్వయుఁ డొకకొన్ని దినములకును ।
బాలఁ తిరమెడఁబూనిక్కఁ కోడఁ బాటుపొందుఁ గాంచె । నిగ్గుచు కొదుక్కలఁ దనడెంద
మివతళ్లింప ॥ ౨౨౧ ॥ సీ ॥ పది ప్రశ్నముల కైనఁ బ్రత్యుత్తరముఁ బొందఁ జూ
చువీనులకింపు రేఁచి పెట్ట । నిరువది పొంచుల కెదిరించు నెకచూపు కనుఁబండు
వకు సంచకరువు గాఁగ । ముప్పది కౌఁగిలింపులఁ గాంచు బిగియెంముఁ జోఁకుచోఁ
కున గోరు సోఁకఁ జేయ । నలువది మనవులఁ గల యొక్కయొడఁ బాటు పార
వశ్యమునకుఁ బరిసనముగ । నడ్డగింపును గాక సయ్యాట లేక । యంతరాళంబు
లొకకొన్ని యహహములహహ । వేఱయొకకొంతరుచిగొల్పె విభుని మదికిఁ । గిస
లయాధరతోరహఃక్రీడనములు ॥ ౨౨౨ ॥ సీ ॥ నెమ్మోవి దాఁచెడి నెపమునఁ జె
క్కులు చుంబింప నెడమిచ్చు సుదతి నేర్పుఁ । గినిసి చెక్కులు దాఁచి కొనియెడి నెపము
న మోము మోమునఁ గూర్చు ముదిత వెరవు । నెడలెడి తనసీవి సవరించు నెపమునఁ
గౌఁగిటి కొదవించు కాంత తలఁపుఁ । గరములఁ జనుదోయి గప్పు నెపంబున నీవి కసంది
చ్చు నెలఁత మతముఁ । దొడిఁబడక గానఁబడనీక యొడలు నులియు । నెపము మైఁ
గౌఁగిటి కెదుర్చు నీరజాక్షి । యుపమయును భూమివల్లభునుల్లమునకుఁ । గ్రొత్త
చవిగొల్పె మఱి వేఱొకొన్ని నాళ్లు ॥ ౨౨౩ ॥ ఉ ॥ చేసినచోఁ బ్రతిక్రియలు సేయ
నెఱుంగమి మున్నతోడుతోఁ । జేసిన చేఁతకున్మరలఁ జేయఁగ వేడుక సేసి యంత
టన్ । జేసినఁ జేయఁ జొచ్చెఁ జెలు చెయ్యలనంతటఁ బ్రోడయైతుదిన్ । జేసెఁ బ
యోజనేత్రపతి సేయక యున్ రతిఁ జేయు చెయ్వలన్ ॥ ౨౨౪ ॥ సీ ॥ ఈక్షింపఁ
గా నేర్చె నిట్టింకఁ జూపుల మోవిఁ గూర్పఁగ నేర్చె ములకనవ్వు । పొలయింపఁ గా నే
ర్చె భ్రూలతానటనంబు విన నేర్చె నర్మోక్తి వీనులాని । యెమరొత్తఁ గా నేర్చె నిఱి
యు గౌఁగిటియందు మొగమెత్తఁ గా నేర్చె మోవిఁ గముపఁ । గరమెత్తి యీ నేర్చెఁ
గర్పూరవీటిక నలరింపఁ గా నేర్చె నంఘ్రులెత్తి । నేర్చె గరువింప మెచ్చింప నేర్చె
నేర్చె । మొగము గనుపట్టి యలుక మై మొక్కఁ గొనఁగఁ । జెలువపతి చేతి రతిక
ళాశిక్షణమునఁ । బంచబంగాళముగ లజ్జఁ బాఱఁదోలి ॥ ౨౨౫ ॥ వ ॥ ఇట్లు క్ర
మక్రమ ప్రవర్ధమానంబులగు ప్రణయంబుల చందంబునం బ్రోడతనంబులు సమ
ప్రవృత్తంబులై ॥ ౨౨౬ ॥ సీ ॥ మొఱఁగి కన్గొను చోట మొఱఁగు పైమతిద
ప్పి పోక యొండొరుల నాపోక చూచి । సిగ్గునఁ బలుకుచో సిగ్గు పైమతి దప్పి యిచ్చ
నొండొరులతో ముచ్చటాడి । నెపమునఁ బొంకుచో నెపము పైమతి దప్పి కొంతు
నొండొరు బిగ్గఁ గౌఁగిలించి । తాలిమి నెఱపుచోఁ దాల్మి పైమతి దప్పి కాయ్వమై
నొండొరుఁ గడవ గరఁగి । గుట్టు చెల్లింప లేకలో గుట్టు వడని । తమమతుల కూర్మిని

వ్వోఁ జతమకగమరఁ । బూవిలుతుచేతిచిత్రంపుబొమ్మలగుచు । జంపతులుసల్పి రంగజస్వైరవిధులు ॥ ౧౨౭ ॥ ఉ ॥ సిగ్గునకుంబికాపికలుచిత్తసమున్నతిపే రివార్తకుం। గగ్గులకాళ్లుశంకలకుఁగన్నెనియొగ్గులఁబుట్టునల్కకు।న్నగ్గిసముగ్గిసల్ నిలుపుసైరణకున్ఘననీనియొత్తికో । ళ్లగ్గజయానకుం బతికి నయ్యె యథేష్టరహఃప్ర సంగముల్ ॥ ౧౨౮ ॥ చ ॥ అలిగినవేళనయ్యెడినిజాంగజతాపముపేరియెం డలుగా । గలసినవేళనయ్యెడిమొగంబులనవ్వులసేరివెన్నెలల్ । దలఁచుటకా నియవ్విభుఁడుఁదన్వియుసంతతకేలిలోలతన్। దలఁపనెఱుంగరెన్నఁడుదినంబుల యెండలురేలవెన్నెలల్ ॥ ౧౨౯ ॥ సీ ॥ మాధవీమధుపానమత్తాలినీగా నవిభవాకులోద్యానవీధికలను । జంద్రికానిర్ధూతజలదపథోపేతశశికాంతకల ధౌతసౌధములను । గాదంబినీజాలకలకలవాచాలశైవలినీలోలసైకతములఁ । గలితలీలాయత్నకల్పితగిరినూత్నకాంతినానారత్నకంధరముల । మఱియువ్వివి ధవిహారైకమందిరముల । నిచ్చనిచ్చలుగ్రొత్తలైయెచ్చరించు । ఖేలనంబులఁ దెప్పలుదేలుచుండె । నెలఁతయునుదానుమాంధాతృనృపవరుండు ॥ ౧౩౦ ॥

ఉ ॥ ఆర్తిక్షీణగజేంద్రరక్షణకళావ్యాఘూతవిఖ్యాతిమ । త్కర్తృత్వా ప్రతిమల్లపల్లవసతీకౌమారహారక్రియా । ధూర్తాగ్రేసరసహ్యసంభవలసద్ద్వీప ధ్వాంతరంగస్థలీ । మూర్తోస్మద్విధభాగధేయశరదంభోజాతపత్రేక్షణా ॥ ౧౩౩ ॥

క ॥ డోలాలీలాందోళన । ఖేలాస్వగతాగతాభివీక్షణజనితో । ద్వే లప్రమదాంబుధికల్లోలప్లవదస్మదాదిలోకస్వాంతా ॥ ౧౩౪ ॥

భుజంగప్రయాతము ॥ అభద్రాంధకారోదయద్భానుభావా । శుభై కాశ్రయీభూతశుద్ధస్వభావా । యభక్తావళీదృష్టదుర్హఃకాలతారా । స్వభక్తా గ్రభూపారిజాతావతారా ॥ ౧౩౫ ॥ ... ... ... *

గద్య॥ ఇదిశ్రీమద్భట్టపరాశరదేశికేంద్రచరణసరోజసేవకోపసేవకనరసింహ నామధేయప్రణీతంబైన కవికర్ణరసాయనంబనుకావ్యంబున, నాయికా నిరూపణంబును, యౌవనవర్ణనంబును, విప్రలంభంబునందుదశదశా నిరూపణంబును, వివాహంబు, నవోఢాసంగమంబునన్నది తృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు.

# కవికర్ణరసాయనము.

## చతుర్థాశ్వాసము.

క ॥ శ్రీరంగనిలయవలయా । కారాభయముద్రితైకకరకిసలయలీ । లా
రసనిరంకుశస్వే । చ్ఛారచితజగత్ప్రసూతిసంస్థితివిలయా ॥ ౧ ॥ ఉ ॥ భాసు
రలీలనయ్యెనిలపైమధుమాసముగర్వితేక్షుబా । ణాసకృతాట్టహాసముభయా
కులపాంథవిముక్తదీర్ఘని । శ్వాసముకోపనాధృతినివాసముకోకిలకీరషట్పదో ।
ల్లాసముదత్తభూరుహవిలాసముసర్వమనోవికాసమై ॥ ౨ ॥ ఉ ॥ ప్రాయ
ముభూరుహంబులకపాయముమంచునకాపతత్పవి । ప్రాయముపాంథకోటికి
నుపాయముచిల్కలకున్ సమాపనా । ధ్యాయము కోపనాధృతికిదాయముచల్లని
గాలికెన్నఁగా । నాయముపుష్పబాణునకు నామనినేమనిప్రస్తుతింపఁగన్ ॥ ౩ ॥
చ ॥ తెగినమనోభవుందిరుగఁదెచ్చికుజంబులకెల్లఁబ్రాయము । ల్మగుడఁగనిచ్చి
యన్యభృతమండలిమూఁగతనంబువుచ్చిము । జ్జగములవార్తకెక్కినవసంతభిష
గ్వరుఁడాప్తుఁడయ్యెనుం । దగుగతిమాన్పలేఁడమఱిదక్షిణవాయువునందుఁజా
డ్యమున్ ॥ ౪ ॥ క ॥ తొలఁగిచిరకాలమునకుం । గలసినమాధవునిమీఁదఁగనలి
వనశ్రీ । తలిరుల నెఱ్ఱంబాఱుచుఁ । గలకంఠప్రథమవాక్యగతులంగొణఁగెన్ ॥ ౫ ॥
ఉ ॥ ఆసమయంబునన్మధుసమాగతలక్ష్మివనప్రవేశముం । జేసినవేళఁజూడఁబో
లిచెంబికషట్పదభూతతృప్తిగాఁ । బోసినమాంసపుంజములపోలికఁబల్లవితామ్ర
సంచయం । బాసవపాత్రలయ్యెవకుళాగ్రదళన్ముకుళప్రతానముల్ ॥ ౬ ॥ ఉ ॥
పొన్నలునవ్వెఁగ్రొన్ననలపుష్పరసంబునఁగేసరంబులు । త్పన్నజుగుప్సమైనుమి
సెఁబాటలముల్లుసుమోదయంబుచేఁ । గన్నెఱచేసెఁదిట్టెఁగలకంఠరుతంబులఁ
జూతముల్వ్యథా । మున్నగనన్నిటంగడచిమోదుగుపువ్వులవిఱ్ఱవీఁగినన్ ॥ ౭ ॥
చ ॥ చిగురులచేతఁగోయిలలఁజిత్రఫలంబులచేతఁజిల్కలం । దగుపువుఁదేనెచేన
లులఁదావులచేమలయానిలంబులన్ । మొగడలచేఁ బ్రసూనశరుమోదితుఁ
జేసియభీష్టదంబులై । పొగడతకెక్కెఁగల్పకముఁబోలె రసాలకుజంబులామ
నిన్ ॥ ౮ ॥ సీ ॥ వివిధవనీరమావిమలసాంద్రకటాక్షవీక్షాపరంపరావిలసనము
లు । మలయమారుతచరన్మత్తేభచరణావలంబితాయతశృంఖలాలతికలు । పథి
కజనావలీప్రతిసమాకర్షణప్రద్యుమ్నముక్తదోఃప్రగ్రహములు । మధుజగన్మోహ
నమంత్రవాదికరాబ్జవలమాననలినాక్షవలయితములు । ప్రథమకౌమారనవపరి
పాకకలన । వికసదభిమతతరులతాగ్రకరమంజు । మంజరీమధుమధురిమో
న్మాదమెసఁగ । మెలఁగెబహువిధగతులఁదుమ్మెదలగములు ॥ ౯ ॥ చ ॥ పసివ

డిహారదంతురితపాంథ్యవధూకుచశైలసంధులన్ । ఘనముగడస్సిచోళనవకంజ
ముఖీరతిఘర్మవారినా । నినెఱిసిగుంతలీసురభినిశ్వసనంబులనూఁతగొంచు నె ।
య్యనఁజనుదెంచెఁదంతములయాచలశీతలవాతపోతముల్ ॥ ౧౦ ॥ క ॥ ముమ్మ
రపుందేనెలజడి । చెమ్మలవనవీధులెల్లఁ జెన్నగుటఁ జూమీ । కమ్మవిరితావి మోవ
రి । తెమ్మెరలాయెయ్యెయ్యెడ వెఱచితిరుగుటలెల్లన్ ॥ ౧౧ ॥ చ ॥ చలువలపుట్టి
నిండ్లునవసౌరభలక్ష్ములకంతరంగముల్ । మెలఁపులకున్నివాసములు మెచ్చులచే
రుగడల్ విరక్తతా । కలనలకెత్తుకోళ్లుతమకంబులకుంగయిదండలామనిన్ । మ
లయుచువచ్చెఁ గంధగిరిమంధరబంధురగంధవాహముల్ ॥ ౧౨ ॥ సీ ॥ రేలవె
న్నెలలుపండ్రెండుసూర్యులుచూపుబీఱెండలై కాసినీరసింప । దక్షిణానిలములు
ద్ధతినేడుదెఱఁగులఁబెరిగెడుగాడ్పులై పెల్లగింపఁ । గెంజాయదిక్కులఁబింజించు
చిగురులుకాలానలార్చులై కాఁకఁజెనుప । నళిశుకపికగర్జలడరఁ బూఁదేఁటియ ఘో
రాంత్యవృష్టిమైయెసరిసికలఁప । విరహవేదనలెసఁగియుద్వేలగతుల । నద్భుత
ముగనేకార్ణవముగుచుముంప । నఖిలసుఖకారియగువసంతాగమంబు । పథికలో
కంబునకుమహాప్రళయమయ్యె ॥ ౧౩ ॥ ఉ ॥ పూచినపువ్వులెల్లనుతిఁబొందెమ
నోభవునంపకోలలై । వీచినగాడ్పులెల్లఁబొదలెన్మలయాచలమారుతంబులై ।
మోచినపల్కులెల్లఁదగిమోర్ బికభృంగశుకస్వరంబులై । చూచినరూపమెల్లమద
చుంబితమైవిలసిల్లెనామనిన్ ॥ ౧౪ ॥ చ ॥ ప్రసవశరప్రతాపశిఖిఁబర్వఁగఁ జే
యుటచేనిదాఘమై । కుసుమరసాతివర్షమునఁ గూడుదురౌటఁబయోదకాలమై । ర
సికమనోంబుజంబులలరంగశరత్తయితానశైశిరో । ల్లసనముఁ జూపిపాంథ
సతులన్ వణఁకించెవసంతమత్తఱిన్ ॥ ౧౫ ॥ వ ॥ ఇట్టివసంతసమయంబునమ
హీరమణశేఖరుం డొక్కనాడు విహారకుతూహలంబునం బ్రేయసీసమేతుండై
గణికాగణంబులువిటవిదూషకాది క్రీడాపరికరజనంబులునర్మవాహనారూఢులై
కొల్వంగా విరచితోచితవివిధవిచిత్రక్రీడాలతాగృహాలంకృతాంతరంబునుం గేళీశై
లశైవలినీప్రముఖ నానావిహారప్రదేశోపశోభితంబును వసంతవిలసితస్వవిలా
సాపహసితనందనంబును నగునగరోపవనంబు సొత్తెంచెనప్పుడు ॥ ౧౬ ॥ ఉ ॥
ఇంచుకతింబరాగమెగయించియు వెంటనవచ్చుతేంట్లమ్రోఁ । గించియుఁగమ్మతా
వులొలయించియుఁబైమకరందబిందువుల్ । నించియు మెచ్చితన్ బొగడు నేర్పు
లొసంగుచు నెల్లవారికిన్ । బంచవిధేంద్రియంబులకుఁ బండువు చేసె వనీసమీర
ముల్ ॥ ౧౭ ॥ వ ॥ ఇట్లభిమతప్రమదవనసమీరంబులెదురుకొనం గ్రీడావనమ
ధ్యంబుదఱిసివివిధమధురతరులతావిశేషంబులంగలుగు నభినవకుసుమకిసలయఫ
లపరాగమకరందమిళిందశుకపికమిథున సంపదలనుతర్కించుచుంగలయ మెలం
గిపుష్పాపచయముఖేచ్ఛావిహారంబులకునందఱు నద్దినంబెల్లనచటనిలువనియమిం

చి పాలికాదిసఖీజనంబులు గొలువ విమలాంగియుండానుసువసంతునింటికివిం చువచ్చురతీసహాయుండైనమన్మథుండునుంబోలె నొక్క యభ్యంతర వనాంత రంబుచొచ్చియందు ॥ ౧౮ ॥ సీ ॥ నవలీలమలయగంధవహుండువివిధపుష్పా మోదములనుపాయనమొసంగఁ। గలకుహూరుతములఁగలకంఠములుసవినయ భంగివిజ్ఞాపనంబుచూపఁ । బరిపక్వఫలరసప్రణతిమైఁదరువులుకిసలయాంజలి పుటీక్రియఘటింపఁ । గలితప్రసూనసంగతివల్లికలుతల్పరచనామహోపచార మునొనర్ప । లలనతోరాజువనవీధికలసుఖించె । మంజరీపుంజనిష్యందమానమ ధుర । మధురసాస్వాదసమ్మోదమధుపగీతి । మాధురీధుర్యమాధవీమండపము ల ॥ ౧౯ ॥ వ ॥ అంతనిటఁదరుణీతరుణజనంబులుపుష్పాపచయవినోదంబు లందగిలివిహరించునప్పుడు ॥ ౨౦ ॥ సీ ॥ అలరులకెత్తుచోనఱచేతికెంజాయలా దవిగోయిలలనోరూరఁజేయ । నునుమేనులలసిమ్రానులమీఁదనొరగుటల్ తీవ లుప్రాఁకినతెఱఁగుదెలుపఁ । జెలికత్తియలలీలఁబిలుచునున్పలుకులుమదకీరముల ముద్దుమాటలార్ప । బుగబుగవలచునూర్పులతావులెసఁగిక్రొన్ననలకువింతవా సనలొసంగ । నిక్కికొనగొమ్మలందుచోనీవిజాఱి। బయలువడియొప్పునాభికూప ములసొబగు । లంగలతలకునరవిరులై చెలంగ । సతులుపుష్పాపచయకేళిసలిపి రర్థి ॥ ౨౧ ॥ చ ॥ చనుఁగవకంటెగుచ్ఛములుచక్కనయేయధరంబుకంటె నే । ననుచుచిగుళ్లునీమువచనంబులకంటెనెచిలుకపలుకులున్ । వనమున నాకు వింతలఁటెవస్తువులంచునివృత్తుఁడయ్యెఁదో । డనయొకఁడలఁమైఁదనపడంతుక క్రమ్మఱియింటికేగగన్ ॥ ౨౨ ॥ చ ॥ పొడవుననున్నపల్లవునిఁబూవులువేఁడుచు నొక్కనెయ్యపుం । బడఁతుకహస్తమెత్తుటయుఁబయ్యెదజాఱికుచోదయాద్రి పైఁ । బొడిచివినూత్నరాగరుచిఁబొల్పువహించునఖాంకచంద్రుచే । ముణిఁగె నొకంతలోసవతిముద్దియపిండుముఖారవిందముల్ ॥ ౨౩ ॥ చ ॥ అందినవారు పుచ్చుకొనుఁడాయనిచేవిరిబంతియెత్తినన్ । జందనగంధులిద్దఱొకజాణనివీఁపు నురంబుఁజన్నులా । సందునఁజిక్కనొక్కుచునుసారెకునిక్కఁగశంబరారిచేఁ। జెందలిరాకువాలునొఱచేఁబెడపోటునుబోసిన్రేటునన్ ॥ ౨౪ ॥ చ ॥ ఇరువు రయందుమున్నొకతెకిచ్చినయొక్కతెయల్లునంచుమీ । యిరువురలావుగానన గునీవిరిఁగైకొనుఁడంచుఁబల్లవుం । డిరువురముందఱన్బడఁగనేసినఁదక్కపటం బెఱింగిమ । మ్మిరువురసాటిసేయఁదగునేయనియొక్కటనల్గిరిద్దురున్ ॥ ౨౫ ॥ చ ॥ తనప్రియుమీఁదనొక్కలతతారొక్కనిగుచ్ఛయుగంబుమోఁపినన్ । గినిసిస పత్నిగాదనిసఖీజనసాక్షినెఱింగినట్టియం। గననికటంబునన్సవతికాంతునిపైఁబ డిపెన్నురంబునన్ । చనుఁగవమోఁపినన్గినియఁజాలదవేఱొకతీవయన్నామ తిన్ ॥ ౨౬ ॥ చ ॥ పిలిచితినన్నువేఱొకతెపేరుననేనివిరొుల్లనంచుము । న్నలి

గనోకర్త్తుపల్లవునకవ్వాలనొల్లకరోసినట్టియీ । యలరులనిచ్చె దేయనుచునగ్గెసప
త్నియునట్లకాదెధూ । ర్తులుతుదనెల్లవారలకుదూరులపోతలపోసిచూచిరన్ ॥
చ॥ తనుఁబెరపేరఁబిల్చియిడఁదతుఁకుసుమంబులపూఁచి మోమునన్ । గినుపునవ్రే
సెనొకర్తసతికేసరరేణువురాలెనంచుఁజేఁ । గనుఁగవమూసికొన్నవెలఁగౌఁగి
టఁజేర్చుచుఁగేలువుచ్చుచూ । చిననగుధూర్తవల్లవునిచేఁతకుగాసిలియల్గెఁగ్రమ్మ
ఱన్ ॥ ౨౮ ॥ ఉ ॥ నేరవునీవుకొప్పిడఁగనేఘటియించెదఁబువ్వులంచునం ।
భోరుహలోచనన్దిగిచిముందరనుండఁగఁబంచియొకర్తగుం । డీరసమొంద
తోడిసతికిచ్చవ్వలమోముమలంచిచుంబనా। చారముచేసినఃప్రియముసల్పెసఖుల్
తననేర్పుమెచ్చఁగన్ ॥ ౨౯ ॥ చ ॥ సవతిమొగంబుచూచుచునొసంగినపల్లవు
మీఁదికిన్పునన్ । దవిలినదెవ్వగందనువుత్తమగాఁదలపంచియున్నయ । య్యు
వతికరంబులోనివిరులూష్మతఁగందుట చెప్పనేటికిన్ । గవిగొనుదానియూర్పుల
సెకన్గసుగందెవనంబుపువ్వులున్ ॥ ౩౦ ॥ చ ॥ చిగురులఁగర్ణపూరములు సే
యుతలంపునఁగోయునంతలోఁ । దగవతియవ్వలన్విటుఁడుఁతానుసపత్నియుఁ
గూడుకొన్ననె । వ్వగనొకపువ్వుఁబోఁడివలవంతలవేఁగుచుఁజేతనున్నయా ।
యిగురులెసెజ్జచేసికొనియొందనుతాపభరోపశాంతికిన్ ॥ ౩౧ ॥ చ ॥తలిరులనె
ల్లఁగోసికరతామరసద్యుతివెల్లిగొల్పఁగా । నలరులనెల్లఁగోసినఖరాంచలదీప్త
లుపైనిగుడ్పఁగాఁ । జిలుకలనెల్లఁద్రోలితమచిన్నియెలుంగులభంగిఁజూపఁగాఁ ।
జెలువముక్రొత్తయైసతులచేవనవాటికయొప్పెనయ్యెడన్ ॥ ౩౨ ॥ తే ॥ తమ
యలంకారములకునైతరుణులెల్లఁ । గ్రొవ్విరులుఁగ్రొంజిగుళ్లనుగోసిరైన । దా
నవనవాటికకుఁబొల్పుతఱుఁగదయ్యెఁ । దారయయ్యెంతులాకయలంకారమగు
ట ॥ ౩౩ ॥చ ॥ అనుఁగువిటుల్ ప్రసూనములనాభరణంబులుగూర్పనేర్పమై। న
నువులెఱింగిమేనికళలారసిమర్మములంటువేళలన్ । దనువులఁబుట్టుచిత్తజులద
ట్టములైదిగజాఱెఁగాంతలం । దనయమురేఖలై వనవిహారపరిశ్రమఘర్మతోయ
ముల్ ॥ ౩౪ ॥ చ ॥ పొలఁతులకున్వనీవిహృతిఁబుట్టినసేదలుదొలఁకరించినన్ ।
వలిచనుఁగొండలంబొడమివచ్చుపరిశ్రమవారివాహినీ । విలసనరేఖకున్వళులు
వీచిపరంపరలయ్యెనిమ్ననా । భులుతిరులయ్యెవాలుకలపుంజములయ్యెనితంబబిం
బముల్ ॥ ౩౫ ॥ సీ ॥ కుచకుంభభారభంగురమధ్యలతికలుపునరుక్తగుణయు
క్తిఁబూనుకొనఁగఁ । గరఁగినతిలకరేఖలతావులకుఁజొక్కినట్లుకురుల్నెసళ్లత్తు
కొనఁగ । వ్రేఁకంబులకుఁదోడువిరులవ్రేఁగులకల్మివీడెడుక్రొమ్ముళ్లు వెన్నులార
య । మఱినిసర్గములైనమందయానంబులుతొట్రుపాటునవింతతోడవుదాల్పఁ ।
దఱచుటూర్పులుతమకమ్ముతావివలన । నలులకలరులుగ్రోలినయరుచిమాన్ప ।
సతులుపుష్పాపచయకేలిఁజాలనలసి । కోరిరాత్మలనంభోవిహారకేళి ॥ ౩౬ ॥

చ॥ బడిబడిఁ బ్రాంతదీర్ఘికలఁ బద్మసుగంధిపయస్తుషారముల్ । జడిగొన నల్లనల్లఁ
బయిఁ జల్లుచు వాడిన పువ్వుబోంట్లకున్ । బడలిక లార్చి చేకొని యొఁ బ్రస్తుతులయ్యె
డమందమారుతం । బెడరున నైన చుట్టమున కెవ్వరు సాటి జగత్త్రియంబునన్ ॥ ౩౭ ॥
ఉ॥ పల్లవధూర్తు నెన్నడుము పార్శ్వ మొగిం గుడిచంట నొత్తిదో । ర్వల్లరి మూఁ
పు నంటెనఁ జివ్రాలి యురంబునఁ జెక్కు జేర్చి సం । ధిల్లెడు చూడ్కితో నన డదేరఁగ నె
చ్చెలిపెండు సన్నిధిం । జెల్లె విదగ్ధతాగరిమ సేద నెపంబునఁ బద్మనేత్రకున్ ॥ ౩౮ ॥
చ॥ తరుణులకింపులై తనరెఁ దత్సమయంబులయందుఁ బార్శ్వచా । మరములఁ గల్గి భ
ర్తృముఖమారుతపాతము లుష్ణవారణో । త్కరములు గల్గియైనఁ బ్రియకాముక
హస్తపటావకుంఠముల్ । పరిజనమున్న నైన నిజపల్లవదత్తకరావలంబముల్ ॥ ౩౯ ॥ క॥
పద్మప్రకాశలక్ష్మీ । సద్మంబులఁ గంకణప్రశస్తముల దళ । త్పద్మాస్యలం తఁ గాంచిరి । ప
ద్మాకరములను బోని పద్మాకరముల్ ॥ ౪౦ ॥ చ॥ కొలఁకులు చేరవచ్చి యనుకూలతటం
బుల నిల్చి ముగ్ధలౌ । నలికుల వేణులయ్యెడ నిజావయవప్రతిబింబశోభ గాఁ । దలఁపుచు
నుల్లముల్ పొదలఁ దప్పక చూడఁ దొణంగి రందులో । జలజములన్ మృణాళములఁ జక్ర
యుగంబుల గండుమీనులన్ ॥ ౪౧ ॥ చ॥ గుటిగడవన్ మరందములు గ్రోలి మదంబునఁ
జొక్కు వల్లభ । న్మెఱఁగి పరాలి నీ రతికి మోదమునం జని తొంటి యట్లకా । నెఱుఁగక
యుండఁ దమ్మివిరి యింటికి వచ్చిన భృంగపల్లవున్ । నెఱతన మెన్ను పల్లవుని నీరజలో
చన దాఁచెఁ గిన్పునన్ ॥ ౪౨ ॥ సీ॥ కదళికల నుకంపె కరభంబుల నుకంపె నిభ
కరంబులఁ బోల్ప నిప్పుడనువు । చక్రంబుల నుకంపె శకటాంఘ్రుల నుకంపె నిసుకతి
ప్పలఁ బోల్ప నిప్పుడొప్పు । గుచ్ఛంబుల నుకంపెఁ గుధరంబుల నుకంపె నిటిజక్కువ
లఁ బోల్ప నిప్పుడొనరు । నద్దంబుల నుకంపె నమృతాంశుఁడ నుకంపె నెలదమ్మి గమిఁ
బోల్ప నిపుడు దగవు । నాఁగఁ బొలిచి రంగనలు నీటియాటల । కెచ్చరించి తటియ
నెడఁ గొలఁకుల । తోయసంగమమునఁ దొడలను బిరుదుల । వలిచనుంగవలను వ
దనములను ॥ ౪౩ ॥ చ॥ అమితవిలాసినీకుచరథాంగకసంగతి గల్గదీర్ఘికా । స
ముదయ మప్పుడాత్మగతచక్రయుగంబులఁ బాయఁద్రోచెఁ బ్రాం । తములకు దత్ప్రి
దేశసవిధాతరళోర్మిభుజాపరంపరన్ । దమకొక మేలు గల్గ దిగఁద్రావ రెయాశ్రితు
లన్ జడాశయుల్ ॥ ౪౪ ॥ చ॥ కువలయపత్రనేత్ర యొకకుంభము చాలుఁ దరిం
పఁ జేయని । క్కువముగనీక యత్నకుచకుంభయుగంబది గల్గనీఁదనే । రవెభయ మే
లరమ్మని కరంబుల నీడ్చిన వ్రాలు భీరువున్ । వివృతభుజాంతరస్థలని వేశితఁ జేసెఁ బ్రి
యుండు నవ్వుచున్ ॥ ౪౫ ॥ క॥ సిలువున నీఁదుచు రమ్మీ । కొలఁదియ యన నే
గిమునుఁ గుకొలఁది నయిరుచే । తులఁ బట్టి యొత్తభయమునఁ । గలకంఠి యొనర్చె వి
టునికంఠగ్రహమ్మున్ ॥ ౪౬ ॥ తే॥ ఇంతదరినుండి చివ్వున నెగసి యులుక । ను
రువుకొని నీరు వలయమై పొరలి విరియ । నడుమ నుదయించెఁ జక్కనినగు మొగంబు ।

మథ్యమానాంబునిధిఁజందమామవోలె ॥ ౪౭ ॥ తే ॥ ఒత్తిగిలియీఁదనీటిపై
నొంటిఁదోఁచు । కొమ్మవదనాంబుజముపొంతకుచముగాంచి । కవదొలంగినచ
క్రవాకంబొకండు । తోడిప్రియసతియనిప్రీతిఁగూడుకొనియె ॥ ౪౮ ॥ చ ॥ అ
లరియొకింతమాలు మొగమైయలచేతులనొగ్గికొన్నన । చ్చలమునఁగాముకుండు
పయిఁజల్లెడునీటిమెలుంగుఁమింపరల్ । చెలువచనుంగవల్ బొలిచెఁజేరితదీయ
నఖాంకచంద్రులల్ । గొలిచివినూతనద్యుతులుగొల్పెడుతారకపఙ్క్తులోయ
నల్॥ ౪౯ ॥ క ॥ అనులేపనములుగరఁగిన । చనుఁగవలనఖాంకురములుసతులకుఁ
దగునా । ననపూర్ణవిధులవలనను । ఘనమైజాఱిపడియొప్పుకళలోయనఁగల్ ॥
ఉ ॥ చల్లెడునీటిపైమలయజంబుగరంగిననింతిచన్నులల్ । బల్లవితోరుకాంతిగ
నుపట్టెడుకెంపులుచూచుశంకమైఁ । బల్లవుఁడొకఁడిప్వలిసపత్ని మొగంబుననీ
రుతోడుతో । గళ్లుపడన్వడిల్ బెడమొగంబగునట్లుగఁజల్లెనార్చుచుల్ ॥ ౫౧ ॥
తే ॥ ధవుఁడుచల్లెడుకరవారిధారలెట్టు । లోర్చెనోకానితరలాక్షియొద్దసవతి।
తటుకుచాఘాతఘట్టనోత్పతితమగుచు । నెకుతుంపరపైఁబడ్డనోర్వదయ్యె॥
క ॥ మునుజలముసవతిపైఁజ । ల్లినఁగినుకంగొలనువెడలులేమవిటుఁడువె । నొకు
నిమొకబిసతంతువునం । దనువుదవులవేసిపట్టుదాననవిలిచెల్ ॥ ౫౩ ॥ ఉ ॥
క్రొవ్వుననప్పయోరుహముఖుల్ జలఖేలనమట్లుసల్పఁగాఁ । ద్రెవ్వినహారరత్నవి
తతద్యుతికాంతులఁగ్రమింగిపూఁతలుం । బువ్వులుఁజూపుచుల్ బయలువూనెసరో
వరసంఘమట్లపో । యెవ్వఁడునల్పలాభమునకేలవహించుఁబరార్థలాభముల్ ॥
చ ॥ అతివలుపల్లవుల్జలవిహారముచాలిచినిర్గమింపఁబ్ర । చ్యుతవివిధాంగరాగకు
సుమోత్కరభూషణభూషితంబులా । యతపరిమర్దనిర్దయహతాకృతికంబులునై
కొలంకులు । గ్రథసురతాంతముక్తమృదుతల్పతలంబులుఁబోలెఁజూడఁగల్ ॥ ౫౫ ॥
క ॥ ఖేలనముచాలివెడలెడు । నాళీకవిశాలలోచనలఁబాయుటకుం । జాలక
తారునవెడలెడు । పోలికమునుమునుతరంగములుదరికెక్కెల్ ॥ ౫౬ ॥ ఉ ॥
త్రస్తకురంగలోచనలుదర్పకముద్రలుచాటుగాఁగృత । స్వస్తికహస్తయుగ్మములఁ
జన్నులుచెక్కులుగప్పిపార్శ్వప । ర్యస్తకచాగ్రభాగములనంబుపరంపరజాఱనం
సవి । న్యస్తనతాస్యలై వెడలిరంబురుహాకరతీరభూమికిల్ ॥ ౫౭ ॥ ఆ ॥ సతుల
మేనిగాఢసంశ్లేషసుఖమున । నార్ద్రితరములైనయంశుకములు । కరఁగిపో
యెఁగాకకాదేనిప్రకటంబు । లగుటయెట్లువారియవయవములు ॥ ౫౮ ॥ తే ॥ వ
ర్ణమాత్రంబుననకాకవారిదముల । వర్షగుణమునగెలువంగవలసిపోలె । సూటి
ధారాళవర్షంబుచూపెనపుడు । కరనిపీడితకామినీకచభరములు ॥ ౫౯ ॥ తే ॥
బహురసార్ద్రితఁదమునంటిపాయలేని । వసనములుడించిసతులునీరసములైన ।
క్రొత్తమణుఁగులువేడ్కఁగైకొనిరియహహ । ప్రియముగైకోరునూతనప్రియులు

సతులు ॥ ౬౦ ॥ చ ॥ స్మరపరితప్తహస్తములు సర్వసమీక్షణభాగధేయముల్ ।
తరుణిమరత్నసానువులు దర్పకదర్పలతావసంతముల్ । వరహృదయానురాగ
రసవార్ధివివర్ధనపూర్ణచంద్రమః । కరములు వేడ్కఁ గైకొనిరి కాంతలలంకరణం
బులయ్యెడన్ ॥ ౬౧ ॥ తే ॥ శ్రీసమగ్రతనట్లు కైచేసియున్న । సుందరీజనములకన్
ర్థిఁ జూడఁ దగిన । యరుణమణిమయ ముకురనిల్పుటద్దమయ్యె । నస్తగిరిపేరిపేటియం
దహిమకరుఁడు ॥ ౬౨ ॥ తే ॥ కాంతిదిగఁబాఱఁ బ్రాచిముఖంబునందుఁ । బద్మి
నీముఖవికసనప్రౌఢి సడలె । భానుఁ డప్పుడు మధ్యస్థభావముడిగి । కాంక్షునపరా
నుషక్తిరాగము వహింప ॥ ౬౩ ॥ తే ॥ పద్మినీభోగలబ్ధసంస్పర్శనమునఁ । గలిత
మైనపరాగరాగమునఁ బోలె । భానుకరములు దివసావసానసమయ । సమధికో
త్ఫుల్లపల్లవచ్ఛవి వహించె ॥ ౬౪ ॥ చ ॥ వెనుకొను దృక్పరంపరల వెల్లువలన్ బరితా
భిసారికా । జనములు త్రోవఁ ద్రోవనలచక్రయుగంబులు గాతరావలో । కనము
లఁ ద్రిప్పఁ ద్రిప్పఁ జనఁ గ్రమ్మఱ నేరక పోలెఁ బశ్చిమా । వనిభృదధిత్యకన్నిలిచె వారిజ
బాంధవబింబ మయ్యెడన్ ॥ ౬౫ ॥ తే ॥ తొంటి తేజంబు దూలినఁ దూలనిమ్ము ।
కాలగతి దాఁటశక్యంబె ఖరకరునకుఁ । జాలదా భాగ్యమిది యెల్లజగము మ్రొక్క ।
నస్తమయవేళ నుదయంబునందపోలె ॥ ౬౬ ॥ చ ॥ చరమధరాధరాగ్రమున
జాఱెడు వేళఁ బతంగుఁడంగజ । త్వరితమనస్కమై నిలిచి తన్నుఁ గనుంగొను సౌధశే
ఖరో । పరితరుణీజనంబు ముఖపద్మములన్ వికసింపఁ జేసె స । త్పురుషులు తారు దు
ర్దశలఁ బోవుచునైన నుఁ బ్రోతు రాశ్రితులన్ ॥ ౬౭ ॥ తే ॥ అహిమభానుండు చనుదేరన
స్తశిఖరి । సరవి నర్చించు కుంకుమాక్షతములయ్యెఁ । బరిణతాతపసంధానభాస
మాన । శిఖరసానుఝురోద్ధూతశీకరములు ॥ ౬౮ ॥ ఉ ॥ క్రొత్తగదీర్చి కానికట
కుంజగృహంబులఁ దల్పకల్పనా । యత్తములైన మత్తకరులాత్మకరాగ్రములెత్తి పల్ల
వో । పాత్తమనస్కతన్ వెరఁ జియాడఁగఁ జొచ్చెఁ బరిభ్రమించు భూ । భృత్త
టువాటికావిటపబృందమిళజ్జరఠాతపంబులన్ ॥ ౬౯ ॥ వ ॥ అప్పుడు ॥ ౭౦ ॥
సీ ॥ మొగడలబిగివీడు తొగలనంకూరించు క్రొత్తనెత్తావి మూర్కొనుచు నలుకు ।
నిష్ప్రభంబై నీటనీడఁ దోఁచిన భానుబింబంబు గని భీతిబీఱువోవు । బాష్పంబు చూ
డ్కి గప్పఁగఁ గూడియుండియు వికలకంఠముగ నొండొకటిఁ బిలచుఁ । గసిగాటుగ నచి
నబిసనాళములఁ జంద్రకరశంక సంధిల్లి మరలఁ గ్రాయు । నీడలను బుద్ధి నొండొంటిఁ
జూడకవలి । నీడలొండొంటిఁ గాఁ జూచి కూడనరుగు । భావివిరహవ్యథాభయ
భ్రాంతివలన । శోకపరవశమై చక్రవాకయుగము ॥ ౭౧ ॥ ఉ ॥ కుత్తుకలెత్తి బి
ట్టులికి క్రుంకు రవింగని దీనవృత్తితో । నొత్తిన భావిదుర్భరవియోగభరంబున నొండొ
కంటిమో । మత్తమిలంగనుంగొను రథాంగయుగంబుల దృష్టి గప్పఁ బో । మిత్తుగఁ గ
న్నునీరొదవి మించిన చీఁకటికంటె మున్నగన్ ॥ ౭౨ ॥ ఉ ॥ అంతరభక్తిమజ్జనక

రాబ్జములబ్జములున్ముణుంగఁగాఁ । గాంతులరాకనంగనలకన్నుఁదొగల్ తొగ
లుఁదలిర్పఁగా । దొంతరగావియోగినులదుఃఖితమంబుదమంబుఁబర్వఁగా।నం
తటభానుబింబముపరాంబునిధానములో మునింగినన్ ॥ ౭౩ ॥ క ॥ బలుపసుచీఁక
టిరాకకుఁ । దలఁకెడుమతినాకసంబుతనమణిజలసం । స్థలమునని క్షేపించిన ।
పాలుపునఁబశ్చిమసముద్రమునరవిగ్రుంకెన్ ॥ ౭౪ ॥ చ ॥ అనలము తేజముల్
బ్రకుపితాంబుజనేత్రలరాగముల్ రథాం । గనివహముల్ ద్రితాపమునుగాల్కొన
నిల్వఁగలేమిఁబుంశ్చలీ । జనముప్రవర్ధమానకరసఖ్యవియోగులచిత్తవృత్తిగా ।ది
నకరుఁడస్తమించినఁదదీయగుణంబులు చేరెనిన్నిటన్ ॥ ౭౫ ॥ సీ ॥ ఇనకరాకు
లజగజ్జనతాలవృంతంబునిద్రాణపద్మినీనిశ్శ్వసితము । కైరవిణీబోధనారంభజృం
భంబుతిమిరమత్తేభపూత్కృతినిపాత । మాగచ్ఛదతనుధ్వజాంచలచ్ఛలనంబువి
రహిణీప్రాణాభివిగళనంబు । సాంధ్యరాగసుపర్ణచలగరుత్కలనంబుచక్రవియో
గాగ్నిచర్మభస్త్రి । రతిసముత్సుకసువదనారభ్యమాణ । ముఖ్యనేపథ్యవాస్త
వామోదముదిత । మధుపమధురారవోద్గీయమానమగుచు । మెలఁగెనయ్యెడ
సాయంసమీరణంబు ॥ ౭౬ ॥ సీ ॥ కలపంబులాడఁగూర్చుకన్యకాజనములర
మణీయమణికంకణములరవలి । ప్రియులఁదోతెమ్మన్నఁబిలిచితేనగుసుచేడియల
నున్నులుకుమట్టియలయులివు । నడయాసజోకొట్టునవకంపుటల్లుండ్రతటిమిపోనా
డునత్తలయదల్పు । కైసేఁతలనొసంగుకమ్మఁదావులసోలు నెలదేఁటినిసుఁగుల
యించుమ్రోఁత । కలుపుబావలరాకయకల్కలకునెలుఁగఁ ।బలుకుచిలుకలకలికి
పలుకులనుగలసి । మరుఁడువిడిసినదండుసంభ్రమముఁబోలెఁ।గలకలితమయ్యెగ
ణికానికాయవాటి ॥ ౭౭ ॥ ఆ ॥ ధర్మపథమొకింతదలఁపకపద్మలో । చనము
లాగిమొగిడ్చిసంజప్రొద్దు। నిమరవోయెఁబద్మినీజాతిదానఁబో । సిరిదొలంగిమిగు
లఁజెట్టవట్టె ॥ ౭౮ ॥ క ॥ కలువలకువచ్చునిందిర । తలుపులుముద్రించియున్న
తామరసగృహం । బులుపొడగుటన్ మూల్గుచు । నలిభూతములందులోననధి
వసియించెన్ ॥ ౭౯ ॥ క ॥ మెలఁకువలుచాలితమతమ । నిలయంబులకేగసి
వచ్చునెమళులపింఛో । జ్జ్వలరుచులుసాంధ్యరాగా । కులతిమిరోదయముము
న్నుకొలిపెన్ దెసలన్ ॥ ౮౦ ॥ క ॥ ఇనుఁడేఁగుచుఁజీఁకటివెను । కొనుశంకం
గాపువెట్టికొనిపోయినయ । త్యనురక్తికిరణబలమో । యనసంధ్యారాగమొద
వెనపుడపరదిశన్ ॥ ౮౧ ॥ క ॥ సురుచిరకుసుంభవర్ణాం । బరకలితపయోధ
రాతిభరభంగురమై।వరుణదిశయపుడునూత్న । స్మరానురాగంబుగొలిపెజను
లకునెల్లన్ ॥ ౮౨ ॥ తే ॥ శర్వరీచంద్రపరిణయసముచితాంశు ।రార్పణక్రియఁ
గలయవియద్విభాగ । పాలికలఁదోఁచుక్రొత్తజాజాలమొలక । లనఁగఁదారక
లొండొండయంకురించె ॥ ౮౩ ॥ చ ॥ కనుఁగొననింగిఁదారలనికల్వలతేఁడని

చంద్రికామృతం । బనియొకసృష్టిచూపుటకునైసమయంబనునైంద్రజాలికుం । డనుపమితానుభావముననందఱచూడుఁడాలుగప్పుపాం జెపీ । చినయలనెమ్మికుంచి యను చిందఁవి చెనవాంధకారముల్ ॥ ౮౪ ॥ ఉ ॥ తారకశంఖహారయును దారతమోసితకంచుకావృతి । స్ఫారయునైనయారజనిభైరవిభైరవఖేలనంబు పెం । పారఁగవారుణీకలితమైరుచిమించినసాంధ్యరాగసం । భారముపేరిభూరినవ మాంసతతిం గబళించెనంతటన్ ॥ ౮౫ ॥ చ ॥ వలపులయికడాలంజియలనమ్మిన రో వెలపంటజకడావల్ । తలఁపనికీడుకానియవదాయముక్రొవ్విరితమ్మిలచ్చికిన్ । వెలిచపిగోరుమండగపువేడుకకత్తెలనోము నోఁతగూ । బలమణిహంబుజారులకుఁబంధువచీఁకటిపర్వెసుర్వరన్ ॥ ౮౬ ॥ శా ॥ కస్తూరీతిలకంబులైహరిశిలాకల్పంబులైకజ్జల । ప్రస్తారక్రియలైనవాగురుమషీపంకానులేపంబులై । శస్త్రానీలపటావకుంఠనములైజన్మించెదిజ్ఞామనా । రీస్తోమంబులయందునూతనతమోరేఖాంకురశ్రేణికల్ ॥ ౮౭ ॥ ఉ ॥ లోకమునన్ గులాచలములున్నతరూపకులంబుఁజూడఁగా । నేకవిధంబుకాఁగనుదయించినచీఁకటిచేతనయ్యెడన్ । బైకొనివచ్చుదుర్విటులభావమువేఱుగనీకసామ్యమున్ । గైకొనకున్నెవృత్తుగణికావళిదంతురగండపాలికల్ ॥ ౮౮ ॥ చ ॥ ఎరియకదంతురస్థలులనేశయునింపఁదమాలపల్లవా । స్తరణములైయనావృతినశంకవసింపఁగనీలిచేలపెం । దెరలయియొండొరుంబిలిచితేరఁగనర్మసఖీజనంబునై । యరుమగజారదంపతులకత్యుపకారముచేసెఁజీఁకటుల్ ॥ ౮౯ ॥ సీ ॥ కలయిండ్లకరిగెడుకన్నంపుదొంగలనీలికాసెలదీప్తినిండెఁగాక । గద్దించిచనుదుండగపువేడుకకత్తెలమైలచీరలచాయమలసెఁగాక । ముకుళితవికసితాంబురుహోత్పలములకునెడయాడునలికాంతులెసఁగెఁగాక । విటులకైమెండాడువీథులజంతలపెనుఁగాటుకలకప్పుబెరసెఁగాక । వాడఁబాతెడువిరహిణీవదనసమితి । కందుపొందుననగునల్పుగలసెఁగాక । కానినాఁడింతదట్టమీఁగలదెమొదల । ననఁగఁజీఁకటియంతంతకగ్గలించె ॥ ౯౦ ॥ సీ ॥ కరఁచిచిప్పలఁబట్టుకతలెఱుంగముగాక వ్రాయంగనిదిమషీరసముగాదె । యిదిగుణంబులుసేయునిరవెఱుంగముగాక నీలాలసరులుగానింపరాదె । కరవటంబులఁబెట్టువెలవెఱుంగముగాక వనితలకిదినవాంజనముగాదె । కడవలఁగొనిముంచుగతియెఱుంగముగాక చేలలకిదిమంచినీలిగాదె । పోవఁడేనిదిరవినైనఁబొమవుఁగాదె । యంకమనుపేరసురముపైనచ్చుదాల్చుఁ । గాకశశినైనదిగ్రమింగుగాదెయనఁగఁ । బ్రబలమైగాఢతమతమఃపటలిపర్వె ॥ ౯౧ ॥ తే ॥ అరుదావెన్నాడిరాజశుద్ధాంతగణముఁ । దారకలబందెఁగొనియెందుమాఱులేక । యంధకారంబుజృంభితంబైనదీప । కలికలతిభీతిశరణాభిగతములయ్యె ॥ ౯౨ ॥ వ ॥ ఇట్టిగాఢాంధకారంబుదయించుటకుమునుమున్న ॥ ౯౩ ॥ సీ ॥ మడ

ములు మోవంగ మైలచీరలు గట్టి కర్ణముల్ మోవంగఁ గాటుక లిడి । మోఁ
చేతిపట్టులు మోవ గాజులుదొడిగలకముల్ మోవఁ గొప్పులుఘటించి । వెడలిగడ్డ
వ మోవవీడియంబులు చేసి కాంక్షఁ జెంపలు మోవ గందమలఁది । చెక్కిళ్లు మో
వంగఁ జెవుల నాకులు వెట్టి బొమలు మోవఁగఁ జుక్క బొట్టుదీర్చి । భావభవు చేతివిడి
వాటుబడియప్రడ్లు । సంజప్రొద్దునబలుపిశాచములుఁబోలె । మెదలభయముగ
జనుఁబట్టివదలరైరి । వీధులరికట్టిపురిగట్టి వేశ్యలపుడు ॥ ౯౪ ॥ సీ ॥ చిటికలుప్రవే
యుచుఁ జిలుపాట పాడుచుఁ జార్చిపయ్యెదఁగూడఁ జేర్చుకొనుచుఁ । గన్నరూప
ము నెల్లఁగరసంజ్ఞఁబిలుచుచు నెట కేసిఁజను వాని కెదురు సనుచుఁ। గడచిపోవచ్చినఁ
కౌఁగిటఁబట్టినీవాయంచువదలి మోహంబు రేఁచి । చూపిన వెలకునం తేపొయనుచు
జంకె వేయుచు రోయుచు వెంటఁబడుచు । రూకలడుగుచుఁ మదిఁబచ్చ నాకునైన ।
నెడఁబడుచుహస్తగతమైననొడియనడిచి । దొడ్డబండాటమునఁ గొకప్రొసికొను
చు । గుడిసెజంతలు తెరువాటుగొట్టిరపుడు ॥ ౯౫ ॥ చ ॥ ముడిఁగిముసుంగు
తో వెనుకముందునుజూడక వచ్చిలోనికిం । దొడుకొనిపోయిప్రవేల్మిడినద్రొబ్బినఁ
బెంపునకుంబసిండికిం । జెడితముఁదారతిట్టుకొనిచీయని కేలుపిదిర్చిరోయుచున్ ।
గుడిసెలుదూఱివెల్వడిరిక్రొత్తగుసిగ్గరిమిండలయ్యెడన్ ॥ ౯౬ ॥ ఉ ॥ కాంచిన
వారుగారుబిగికౌఁగిలి మెల్లనిచొక్కుపల్కులా । లించినవారుగారు వెలలేమల
కున్ రతి నెక్కువృత్తిదోఁ । పించినవారుగారుతమిపెక్కువతో వెలలిచ్చితీర్చిర ।
ప్పంచశరుండుఫ్రూఁటయిగుపత్రములేనిఋణంబుహాలికుల్ ॥ ౯౭ ॥ ఉ ॥ ఒత్తి
లిరిత్తపైకొనుచునొంటనరెంటనని ద్రపుచ్చుచున్ । మెత్తనలేచిదీపముశమింపఁగఁ
జేసిశయింపఁబ్రక్కలన్ । దొత్తులఁబెట్టివచ్చితమతొల్లిటిమిండలఁగూడికొంచు
నొం । ర్మొత్తురిక్రొత్తరోయిడిన నొప్పెలగద్దరిలంజలయ్యెడన్ ॥ ౯౮ ॥ సీ ॥ ప
థికులఁగని తానుఁబథికుఁడై యొకకొంతనడచిముందరి వారిఁ గడపిమరలు । వరము
లుదయసేయవలరాచదేవరవలగొనుగతిఁజుట్టివచ్చునిల్లు । లోలతఁ జెవియొగ్గి
లోనిచప్పుళ్లకుడిల్లమైవడినిగిడించునార్పు । కడయింటనత్తమేలక్కనిబిట్టుదగ్గినసిరు
గాలనిలువక యేగుబెగడి । యడిగినంతయురోయిచ్చినట్టిక్రొత్త । కోడెఁ జేకొనితన
ను వెళ్లఁగొట్టుటయును । భ్రాంతితనవల్పులంజియఁబాయలేక । వ్రీడయించుక
లేని చేబోడిబొజుఁగు ॥ ౯౯ ॥ వ ॥ మఱియును ॥ ౧౦౦ ॥ మ ॥ కుటిలాకార
తవామదక్షిణకరాంగుళ్యగ్రజిహ్వాసక్ర । ద్ఘుటితస్ఫోటనముష్టిఘట్టనదటద్ఘట్టా
దినానావిధో । ద్భటఘోషంబులతోనదూరపదవీపాంథావళీశృంఖలల్ । ఘుట
చేటీగతిసంభ్రమంబులెసఁగెన్ గ్రంథైపురీవీధులన్ ॥ ౧౦౧ ॥ వ ॥ తదనంతరం
బాగాఢాంధకారంబున ॥ ౧౦౨ ॥ ఉ ॥ కోటలుబొమ్మరిండ్లుమఱికొండలుతాఁ
పలుదివ్యదృష్టికిన్ । గాటుకలంధకారములు గాఁజనికందువపట్లఁబాంసులా । పా

టలగంధులొందిరుపభర్తలతోమణితాదృశైనజం । జాటము లేనికూటములసా
హసకల్పలతాఫలంబులన్ ॥ ౧౦౩ ॥ చ ॥ కులసతిశిష్టమార్గమునకున్మదినిల్పిన
దాఁటరామికిన్ । గులముమహాంబురాశిపతికొండగృహాంగణమంధకూపమా ।
కులసతిదుష్టమార్గమునకున్మదినిల్పినయేని దాఁటగాఁ । గుల మొకగోష్పదంబుపతి
గుండుగృహాంగణమాటపట్టగున్ ॥ ౧౦౪ ॥ చ॥ కనఁబడువారలెల్లఁదనుఁగన్నడి
రేసవివిన్నపలుక్కలె । ల్లనుదనుఁగూర్చియేసవితలంకునగొంకుచునైనసాహసం ।
బునఁదగవచ్చియట్టె వెఱవోవఁగఁగౌఁగిటఁజేర్చుబిగ్గరన్ । వనితముహూర్తమా
త్రముపవల్లభునిం దొలుక్రొత్తఱంకునన్ ॥ ౧౦౫ ॥ చ ॥ వడఁకకుమింకనిచ్చ
టికివచ్చితివేవురుగానకుండవి । డ్వడుమిదినీవికంచులికవీడినఁబైచెమటాఱుగా
నిలో । జడియకుమంచుఁదెల్పినవజారిణి నొకక్కఁడుతొంటిమేనులం । బడసినభా
గధేయపరిపాకముగాఁగదియించెఁగౌఁగిటన్ ॥ ౧౦౬ ॥సీ॥ శ్రవణయోగ్యంబై
నశబ్దమొకక్కఁడు లేక ప్రియముగొల్పెడునలంక్రియలు లేక । సరసమైమృదువైనశ
య్యగల్గుట లేకయర్థసంగ్రహముపైనర్థి లేక । వరుఁడువట్టినచోటఁబ్రత్యుత్తరము
లేకప్రాణహానికిఁగొంకుపాటు లేక । వర్ణగౌరవలాఘవములపైమతి లేకవృత్త
భంగమునకువెఱపు లేక । తారుదారయతక్క నెవ్వారు నెరులు । దడవరొక
మూలఁబడిప్రసిద్ధములుగాక । యపుడవిద్వత్ప్రబంధంబుననుకరించె । జారిణీ
జారనవరహస్సంగమములు ॥ ౧౦౭ ॥ వ ॥ఇట్టిజారచోరవిహారంబులుచెల్లుచుం
డమఱియును ॥ ౧౦౮ ॥చ॥ అలిగినవారువట్టియడియాసలమోసలఁజేరిచొచ్చి
పో । నలికినవారుపండువులనూడనిఁబాడినవారువింతరో । వెలగొనితమ్మునత్త
లిలువెల్వడఁద్రోలినవారునాదిగాఁ । గలవిటులెల్ల నొకక్క యెడఁగాల్కొనిగోష్ఠి
యొనర్చిరయ్యెడన్ ॥ ౧౦౯ ॥సీ॥ భావింపఁదీర్ఘపు రేవుకాఱు మొసళ్లుచెఱకుపైఁ
ద్రొవ్వాఁడికఱకుఁబేళ్లు । గెంటనితేనియ జుంటిపైయీఁగలుపూచిన మొగలిపైఁ
బొరలుముండ్లు । పంటచేలకునాఁగఁబడినయోదంబులుగందంపుఁదీవెలకాలఫ
ణులు । కదలకపెన్నిధిఁగాచుదయ్యంబులురచ్చరావులబొమ్మరక్కసియలు । లం
జతల్లులనఁగలక్షింపఁగానిట్టి । కట్టిఁడులకునలువకరుణ లేక । బాఁతిమాలినట్టిబ్రతు
కులునిడుపుగాఁ । జేసివిటులగోడువోసికొనియె ॥ ౧౧౦ ॥ ఆ ॥ గణికవలనిదెం
తఘునమైనసుఖమేని । దానితల్లివలనఁదప్పిపోవు । మదిఁదలంపనెట్టిమధురా[illegible]మే
నియు । నీఁగదొరలెనేనినిందులెట్లు ॥ ౧౧౧ ॥ సీ ॥ భావజువిడిచినపాడి [illegible] పై
బొల్లిపాదుట్రుగతి మేనఁబలితమొదవ । నంటుండకుండఁద్రాయముదుల్పుకొను
మాడిక్కపడుచన్ను లేచిచప్పట్లుచఱవ । ననుభవేచ్ఛావిలాసామలఁదిగిచినకొట్టు
నాఁజేయూఁతకోలయూఁది । యుండుటఁగష్టమే నెల్ల మేననునట్లుపలుమాఱువి
డువకపడఁతవడఁక । నున్నలంజతల్లిఁగన్నచోనల్లుర । గుండెభగ్గురనుచునుండదె

ట్లు । తేరిచూడ వెరచి చేరదు మృత్యువు । దానఁ గాదె చావు దప్పు ననుట ॥ ౧౧౨ ॥ వ ॥ మఱియు నుడుగు వోయిన ప్రాఁకునుం బోలెఁ బండ్లుడుల్లి ప్రాఁతవలయునుం బోలెఁ గన్నులు చెదరి పిఱికి బంటునుం బోలె నిలువక బొమ్మలు వదలి గర్వగ్రంథియుం బోలె విసక పాడిల్లునుం బోలె వెన్నొరగి ముదిరిన మొగలి చెట్టునుం బోలె నేలమోవం జన్నులుడిగి మొంటనికాఁపు ప్రజయునుం బోలె నిండెలు వోలంగి యినుపముట్టునుం బోలెఁ గాలిసత్వంబుడిగి కూలినబావి తెఱంగున నడవలేక మోఁపరి తలయునుం బోలె బట్టగట్టి తగవు గోరియుం బోలెఁ గూడఁబెట్టుచు ముట్టంబడిన రోగంబునుం బోలెఁ జౌరవయిూక జరానివాసంబగుచు లంజతల్లి పెక్కేండ్లు బ్రతుకుట కు విటుల పాపంబ కారణంబు ॥ ౧౧౩ ॥ సీ ॥ చంక్రమక్రమశీల శాఖామృగంబులు భద్రద్విపశ్రవః ప్రాంచలములు । ధారాధరోదరోదయ తటిల్లతికలు వహ్నిసముజ్జ్వలజ్జ్వాలశిఖలు । గోపురోపరిపతాకాపటముఖములు పరిదృశ్య పిప్పలపల్లవములు । తరుమరుచ్చలదళాంతరగతాతప రేఖ లూర్మిమాలి సముద్యదూర్మిలతలు । వెలచెలువల చిత్తవృత్తులా జన్మచం । చలతరంబు లింత తెలిసి తెలిసి । నేర్తు ధనములిత్తు నిలుపుమనని పాటు । విటుఁడు శుద్ధమైన వెఱ్ఱిగాఁడె ॥ ౧౧౪ ॥ క ॥ రూపము చెలువది చిత్తరు । రూపంబుల యందుఁ గలమరు విగొని సతి దర్ప । బైపడని చోటమునసిడు । పాపపు విటు కంటెలంజ బందయుఁ గలఁడే ॥ ౧౧౫ ॥ ఉ ॥ ఒక్కని విన్నదాఁక మఱి యొక్కరు పైఁదలఁ పైనదాఁక వే । ఱొక్కనిఁ గన్నదాఁకఁ దను నొక్కఁడు పైకొని పోఁకుదాఁక నెం । డొక్కనిఁ దక్కఁ జూపి తగులూడ్చెడు నంతటిదాఁక మిండచే । రొక్కము చెల్లుదాఁక నెసరోరుహలోచనలందుఁ గూరుముల్ ॥ ౧౧౬ ॥ క ॥ మధురములౌ నెడు నాలుక । విధురమతిం బులుసుగొనఁగ వేడుకపడున । ట్లధికుఁడగు విటునిఁ గూడియు । నధముని మదిఁ గోరకుండదంగన యెట్లున్ ॥ ౧౧౭ ॥ తే ॥ కువిటుఁ దగిలిన మది చాటుగొనదు గాని । వెలసతికిఁ గూర్మి రసికు పై విఱుగుఁ దఱుచు । హేయమగు ముడ్సు మెక్కనని యందుఁ గాక । యెందు శునకంబునకు నెయ్యి యిందు నెట్లు ॥ ౧౧౮ ॥ తే ॥ విటుఁడు రోయిచ్చి వేశ్యనిల్పుట యె కాని । యొరులఁ గోరెడు గుణమెట్లు నుడుపలేఁడు । డొల్లు నీరంబు నాఁకట్టఁ జెల్లుఁ గాక । డొల్లు గుణము దిమాన్పంగఁ జెట్లు నెట్లు ॥ ౧౧౯ ॥ వ ॥ బలిమిం గట్టకట్టి యాఁకట్టంబడియును బ్రవాహంబు నిజప్రవహణంబు విడువక ప్రవహణద్వారంబుల వెదకుచుఁ జిరకాలంబు నిలిచియేనియుం గనుమగలిగినం బ్రవహించు చందంబున వారవనితమనంబును ధనప్రదానాది సకల ప్రయత్నంబులనిలుపంబడియును మార్గాంతరంబులు వెదకుచుం బెక్కుదినంబులనను పువడియును నెడరుగలిగిన నొండొక్కనిం గూడుకొనునది స్వభావగుణంబు ॥ ౧౨౦ ॥ సీ ॥ ధనమాస వేఱొండు దలఁపదయేనది జలజలోచనకు నౌషధపుఁ గూర్మి । ఘనునొద్దనుండియుఁ దనకాసపడియె నేఁ బోలఁ దుకకదియెంత్రూరొప్పికకూర్మి ।

తగిలినచో నెల్లఁదహతహ నొందె నేబోటికినదియలవాటుగూర్మి । తనకట్ల కెలనికిఁ
దనమేలుచూపు నేఁజేడియకదియు వైశికపుఁగూర్మి । తనదు పైత్యభ్రమంబునధర
యుఁదిరిగి । నట్లయగుభంగి విటుని మోహమునఁదోఁచు । గానని కర్పంపుఁగూరిమి
గణికయందుఁ । బోరయదిలఁబోర్సె నేనది తెరువు పెసర ॥ ౧౨౧॥ తే॥ అనుచు
నీరీతిముచ్చటలాడుకొనఁగ । విటకుమారులమర్గోష్ఠి వినఁగవినఁగ । యామినీకాం
తకుదయించునలఁతినవ్వు । తెఱఁగుతో నంతఁదూర్పునఁ దెలుపుదోఁచె ॥ ౧౨౨॥
క॥ ఎల్లయెడయుఁజీఁకటిచే । నల్లనయైతొడిమపట్టు నాఁదూర్పునఁ బా । టిల్లెడుచిఱు
గెంపున నభ । మల్లో నెరేడుఁబంటియాకృతిఁ జూపెన్ ॥ ౧౨౩॥ వ॥ తదనంతరం
బ ॥ ౧౨౪ ॥ సీ॥ అంగసంభవుప్రోషితాలంభవిధిఁబ్రతిష్ఠింపమండెడు హోమా
శిఖయనంగఁ । దిమిరాఖ్యభూతతృప్తికిఁబ్రాచియను వేఁటనఱికినమెడపట్టునఱక
నంగ । నాతపత్త్రకల్హారలక్ష్మికినిశాంగనయిచ్చుమడఁత చెంగావియనఁగ । కౌముదీ
సుధవోయఁగాఁజకోరములకునలువయొత్తెడురత్నకలశమనఁగ । జారతస్కరలో
కసంహారమునకు । సమయమసియెడునలికలోచనుఁడు చాలఁ । గినిసి తెఱచినయలి
కలోచనమనంగ । నిండుఁ గెంజాయఁబూర్ణచంద్రుండు వొడిచె ॥ ౧౨౫ ॥ క॥
సమధికవిరహవ్యథఁబడి । భ్రమసినకోకంబులుదయపాటలుఁ జంద్రుం । గమ
లాప్తుఁడు వొడిచె ననవి । నిముసముమిథ్యాప్రమోదనీరధిఁ దేలెన్ ॥౧౨౬॥ క॥ తొ
లిఁదొలిఁబొడమెడు వెన్నెల । మొలకలఁ బైకొనుచకోరములు మేయంగాఁ । గలు
వచెలికాఁడు పొడిచిన । తొలుదెసనుందమముకొంతదొలఁగకయుండెన్ ॥౧౨౭॥
క॥ ముంగోలు మొలక వెన్నెల । లంగలఁగంబడుతమంబులంగలగగనో ।
త్సంగముగంగాయమునా । సంగమమిందలఁపుచేసె సజలాకృతియై ॥౧౨౮॥
ఉ॥ చెందినకూరిమిందిమిరచేలముపీడఁగనైందవోపల । స్యందమునం జెమర్చిక
మలాక్షములన్మొగిడించుయామినిం । జందురుఁడంగరాగరుచిజారఁగవుంగిటఁ
జేర్చిపొందె స్వ । చ్ఛందతఁదారకాకుసుమసంకుచితాంబరతల్పమధ్యమున్॥
తే॥ ఇంచుకించుకశశియుదయించునపుడు । తలుచుఁజీఁకట్లుభీతిమైఁదఱిసి దాఁ
గె । ముకుళితాంబుజపుటకుటీమూలములనొ । సభయమూర్ఛితవిరహిణీస్వాం
తములనొ ॥ ౧౩౦ ॥ చ॥ సుదతులనున్నగ్రొవ్వెదలుచొచ్చెనొ కాంతఁ మ
రేఖలం । దొడిఁగెనొ పుష్పకోమలులయోలపునాభులలీనమయ్యెనో । ముదిత
లచూడ్కిఁ జేరెనొకొ ముగ్ధల ఱెప్పలలోన డాఁగెనో । వెదకినలేకపోయె నభివృ
ద్ధతమంబు విధూదయంబునన్ ॥ ౧౩౧ ॥ క॥ ప్రమథపతిమూర్తిచంద్రుఁడు ।
తిమిరగజాసురువధించి తిత్తొలిచినత । త్సమధికచర్మముఁదాల్చిన । క్రమమునననం
కంబుకడుఁబ్రకాశితమయ్యెన్ ॥ ౧౩౨ ॥ చ॥ కరమిళనంబుచే ముఖవికాస
ముగల్గఁ జేసి వెల్వడన్ । దెరువటిచిక్కియున్నయలతేంట్లను లోపలికందువాఁ

పివి । స్ఫురితపరాగహాసపరిపూరితఁ జేసిమధుచ్ఛలంబునన్ । గరఁగఁగఁ జేసె
మానసముఁ గైరవిణీప్రియఁ జంద్రుఁ డయ్యెడన్ ॥ ౧౩౩ ॥ చ ॥ అనుపమకాలచ
క్రఘటయంత్రవశంబునఁ జంద్రమండలం । బనుపటికంపుగుండ్రఁ గలయంబడనె
లుక్కుచుసాంద్రచంద్రికాం । బునిధిసముద్ధృతామృతముముంచెజగంబను పేరిస
స్యముల్ । దినకరతీవ్రతాపనిహతింగలవాడఁ జితోంగలింపఁగన్ ॥ ౧౩౪ ॥ సీ ॥
పైసుధారోచిబింబము తక్రమునయందు మునిఁగి తేలెడు వెన్నముద్దగాఁగ । మహి
విశ్రమించుదంపతులు పాలకడలిలో భాసిల్లుదివ్యదంపతులు గాఁగ । నింగినాడుచ
కోరనివహంబు మిన్నేటఁ గలయనీఁదెడు నంచకొలము గాఁగ । దెసలఁ గైరవసముత్థి
తపరాగము వజ్రమయశైలతటులపై మించు గాఁగ । మీఁదఁ బొట్టిక్రిందమిక్కుటంబై
యంత । రాళమెల్ల నిబ్బరముగ ముంచి । యెల్లకడలయందు మొల్లమై పండువె । న్నెల
జగంబు కుక్షినిండి వెలిఁగె ॥ ౧౩౫ ॥ క ॥ కడలేనియచ్చవెన్నెల । నడుమం జంద్రుండు
మంథనగమునఁ దరువం । బడు పాలకడలి మును దాఁ । బొడమి పయిం దేలువిధముఁ
బొందుగఁ దెలిపెన్ ॥ ౧౩౬ ॥ ఆ ॥ పాలకుండవోలె బ్రహ్మాండ మప్పుడు । జీర్ణచంద్రి
కాభిపూర్ణమగుచుఁ । బాలుగ్రోలమీఁదఁ బైకొన్న ఫణిఫణా । బింబమనఁగ నిందుబిం
బమలరె ॥ ౧౩౭ ॥ తే ॥ మించి వెన్నెల జగమెల్ల ముంచినపుడు । తలఁచుఁ జీఁకట్లు భీ
తిమైఁ దఱిసిడాఁగె । ముకుళితాంబుజపుటకుటీమూలములనొ । సభయమూర్ఛి
తవిరహిణీస్వాంతములనొ ॥ ౧౩౮ ॥ చ ॥ కరఁగెడు చంద్రకాంతములఁ గాలువ
లై ప్రవహించునీటనో । విరియునవోత్పలావళుల వెల్లువలై చనుపువ్వుఁదేనెనో ।
తొరఁగు వియోగిబాష్పములతోరపుఁ దేటులచేసవృద్ధినో । పొరిఁబొరి నింగిమిం
గుచును బొంగె బయోధివిధూదయంబునన్ ॥ ౧౩౯ ॥ ఉ ॥ పిల్లలకెల్ల మేపిము
ను సేర్చిన వెన్నెలతీఁగె లేఁగొనల్ । కొల్లఁగఁ దారునుం బతులుఁ గుత్తుకబంటిగ మేసి
గూండ్లలో । వెల్లులుగూడఁ బోసికొను వేడుకఁ బుక్కిటఁ బట్టి చీకటుల్ । జల్లునఁ
బాఱఁగా నమియుఁ జాఁగినకోరికలంజకోరికల్ ॥ ౧౪౦ ॥ వ ॥ అప్పుడు ॥ ౧౪౧ ॥
క ॥ ఇతరశరంబులు గాఁడని । యతివలయభిమానకవచ మతనుఁడు సించెన్ ।
సితకరశాణసముత్తే । జితకువలయసాయకముల చేనట్టియెడన్ ॥ ౧౪౨ ॥ తే ॥
తప్పులొనరింపకైన నాతప్పు లెన్ని । తారుమును ద్రోచిపుచ్చుటే తప్పటంచుఁ । ప్రియు
లఁ దోతేర సఖులనంపిరి వనితలు । తప్పుతమదని ప్రణయంబు చెప్పనేల ॥ ౧౪౩ ॥
ఉ ॥ త్రోచిన మీఁదటన్ మరలఁ దోకొనివచ్చుట కెన్నిభంగుల । న్నేచినదానవీవయినని
న్నిటువంపఁగఁ జాలనిక్కువం । బోచెలి నీవనేనగుచు నుండుటఁ బోయి నన్ను నన్న
కాఁ । జూచి యతండు లాఘవము చూపెడు నోయని యేమి సేయుదున్ ॥ ౧౪౪ ॥
ఉ ॥ ద్రోహము లేనిచోట విభుఁ ద్రోచిన ద్రోహఫలంబు గాదె న । న్నీహరిణాంకుఁ డిం
తయొరియించుట వెన్నెల కోర్చునంతనే । సాహసినెట్లు నాయెడఁ బ్రసన్నకృపా

మతివైలఘుత్వసం । దేహము లేకవల్లభునిఁదెచ్చువిదగ్ధవునీవు నెచ్చెలీ ॥ ౧౪౫॥
చ ॥ ఎడయెడమాటలేలచనియేనముఖాముఖిఁబిల్తుఁబిల్వఁగాఁ । నోడఁబడిరాఁ
డయేనతనికొప్పనసేయుమఁబ్రాణమన్ననీ । నడుమననన్నుజీవముగొనందలకొ
న్నదియోవయస్యయీా । విడువనివేలమైకురియువెన్నెలచిచ్చునకేమిసేయు
దుఁ ॥ ౧౪౬ ॥ తే ॥ అనుచుఁ బ్రియదూతికలతోడ నాడికొనఁగఁ । బలు
కులవిచాటువడివించుఁబతులులోని । తుకతుకలుమానిక్రొత్తవేడుకలువొడల ।
బయలువడివల్లభలసిగ్గుపటిచిరపుడు ॥ ౧౪౭ ॥ చ ॥ తడయుటకోర్వలేకరొుక
తన్విమనఃపరికల్పనంబుచే । నెడపకవల్లభుండెదుటికేర్పడవచ్చినయట్లతోఁపఁ
గా । నుడుగనికోర్కులంబొరలుచుండియతండరుదేరఁగాంచియుం । దడియక
యుండెనెప్పటివిధంబునఁగౌఁగిటఁజేర్చునంతకుఁ ॥ ౧౪౮ ॥ చ ॥ నెలకొను
రత్నకుడ్యముననీడయెవల్లభుఁడంచుఁగిన్కమైఁ । బొలఁతిపరాఙ్ముఖత్వమునఁ
బొందినఁదానపరాధిగానశం । కిలివెనుకఁవసించిపరికించువిటుండునయత్నసి
ద్ధమై । కలిగెఁదదాభిముఖ్యమునికౌఁగిటఁజేర్చెలతాంగిలజ్జిలఁ ॥ ౧౪౯ ॥ చ ॥
తనహృదయంబగల్పుటకుఁదానుఁబతిఁహృదయంబగల్పఁగా । వనితతలంచెఁగా
కకడువంచనచేసినవాఁడుచేరినఁ । గినుకతొఁఅంగిపోవఁజనుఁగేలఁదెమల్చినమా
త్రఁగరఁశ । స్తనములువీఁపునన్మొలవఁదారొఁనికౌఁగిటఁజేర్ప నేటికిఁ॥ ౧౫౦॥
ఉ ॥ పట్టకుఁబట్ట కేలననుఁబట్టెదవోరిబిగించికౌఁగిటం। బట్టెదవేవృథాయెరియఁ
బట్టగునీకయిమతుఁచద్వయీా । ఘట్టనచేఁతనిప్పడెటుఁగందలపోయవుగాక
యెవ్వతెం । బెట్టినవాఁడవోహృదయపీఠికదానికినొత్తుడౌఁజుమీ ॥ ౧౫౧ ॥క॥
తద్రదనఖాదిముద్రా । ముద్రితునినుఁదగవుమాలిముట్టుదునట్రా । యుద్రేకింపకత
లశర । ముద్రించినసొమ్ముపరులుముట్టందగు నే॥ ౧౫౨ ॥ క ॥ తలఁపెత్తిరొుం
డుపేరం । బిలిచినఁదప్పేమినీకుఁబ్రియమగుసతిగాఁ । దలఁచుటచాలదెనాక ।
ప్పొలఁతుకనామంబుఁదాల్చుపుణ్యముగలదే ॥ ౧౫౩ ॥ క ॥ ద్రోహముసేయ
మికివరా । రోహమదిన్నమ్మునీదురోషూవళికృష్ణాహింబట్టుదునిదెయని । సాహ
సికవిటుండునీవిసడలందొడికేఁ ॥ ౧౫౪ ॥ చ ॥ ఘనకుచకుంభయుగ్మమిదిగై
కొనినీకవియోగవార్ధిలో । ననుమునిఁగించుభావమునమోజలజాయతనేత్రశ
య్యపై । ననయమునలమైనకటయవ్వలిమోమయితైననేమినీ । వినుతకటీత
టీపులినవీథివసింపఁగఁగల్గెఁజాలదే ॥ ౧౫౫ ॥ క ॥ మన్నించియిట్లునన్నుం । ద
న్నియశోకుఁడుగఁజేయుతలఁపిదియొప్పుఁ । నన్నుదయఁజూచియిఁకనో । కన్ని
యవెసఁదిలకితాత్మఁగాఁజేయఁగదే ॥ ౧౫౬ ॥ క ॥ ఈరీతిఁగుటిలవాక్య ।
ప్రారంభవిజృంభణంబుఫలముగనలుకల్ । దేరుటయుఁగలసిచూపిరి । పౌరవిటీ
విటులుసీధుపానక్రీడల్ ॥ ౧౫౭ ॥ తే ॥ వారుణీసక్తహృదయాలవాలవీధి ।

నంగనలయందుమదలతయంకురించి । పాటలాలోకనశ్రీలఁబల్లవించెఁ । గుసు
మితంబయ్యెసన్మోతహాసితలీల ॥ ౧౫౮ ॥ క॥ మదిసిగ్గు వెఱికిఁవేయఁగ । మదనుఁ
డుమధురసమునించిమఱిపాఁతగలం । గదలింపనూఁగుపోలిక । సుదతికిమధుసే
వఁదనువుసొరుగఁగఁజొచ్చెన్ ॥ ౧౫౯ ॥ తే ॥ తొట్రుకొనునడ్గులును వెడఁద్రొ
క్కుఁబలుకు । లుల్లములసిగ్గెఱుంగమియునుఘటించి । జవ్వనులకునుమరలశైశ
వముదెచ్చె । వారుణియు నెట్టిసిద్ధౌషధీరసంబొ ॥ ౧౬౦ ॥ సీ ॥ కోపంబులేక
భ్రూకుటిఘటియించుఁబోలింపంగలక్ష్యంబులేకచూచుఁ । బిలువకుండఁగనైనఁ
బలుకునోహోయనిబయలూఁతగొనఁజూచుఁబొఱఁజూచుఁ । గారణంబొండు
లేకయునవ్వువికవికఁగ్రాలెడుసీడపైసోలఁజూచుఁ । జేరువనెచ్చెలిఁబేరెలుంగునఁ
జీరుమనసులేకయుఁబాడుమానిమాని । ప్రస్తుతముగానివెడతొక్కుఁబలుకుపలు
కు । మ్రోయుదేఁటులతోఁగూడిముచ్చటాడు । నుబ్బిజాబిల్లిఁబిలుచు రాకున్న
నలుగు । మగువయొక్కతెమధుమదోన్మత్తయగుచు ॥ ౧౬౧ ॥ తే ॥ శశవిషా
ణంబుదీర్ఘమైసంభవించె । వికసితంబయ్యెగగనారవిందమపుడు । మధురసా
స్వాదనోన్మత్తమత్తకాశి । సీకలోక్తిప్రసంగాభినీతమగుచు ॥ ౧౬౨ ॥ సీ ॥
మ్రాఁగన్నువడివెడదూఁగుమేనునమింటనొఱగుచుఁబడఁబొఱియులికితెలియు ।
నెఱిబొమ్మలెగయించి నిలువుఁజూపులఁజూచి కోపించియలులంచుఁ గురులజడి
యుఁ। దలఁపునగుఱిలేకతనుఁదానమెచ్చుచుఁజప్పుడుగాఁగఁజేచఱచినవ్వుఁ। గా
ర్యమొకండులేకయపిల్చినెచ్చెలియేమన్నమఱిచెప్పనెఱుఁగకుండు । చన్నులెడ
గాఁగఁబయ్యెదసవదరించు । హస్తతాళంబులిడిమస్తమభినయించుఁ । గడను
వడఁబలుకుఁబలుకులాకస్మికముగ।మగువమదిరారసోన్మాదమహిమవలన ॥౧౬౩॥
క ॥హాలారసపానంబునఁ । జాలఁగనున్మత్తయగుచుశంకింపకపై । వ్రాలివిటుఁ
గౌఁగిలింపఁగ । బాలామణిలజ్జయొద్దిపణఁతులఁజేరెన్ ॥౧౬౪॥సీ॥ ఆభిముఖ్యం
బుననలరెడుచూపులునారాచధారలైనాటుకొనఁగఁ। బెనఁగొల్పినప్పుడుబిగియా
నిచేతులుపాశబంధములట్లుబమిలిచూపఁ। బ్రత్యుత్తరమునకుఁబ్రాఁతియాపలుకులు
జాతహుంకృతులమైసందడింప। నెగయించిపట్టిననెమరనివసనంబులగపడ్డచక్కఁ
యయప్పళింపఁ। జెట్టఁగబళించితిగిచినఁజేరఁబడని।సతులుమధుపానమునలజ్జసడ
లితార । పల్లవులఁబట్టికేలితల్పములకీడ్వ । మదవతీనామమపుడుసమర్థమయ్యె॥
సీ॥ముసముసమనిచుట్టుకొసవెంద్రుకలువట్టిహుమ్మనిమట్టియలులియదాఁచి। తు
దనాలుకఁదొరలనితొక్కుఁబలుకులఁదిట్టికటికిచన్నులురంబుగాఁడనదిమి। గ్రుచ్చి
చేతులమేనుముచ్చట్టురాఁజుట్టిదొమ్మియూర్పులతావిగుమ్మరించి । తమిగోళ్ళఁద
నువుజూదపుటిండ్లుగాఁద్రవ్వచ్చిచొక్కునమోవినంజుల్లుగఱచి । మధుమదోన్మత్త
లైయలఁకుమఱచిసఖులు । సూరెలకుఁదాఱఁబతులపైసోలునట్టి । చేడియల

మన్మథుఁడు వెత్తిచెఱకువింట। నేసెను మ్మెత్తవిరులచే నేసరేఁగి ॥౧౬౬॥ మ॥ అను
కూలక్రియచూప నేరకబలవ్యాకృష్టి చేవక్రమై। యనుమానాకులతంబదంబుమృదు
శయ్యంగూర్పఁగా లేకచా।లనిగూఢంబుగభావముంగుకవితాలక్ష్మ్యస్థితింజెందినై।
ననవోఢాంగనచేసెవల్లభునకానందంబుడెందంబునన్॥౧౬౭॥ తే॥ మదనునభ్యుద
యైకకర్మంబుజరపఁ।గోరుకొనుకామినులుఁగాముకులును మొదటఁ। జేసిరుదితస్మి
తంబులచేఁగపోల। పాలికలయందునంకురార్పణవిధంబు॥౧౬౮॥ ఆ॥ యువతిఁదివి
యనీకయున్నపయ్యదతోన।లీలఁదిగిచి కాఁగిలించెవిటుఁడు । తత్తఱించి వానిదర్ప
కుండొరతోన । విసరియడిదమెత్తివేయకున్నె ॥ ౧౬౯ ॥ క ॥ వినదయ్యెఁబ్రి
యముతుదిఁగై । కొనదయ్యెన్మ్రొక్కు-కాముకుఁడు వెఱవకపై । కొనికౌఁగి
లింపవనితకుఁ । గొనకొనికన్నీటితోనకోపము వెడలెన్ ॥ ౧౭౦ ॥ తే ॥ మగని
కౌఁగిటబిగిచేతమగువయఱిమి । హారలతద్రెవ్వుటయుముత్తియములుచెదరె ।
నటనచూపగణంగునన్నాతిచన్ను । లెమరెనురనిచ్చుపువ్వుదోయిలియుఁబో
లె ॥ ౧౭౧ ॥ తే ॥ ఉన్నతస్తనకుంభములురముదన్ని । పట్టెనొకకేలఁగౌఁగి
టఁజుట్టిపట్టి । యపరకరమునవిటుఁడేమియుందఁగలఁడె । చంద్రముఖినీవితనుఁ
దానెజాఱెఁగాక ॥ ౧౭౨ ॥ క ॥ అంగనముఖచంద్రునకుభు । జంగముఖగ్ర
హణమొప్పుసమయంబునస । ర్వాంగములకుఘర్మోదక । సంగతిచేమజ్జనంబు
సలుపఁగఁగల్గెన్ ॥ ౧౭౩ ॥ చ॥ త్రివళితరంగసంగతులఁదేలుచుఁగ్రుంకుచునాభి
దీర్ఘికన్। వివృతకటిస్థలీపులినవీథిఁజరించుచుఁగౌఁగిలింపనూ। రువులను పేరనం
ట్లకడరుంబ్రియపల్లవుహస్తమప్పుడా । యువతికుచంబులన్బొరలియూష్మలచే
తఁదపించెఁగావునన్ ॥ ౧౭౪ ॥ ఆ ॥ పాకమెఱిఁగి కేలిభవనంబు వెడలెడు ।
సఖులతోనె వెడలి చనియెనప్పు। డేణశాబనయనహృదయంబులజ్జయుఁ। గాముకు
నిమనంబుకరకరియును ॥ ౧౭౫ ॥ చ ॥ జనితరతిత్వరంజెలులసన్నిధిఁబయ్యె
దయంటుభర్తపైఁ । గినిసియదల్పుమైబొమలుగీల్కొనఁజేసియళీకదీనతా । భి
నయముచూపుకాంతమదిఁబ్రేమవిపాకముఁదెల్పినీవిస । య్యనఁదనుఁదానజా
ఱెదరహాసముతోఁజెలులెల్లవెల్వడన్ ॥ ౧౭౬ ॥ క ॥ అలసినవల్లభుమెచ్చక ।
మెలఁతరతిన్విక్రమింపమెయికొనియెడున । కొలఁదిమరుఁడలయఁబువ్వుల। వి
లుగొనిరతిదేవిసమరవిధిఁగైకొనియెన్ ॥ ౧౭౭ ॥ సీ ॥ నెచ్చెలిరాకరానేర
దింతకుమున్నతానమైరతులకుఁదఱుముటెట్లు । చేపట్టితివియకచేరదింతకు
మున్నపౌరుషంబుననెట్లుపైనటించెఁ। బయ్యెదదివనీకపట్టునింతకునున్నసిగ్గునే
సంగతిదిగ్గనాడె।నడిగినమాఱుమాటాడదింతకుమున్నరతికూజితంబులేగతిరచిం
చె।నబలయఁటెపేరుసుకుమారమట్టితనువు।తరుణిరతినిర్దయత్వంబుదలఁచునపు
డు।కొసరదఁటయింతమైనఁబైకొనఁగనింక।నాతిదీనోక్తులెట్లుగానమ్మవచ్చు॥

వ॥ ఇవ్విధంబునం బ్రశాంతలజ్జాప్రపంచంబును బర్యస్తనిరస్తసమస్తశంకాకళం
కంబును బరిహృతపరస్పరమనోంగవచనంబును గుట నిష్కంటక మదనసామ్రా
జ్యంబై నిఖిలేంద్రియనిరంకుశస్వారాజ్యంబై యవలోకనాలాపనాలింగనాధరా
స్వాదనాదులయందు ముఖ్యోపసర్జనభావంబు లేక యొండొకంటికిం బ్రోదులై
యుపక్రమోపరమంబుల కంతరంబులు గలుగక చోఁకుఁజోటెల్లనుం గళ్ళానిల
యంబును నగపడుచక్కియెల్లనుం జుంబనస్థానంబును జేయుచెయువులెల్లను బా
రవశ్యజనకంబులును నగుచుం బరిరంభనిర్దయత్వంబునుం బ్రణయరసభావార్ద్ర
త్వంబును గుచకచగ్రీవక్రౌర్యంబునుం గరుణోక్తిదైన్యంబునుం బౌనఃపున్యభేదనం
బును బరివర్ధితాఖిలాభిలాషైక్యంబునుం గలిగి యఖిలాంగ విభ్రమాస్పదంబయ్యు
నననంగవిలసితంబును నవిరతోద్గతసకంపసీత్కృతంబయ్యును నపాకృతచేలంబు
ను బహుబంధసంబంధబంధురంబయ్యును నిర్లేపభావభావితంబును నఖాంకచం
ద్రకళోదయనిధానంబయ్యును నద్వితీయానువాదార్హంబును సమయసముచి
తంబయ్యునుం దర్శితవైపరీత్యంబును నగుచుం బ్రవర్తిల్లు నంత ॥ ౧౭౯ ॥ సీ॥ ఉప
ధానవినిమయంబొండొకచూపుటఁ బెరకేలులక్కునఁ బ్రిదిలిబిగియఁ । బలుచోఁకు
టలుప్రేఁకెఁబడు మోవు లెఱుఁగమిఁగముచుటకులికి సీత్కారమీఁగ । నభినవనఖరే
ఖలఱుక్రమ్ముచిత్తడిసోఁకెడుచుఱ్ఱునస్రుక్కఁబడఁగ । వీడ్వడఁగ్రోలుచు వెడలిం
చునూర్పులు । ప్రాణంబు లేకంబులగుటఁ దెలుపఁ । బారవశ్యంబులాచ్ఛాదపట
ముగాఁగ । సాంద్రనిజబాణజాలజర్జరితులగుచుఁ । బడుగుఁబేకయునైనదంప
తులఁజూచి । యెలనగవునవ్వెమరుఁడువిల్లెక్కుడించె ॥ ౧౮౦ ॥ చ॥ మెలఁత
లువల్లభుల్మొదల మెచ్చఁగనుండిరి నాకతంబునన్ । నిలువునఁగత్తికోఁతలయినిద్ద
పుమోవులునజ్జునజ్జులై । యలజడి వాడివత్తులయిరక్కటయేఁసిఁకనున్ననేమిగాఁ ।
గలరొ యిదేల వోమనను కైవడి తోనిశియేగె నేగినన్ ॥ ౧౮౧ ॥ క॥ ఏకతపుమత
కములనా । నాకరణాసననిరూఢి నటియించుమదో । త్సేకమిథునంబులకుఁ గృక ।
వాకుస్వరమంతభరతవాక్యంబయ్యెన్ ॥ ౧౮౨ ॥ తే॥ ధవళకిరణుండు చరమ
దిక్తటము వెంట । నల్లనల్లనఁ దిగజాఱె వెల్లనగుచు । సురతపరవశఖేచరీవిరళచికు
ర । భారమునజాఱువాలుపూబంతివోలె ॥ ౧౮౩ ॥ చ॥ దలమటిపోవు వెన్నె
లవిధంబదిరక్తపటీరచర్చ గాఁ । జులకనితారకావళి విసూత్రితహారమణివ్రజంబు
గా । నలతొలుసంజ కెంపు పదయావక చిహ్నలుగాఁగ నంబర । స్థలియలరారె వే
శువనిశాశశిభుక్తవిముక్తశయ్యనాన్ ॥ ౧౮౪ ॥ తే॥ వేగునంతను విటవిటీవివిధసు
రత । బంధబంధురగతులు తత్పరతఁ జూచి । మెచ్చి తలలూఁచు నట్లు కంపింపఁజొ
చ్చె । వేగుఁబోకటగృహదీపికాగణంబు ॥ ౧౮౫ ॥ ఆ॥ దశలుతుదకువచ్చితలల
ల్లనల్లన । వణఁకవణఁక నపుడు వార్ధకంబు । తేటపడువిభాతదీపంబులకు మేనఁ । బ

లితమనఁగ వెల్లఁబాటుతోఁచె ॥ ౧౮౬ ॥ చ ॥ వలిగొనుమంచునందడిసి వారిజినీకలికాపుటీకుటీ । బిలములుదూఱి తేనియల వెల్లువఁదోఁగుచువచ్చియంతటన్ । దలిమములుజ్జగించుమిథునంబులయందుపయోగవహ్నిఁగా । లూఁకలి పెంఁదదూష్మలంబొరలఁగోరియుఁబోలెవిభాతవాతముల్ ॥ ౧౮౭ ॥ చ ॥ నయమునసూతగీతులువినంబడహారములింపుసూపవీ । డియములుక్రొత్తలైతగఁబటగ్రహణత్వరమాణవల్లభా । వయవములందుఁజూడుకలూదవన్నునగాడ్పులుసోడుముట్టనిం । ద్రియములపండువయ్యెనుసతీపతికోటికి వేగుఁబోకటన్ ॥ ౧౮౮ ॥ చ ॥ చిడిముడితోడఁజేలమొకచేఁగటిమండలిమీఁదఁజేర్చుచున్ । వెడవెడజారునింగనలివేనలిఁదతకరమూలకాంతివీ । డ్వడఁబెరకేలనిల్పుచునువాడుగనుంగవసోలశయ్యపైఁ । బడఁతులులేచుసంభ్రమముభర్తలనువ్విళులూర్చెఁగ్రమ్మఱన్ ॥ ౧౮౯ ॥ ఆ ॥ దించిసురతవేళదిగఁదన్నివిడిచిన । పగఁబటంబులంతఁబద్మముఖులు । తల్పతలముడిగుచుఁదముఁదారతిగిచిన । విటులవెనుకఁజొచ్చివెడలకుండె ॥ ౧౯౦ ॥ చ ॥ అలసతచేంద్రపాగమసమాకులభావముచేతనైనయ । వ్వలువలపిండువాయఁగనివారకమీవలరాచవేడ్కలన్ । మెలఁగెడువేళవీడ్వడినమీకిదియుక్తమెయంచుహాసముల్ । సలిపిరిగేలిపెట్టచునుజంపతులం జెలిపిండువేకువన్ ॥ ౧౯౧ ॥ తే ॥ రేయినిజనాథులనభిసరించిపోయి । తెల్లవాఱంగమరలనే తెంచిరనఁగఁ । దఱచుఁజీఁకటులంతంతదలఁగిపోవఁ । దెల్లమిగఁగానఁగానయ్యెనెల్లదిశలు ॥ ౧౯౨ ॥ క ॥ నిజవరపరిరంభణమున । రజనీహారములుద్రెవ్విరాలినముక్తా । వ్రజములొకోయనఁదగిభూ । మిజదళములఁజెలువుగొలిపెమిహికాలవముల్ ॥ ౧౯౩ ॥ క ॥ ఒకకొంతయపుడుతూరుపు । దిక్కునఁదోలుతెలుపుదోఁచెధృతిచెడివగలన్ । జొక్కెడుజక్కవలపయిం । దెక్కలిదైవంబుకన్నుదెఱచెననంగన్ ॥ ౧౯౪ ॥ క ॥ అందముగమీఁదదినమణిఁ । బొందించివిభాతమలనభోరమకిడఁగాఁ । గుందనపుమొగపుఁగూరుచు । చందంబుననంతపూర్వసంధ్యజనించెన్ ॥ ౧౯౫ ॥ ఆ ॥ తప్పులేకరాజుతనుడించియపరఁజెం । దుటయుఁదానుమిగులదోషయగుటఁ । బ్రాచిలోకమెఱుఁగఁబాలఁబుట్టెడువాని । పోల్కనెఱ్ఱనగుచుఁబ్రొద్దునొడిచె ॥ ౧౯౬ ॥ సీ ॥ పద్మినీవిస్తీర్ణపద్మప్రశస్తహస్తములిందిరకుమందిరములుగాఁగఁ । గలయంగఁగుముదినీకులమెల్లనభినవకోశసంపత్తిచేఁగొఱలుకొనఁగఁ । గమనీయచక్రవాకద్విజవ్రజమెల్లఁబరిణయోత్సవయుక్తిఁబరిణమింపఁ । జింతితవివిధార్థసిద్ధిచేతసమస్తజనములుసంతోషజలధిఁదేల । నాత్మవసువితీర్ణిననురాగయుక్తిమై । విశ్వమెల్లఁబల్లవింపఁజేసి । యుదయశిఖరిపేరియున్నతనూత్నసిం । హాసనాగ్రసీమనలరెనినుఁడు ॥ ౧౯౭ ॥ వ ॥ ఇట్లుసూర్యోదయంబగుటయు ॥ ౧౯౮ ॥ క ॥ కృతకాల్య

కృత్యుఁడై భూ। పతిశేఖరుఁ డపు డశేషపరిజనసంసే। వితుఁ డగుచుఁ బ్రముదవన
ని। గ్గతుఁడై పురి కేఁగుదెంచెఁ గడుముద మొదవన్ ॥ ౧౯౯ ॥ ఉ॥ స్వర్ణసువ
ర్ణచేల ధనవర్ధితనిర్ధనవత్కుచేల గో। కర్ణకులేంద్రకుండలితగాత్రశయాన ఖగే
శయానసం। పూర్ణకృపావలోకపరిపోషితలోక నిజాంకవర్ణనా। కర్ణసబంధు
రక్షణప్రకల్పితసంశ్రితబంధురక్షణా ॥ ౨౦౦ ॥ క॥ చోళేంద్రధర్మవర్మన్నృ। పా
లప్రాంగణనిధానపరిఖేలనమ। తూర్కాలకవేరసుతాపరి। ఖాలంకృతరంగమం
గలాధీశమణీ ॥ ౨౦౧ ॥ ... ... ... *

తురంగవృత్తము ॥ తరుణరవికరవికచసరసిజదర్పమోచనలోచనా। శ
రధినిరవధినిఖిలజలహృతిసాంద్రకంధరబంధురా। గిరిమథనజమధురవిధుకరశ్రితకీ
రవాహనమోహనా। స్ఫురదచిరరుచిరుచిరచిరరుచిపోషకాంబరడంబరా ॥ ౨౦౨ ॥

గద్య ॥ ఇది శ్రీమద్భట్టపరాశరదేశికేంద్రచరణసరసీరుహ సేవకోపసేవకనర
సింహనామధేయప్రణీతంబైన కవికర్ణరసాయనంబను కావ్యంబున వసం
తవర్ణనంబును వనవిహారజలక్రీడలును సూర్యాస్తమయతమస్తారకా
జారవిటవీటీవర్ణనంబును జంద్రోదయంబును మధుపానరతినిరూప
ణంబును ప్రభాతసూర్యోదయంబులు నన్నది చతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.

# కవికర్ణరసాయనము.

## పంచమాశ్వాసము.

క॥ శ్రీరంగప్రియమందిర । భూరంగాకస్మికాస్తభూషణలంకా । భూరమణనిరంతరవీ । క్షారతికరుణారసప్రసాదాభిముఖా ॥ ౧ ॥ వ ॥ ఇవ్విధంబునని రంకుశస్వేచ్ఛావిహారంబులం బ్రవర్తిల్లుచునొక్కనాఁడు ॥ ౨ ॥ సీ ॥ క్రముకకంకణఝణత్కారసంకులముగా సుందరీజనము వీచోపులిడఁగ । నర్మసంగతినంతరాంతరంబుల మంత్రిసామంతహితవీరసమితి గొలువ । వివిధప్రదానాదివిజయాదినిజగుణప్రకరంబు ప్రౌఢపాఠకులు చదువ । స్వమహితైశ్వర్యానువాదరూపంబుగాఁ జేయెత్తి విబుధులాశీర్వదింప । వేత్రధరనిష్ఠురోక్తివైచిత్రులెసఁగ । నంగచోళకళింగవంగాదివివిధ । సకలదేశాధిపతులు దర్శనము వడయ । నిండుకొలువుండె మాంధాతృనృపవరుండు ॥ ౩ ॥ వ ॥ ఇట్లు కొలువుండు నంతవసిష్ఠప్రముఖమహర్షులరుదెంచినం బ్రహర్షపులకితాంగుండగుచు సాష్టాంగదండప్రణామంబు చేసి పురోనిర్దిష్టమార్గుండగుచు నంతఃపురంబునకుం గొనిచని యచట మహార్హమణిమయాసనంబుల నాసీనులం గావించి తాను విమలాంగియు నర్ఘ్యపాద్యమధుపర్కాదులగు సపర్యలం బరితుష్టులం జేసి ప్రసన్నులగు నత్తపోధనసత్తములకునందఱకుం గృతాంజలియగుచు నృపకుంజరుండిట్లనియె ॥ ౪ ॥ క॥ తపములు నిర్విఘ్నము లే । యుపహతిగంధంబుఁ జోఁకకున్నవె వనముల్ । కృపననుఁ గృతార్థుఁ జేసితి । రిపుడైనం గృత్యమానతిచ్చుట యొప్పుఁ ॥ ౫ ॥ వ ॥ అనిన వారెల్లనుల్లసితవదనారవిందులై ॥ ౬ ॥ చ ॥ మనుకులచంద్ర కేవలము మాకు నొకండన నేలవిశ్వభూ । జనములయందు నార్తియనుశబ్దము లేదు భవాదృశాధిపుం । గనివినిమున్నెఱుంగమిఁకఁగల్గెడు శంకయు లేదు లేదు మా । కనఘ భవద్విలోకనజహర్షము దక్కఁగఁ దక్కువాంఛయుఁ ॥ ౭ ॥ వ ॥ విశేషించి యునీచేయు వినయాతిరేకంబునం బొడమెడు పరమప్రసాదాతిశయంబు మదీయమానసంబుల వరప్రదానోన్ముఖంబులం జేసి వేగ పెట్టెడునగుటం గోరినయది సర్వప్రయత్నంబుల నొడఁగూర్చువారము నీకెద్దియభితంబెఱింగింపుమనినం బొంగి నృపపుంగవుండు పునఃప్రణతుండై ॥ ౮ ॥ సీ ॥ పూర్వాస్తశైలముల్ పొలిమేరలగు ధాత్రికొడయుండనేన వేఱొకఁడుగలుగఁ । డేకరాజకమైన యీవిశ్వధాత్రి నధర్మంబు శబ్దమాత్రంబు లేదు । విత్తాధిపతికైన విస్మయంబొనరించు విత్తసంపదకింత పెత్తిలేదు । మానసంబున నేని మఱి దేహమున నేని యొదవునాధివ్యాధి యొకఁడు లేదు । నాకు వెక్కసించు నాయీమహై

శ్వర్య । మింకఁబరులకైన నేమి చెప్ప । నేమికొదవ గాన నెట్లుగా నాకిది । ప్రా
ర్థనీయమనుచుఁ బలుక నేర్తు ॥ ౯ ॥ క ॥ కావున సంపద్విషయం । బై వేఁడుకొనం
గఁదగినయది లేదంత । ర్భావమున నాకుఁ దెలియం । గావలసినయర్థ మొకటి క
లదతిహితమై ॥ ౧౦ ॥ తే ॥ లక్షితము సేయ దేశకాలస్వభావ । విప్రకర్షంబు
లేక యీవిశ్వమెల్లఁ । గరతలామలకంబుగాఁ గనుచ నతీంద్రి । యప్రబోధంబు గల
పుణ్యులరయ మీరు ॥ ౧౧ ॥ క ॥ మీ యెఱుఁగని యర్థము లే । దీ యెడ
ననుమీర ననుగ్రహింపుడు రేని । నాయడుగు నర్థమునకుఁ గృ । పాయత్తమతి నె
సఁగవలయుఁ బ్రత్యుత్తరముల్ ॥ ౧౨ ॥ సీ ॥ అస్మదీయంబైన యాంగికంబగు
తేజ మతిలోకమై యున్న దద్భుతముగ । భావంబునట్టుల భగవత్పదాంభోజ భావ
నామృతపానపరవశంబు । మీకోడలైన యీ మెలఁతకు నాయట్ల తనుకాంతి హరిభ
క్తులనుపమములు । విశ్వైకవంద్య యీ యైశ్వర్యము నాకుఁ జోద్యమైన దనన్యసుల
భమగుట । నిట్టి మహిమలఁ బొందము న్నెట్టివార । మేమి సుకృతంబు చేసితి మిం
క మీఁది । భవమునందు నుసీ పెంపుఁబడయుట సును । పాయమెయ్యది వివరించి చెప
లుకవలయు ॥ ౧౩ ॥ వ ॥ అనిన నందఱు నట్టి విచిత్ర ప్రశ్నంబునకుం దగిన యుత్తరంబు
చెప్పుటకు నరుంధతీపతి ననుమతించి నియమించిన విజ్ఞానఖని యగు నమ్మహాత్ముండు
ను నివాతప్రదీపంబు రూపంబున ముహూర్తమాత్రం బుపరత బహిరింద్రియుండై
యోగసమాధివశంబున నయ్యర్థంబు గాంచి ప్రసాదసుముఖుండగుచు నభిముఖుం
డై మునిసభామధ్యంబున నందఱు వినుచుండ నమ్మహారాజచంద్రున కిట్లని చెప్పందొ
ణంగె ॥ ౧౪ ॥ క ॥ శూద్రుఁడవై తొలు మేనున । నుద్రిక్తచరిత్రస్థురోక్తుల
లోకో । పద్రవము చేసితి విన్నృప । భద్రేభసమస్తబంధుబాహ్యుఁడవగుచున్ ॥ ౧౫ ॥
క ॥ ఈ సతియు నాటిభవమున । నీసతియై నీవు దన్ను నిరసించినన । త్యాసక్త
యగుచు విడువక । చేసె భవత్ప్రీతికొఱకుఁ జెన్నొంటిపనుల్ ॥ ౧౬ ॥ సీ ॥ పై
తామహంబైన చేతి రొక్కము చెల్లునంతకు నుద్వృత్తినట్లు దిరిగి । పేదవై కృషి
చేసి పెట్టిన సస్యంబులెల్లఁ బొల్లైనఁ గొన్నాళ్లు నవసి । గతిలేక దాస్యంబు గైకొని
దాసి చే గ్రాసంబు నడవక కడుఁ గృశించి । కడఁ దిరిపంబవై కాంతయు నీవును దేశం
బులం దెల్లఁ దిరిగి తిరిగి । యంత నొకపట్టణమున విష్ణ్వాలయంబు । చేరి యొక కొం
దఱు చట వసించి పగఱు । యోగివరులుండ నిచ్చలుఁ జాఁగి మొక్కి । నిండు మతిఁ జే
సితి విహారలుండు నెలవు । లూడ్చి యును నీరు చల్లి యునాఁడిగములు ॥ ౧౭ ॥ వ ॥ ఇ
ట్లు మహాభాగవత సందర్శనంబునం జిత్తంబు సన్మార్గప్రవృత్తంబై దినదినంబును దదీ
య సేవాచరణంబునం దద్దర్శన తదాలాప శ్రవణంబుల వలన ననంతకాంతకంబూర్వ
దుష్కృతంబులవలన డెందంబులు నిరుపాధిక విష్ణుభక్తిప్రవణంబులై ॥ ౧౮ ॥ సీ ॥ ఉ
పభూమి నెవ్వరేసు మిసిన వీటి కాచర్వితాచుల నెత్తి చల్లి చల్లి । ప్రాకారవీధులఁ బ్ర

తివేళయందుననొదవెడుచెత్తవోనూడ్చియూడ్చి । కుండలసలిలంబుగొనివచ్చి దుమ్ముపోఁగలయంపిదోడ్తోనచిలికిచిలికి । మండలవేదికామండలంబులగోమ యంబునఁజల్లగానలికియలికి । పొలివిగుడిచుట్టుఁదగియున్నఁబొంగిపొంగి । మా సికనుపట్టుటకునాత్మరోసిరోసి । యంతరంగంబునందుఁదాదాత్మ్య మొదవి । చే సితిరిమీరువిష్ణుసంసేవనంబు ॥ ౧౯ ॥ వ ॥ మఱియును ॥ ౨౦ ॥ తే ॥ హరి సమీపప్రదీపికయారకుండ । భోజనాసీతతైలంబుఁబోసితీవు । నిజపటముచించి యొంపడంతియునువ్రత్తి । యోజితముచేసివెలిఁగించెనొకరునాడు ॥ ౨౧ ॥ వ॥ ఇట్లుఫలాభిసంధిరహితంబులైన హృదయంబులతో మీరలిరువురుసకలఫలసాధ నంబైనభగవత్పూజనంబుసేయుచుండునంత ॥౨౨॥ శా ॥ సేవార్థంబుగవచ్చెనచ్చ టికినిస్సీమక్రమక్రూరనా । నావాహద్విపవీరయోధరథసన్నాహంబుతోరత్న భూ । షావిస్ఫూర్తులతోఁగళత్రశిబికాచంచత్సహస్రంబుతో । సౌవీరాఖ్యమహీ మహేంద్రుఁడుమదస్తంబేరమారూఢుఁడై ॥ ౨౩ ॥ క ॥ వచ్చినయద్ధరణీధవు । నచ్చెరువొదవించువిభవమదిగనుఁగొనిసం । పచ్చరితార్థుండితఁడని । ముచ్చట నొందితిరిమీరుమోహమువలనన్ ॥ ౨౪ ॥ క ॥ అదిగారణముగనిష్ట । ప్రదమై హరిసేవనేటిభవమునసీయ । భ్యుదయంబొనర్చెభగవ । త్పదసేవచతుర్విధేష్ట ఫలదముగాదే ॥ ౨౫ ॥ క ॥ తనువులఁబవిత్రకాంతియు । మనములవిజ్ఞానరూ పమధురిపుభక్తిన్ । జనియింపఁజేసెమీకి । ట్లనుపమదీపప్రదానమదినృపతిల కా ॥ ౨౬ ॥ వ ॥ అట్లగుటనింకముందటిభవంబునకునిట్టియైశ్వర్యంబొకండేలధ ర్మార్థకామమోక్షంబులందేదిగోరిన నట్టిచతుర్విధఫలంబులకు భగవత్సేవాచర ణంబొకండుసాధనంబగుట వివిధాఖిలకర్మంబులుభగవత్సేవాచరణరూపంబులు గాఁ గావింపుమభిమతంబొనరించుననిన నాశ్చర్యహర్షకబళితాంతఃకరణుండ గుచునృపశ్రేష్ఠుండువసిష్ఠునకిట్లనియె ॥ ౨౭ ॥ తే ॥ వివిధఫలబీజమై యేకవిధముక్రియయు । వివిధకర్మంబులకునేకవిధఫలంబు । గలుగునట్లుగత రుబీజఫలములందు । నీదృశవ్యత్యయముగంటిమెట్లునెచట ॥ ౨౮ ॥ఆ॥ ఇదియె కామశాస్త్రమెఱిఁగించుప్రతికర్మ । మునకుభిన్నభిన్నముగఫలంబు । నట్లుకాఁగఁ దెలియనానతియిమ్ముక । ర్మస్వరూపమెల్లమౌనిచంద్ర ॥ ౨౯ ॥క॥అనవినిభూవరు ప్రశ్నం । బునకెంతయుమెచ్చిమౌనిపుంగవుఁడనియెన్ । జనవరక్రియాస్వరూ పం । బనయముబుధులకునుగహనమదివినుతెలియన్ ॥ ౩౦ ॥ వ ॥ కర్మంబు లుదృష్టద్వారోపకారకంబులు నదృష్టద్వారోపకారకంబులు ననరెండుదెఱంగు లైయుండుదృష్టద్వారోపకారకంబులెల్లలౌకికంబులు నదృష్టద్వారోపకారకంబు లెల్లవైదికంబులనంబడునట్టివైదికకర్మంబులు నిత్యనైమిత్తికకామ్యప్రభేదంబులం ద్రివిధంబులైయుండునందుఁజేయకుండినంబ్రత్యవాయంబైవర్ణాశ్రమాది ప్రయు

క్తంబులగుచుఁ బ్రతిసమయంబునం జేయవలయునవి నిత్యంబులనంబడు. అట్టివయై కదాచిత్కర్మనిమిత్తంబులయందుఁ జేయవలయునవి నైమిత్తికంబులనంబడు. చేయకుండినం బ్రత్యవాయంబు లేనియవి కామ్యంబులనంబడు. అందు నిత్యనైమిత్తికంబులకుఁ గర్తృభేదంబున విహితత్వంబును సహకారిత్వంబున నాకారభేదంబునుగల దట్టికర్తయనతిరిక్తఫలకామియు నతిరిక్తఫలకామియుననద్వివిధంబు. అనతిరిక్తఫలకామియనఁ నీశ్వరాజ్ఞారూపంబులైన యవియాచరించుటయతనకుఫలంబుగాఁదదతిరిక్తఫలంబు గోరనియతం డతనికిం గేవలవిహితత్వాకారంబున సిద్ధించు నతిరిక్తఫలకామియన నాచరణంబ కాక తదతిరిక్తంబైన ఫలంబపేక్షించునతండు. అతనికి నాచరణీయత్వంబు విహితత్వాకారంబున సిద్ధించుచు నభిమతఫలసాధనభూతకర్మాంతరాధికార జనకంబు నగుట సహకారిత్వాకారంబు నసహకారిత్వాకారంబునుంగా నుభయాకారంబుల సిద్ధించు - ఇంకఁ గామ్యకర్మంబులునియతఫలంబులు ననియతఫలంబులననద్వివిధంబులు. అందు నియతఫలంబులనఁదమకు విహితంబులైన ఫలంబులందె కాని ఫలాంతరంబులందు వినియుక్తంబుగానియవి. అనియతఫలంబులనంబూర్వోక్తనియతఫలంబులకు వ్యతిరిక్తంబుగా సంకల్పానురూపఫలంబులం బొడమించునవి. ఇట్టినియతానియత ఫలంబునుం గర్తృగతగుణత్రయభేదంబున సాత్వికంబును రాజసంబును దామసంబునన మూడు దెఱంగులై యుండు నందు సాత్వికఫలంబు బ్రహ్మవిద్యానిష్పత్తి రాజసంబు స్వర్గాదిప్రాప్తి తామసంబు నంబరహింసాదికంబు. అట్లుగావున నిం దదృష్టద్వారోపకారకంబులైన లౌకికకర్మంబులుం బోలె నియతఫలంబులైన కామ్యకర్మంబులు ఫలబీజన్యాయంబున నన్యథాసిద్ధిజన్యజనకభావంబునం గలయవిగా నియితరకర్మంబులెల్లం గర్తృసంకల్పానురూపఫలప్రదాయకంబులగుట వివిధఫలోత్పాదనంబునకు నేకకర్మంబ బీజంబుగా నేర్చు వివిధకర్మంబులు నేక ఫలోత్పాదకంబులుగా నేర్చుననినర్థాంగీకారంబునం బార్థివోత్తముండు వెండియు నిట్లనియె ॥ ౩౧ ॥ సీ ॥ అధికారజనకంబులై నిత్యనైమిత్తికములు కామ్యములంగకములునంట । యాకామ్యములు దేవతారాధనాకృతులం దనదృష్టంబులనుట దత్త । దారాధ్యహిత దేవతానుగ్రహములఁ దద్ద్వారంబున నుఫలావాప్తియనుట । సకలఫలప్రదుండొకఁడెట్టులోకఫలం బెట్లు పల్వురనుగ్రహింప వెలయు । ననుటవివిధదేవతారాధనాకార । కర్మవితతియందొకండు నిఖిల । ఫలమనేక ఫలము బహుకర్మములకిచ్చు । ననుట పొసఁగకున్న దాత్మననఘు ॥ ౩౨ ॥ వ ॥ అనిననతని ప్రజ్ఞావిశేషంబున కలరి యారాధనస్వరూపంబుగతి నారాధనీయస్వరూపంబు వినక యీసందియంబు దెగదు వినుమని యిట్లనియె ॥ ౩౩ ॥ తే ॥ భగవదారాధనక్రియాప్రకరమెల్ల । నిఖిలకర్మ సమారాధనీయుఁ డతఁడ । యఖిలవివిధఫలప్రదాయకుఁ డతండ । య

ఖిలదేవతలకునంతరాత్ముఁడతఁడ ॥ ౩౪ ॥ ఉ ॥ దేవతలెందఱందుఁ దదీయశరీ
రములట్లుగానఁద । త్సేవతదర్చనంబయని సేవకులాత్మ నెఱుంగకున్నఁద । త్సే
వతదర్చనంబగుటసిద్ధముగానవిభుండయిచ్చుఁద । ద్దైవతమాత్రభక్తియునుదత్త
దభీష్టఫలంబుదానికిన్ ॥ ౩౫ ॥ క ॥ యజ్ఞములకెల్లభోక్తయు । యజ్ఞఫల
ప్రదుఁడునతఁడయనియెఱుఁగమిన । ల్పజ్ఞులగునితరదైవము । యజ్ఞులుగూలుదు
రుకుడిచియల్పఫలంబుల్ ॥ ౩౬ ॥ క ॥ తనుభజియించినదైవము । తమకుం
బ్రాప్యంబుగానదైవంబుఁదద । న్యముఁగొల్చుమూఢమతులకు । సమకొను
ఫలమల్పతమముసవినాశంబుల్ ॥ ౩౭ ॥ ఆ ॥ ప్రాగనాదికర్మబద్ధులై
తుచ్ఛకామములచేతవిష్ణుమఱచిజడులు । కేవలముఁదదన్యదేవతామాత్రాను ।
షక్తులగుచుఁగొలుతురుక్తవిధుల ॥ ౩౮ ॥ తే ॥ క్షణికమునుపాధిబంధ
తుచ్ఛంబునైన । త్రిగుణమయభోగ్యజాతంబుదృష్టిఁదగిలి । నిత్యనిరుపాధిని
రవధిసిఖిలరూప । భోగ్యమగునాత్మ నెఱుఁగ దెప్పుడునుజగము ॥ ౩౯ ॥ తే ॥
నిరధికానందనిత్యులాహరిగుఱించి । యితరులగుఱించిసంభిన్నహీనసుఖులు ।
కర్మమొకట(ఁ)డఫలవిభాగములుపెకట । చిత్రమిదిచూడుసంకల్పమాత్రభిన్న
ను ॥ ౪౦ ॥ వ ॥ అట్లగుటనంతరాత్మనెఱుంగనియప్పుడు తత్తద్దేవతారాధనరూ
పంబులైనవివిధంబులగుకర్మంబులంతరాత్మ యొకఁడభగవంతుండనియెఱింగి
తదారాధనరూపంబులుంగా నొనరింపనభిమతైకఫలబీజంబులుగా నేర్చు. అభిమ
తవివిధ ఫలప్రదాయకభగవదారాధనరూపంబగుట నేకర్మంబును వివిధఫలంబుల
కుబీజంబునుంగా నేర్చు. కావుననవశ్యంబును మొదలనారాధనీయుండగు భగ
వంతు నెఱుంగవలయు. కేవల దేహాత్మాభిమానమూలంబులగుభగవద్విషయరా
గద్వేషములు కర్మహరంబులుగా నేర్చుఁగానిఁదత్స్వజ్ఞతాభిమానంబునభగవంతు
నన్యథారూపంబున నొండె విపరీతరూపంబున నొండె నెఱింగె నేని తన్మూలత
ద్విషయద్వేషం బధోగతికారణంబగుట గణింపనేల తన్మూలరాగకార్యంబుల
గుతదారాధనస్మరణకీర్తనాదులువిఫలంబులగునింతియకామ తాదృగ్విధవిరుద్ధజ్ఞా
నంబునం బ్రత్యవాయంబునగుట యథావస్థితవస్తుజ్ఞానంబున నెఱింగి యారాధిం
పవలయు భగవత్స్వరూపంబాకర్ణింపుము ॥ ౪౧ ॥ సీ ॥ సర్వశరీరనిషర్త్రికే
తరసర్వశబ్దాభిలాప్యుండుసర్వకార్య । సర్వహేతువుసర్వశాస్త్రీయధర్మస
మారాధ్యదైవతంబఖిలఫలదుఁ । డఖిలాత్మలకువాస్తవాభిగమ్యుఁడుముముక్షు
వులకాశ్రయముముక్తులకుఁబ్రాప్య । మఖిలప్రకారనిరతిశయభోగ్యంబువివిధవే
దాంతైకవేద్యతముఁడు । నిఖిలవిషయంబులకుఁబ్రత్యనీకమగుట । సకలకల్యాణ
గుణగణాస్పదుఁడునగుట । లక్షితస్వాన్యవస్తువిలక్షణుండు । విభుఁడుపురుషో
త్తముఁడురమావిభుఁడువెలుఁగు ॥ ౪౨ ॥ సీ ॥ అగులక్షణములనన్యార్థీవచేత

నానాధారభావముల్ వ్యాప్తిమీఱ । నవబోధసత్యసుఖామలత్వాదులురూఢస్వ
రూపనిరూపకములు । సిద్ధస్వరూపవిశేషధర్మజ్ఞానశక్తివైరాగ్యాదిషడ్గుణము
లు । షడ్గుణానంతవిస్తారభేదములుసౌశీల్యాదినిత్యనిశ్శీమగుణము । లఖిలజగదు
దయపాలనహరణములును । నిగ్రహానుగ్రహంబులునియతకరుణ । నాచరించు
టముఖ్యకృత్యంబులరయఁ । బరమపదపూర్వమైయొప్పుబ్రహ్మమునకు ॥ ౪౩ ॥
సీ ॥ శ్రీవల్లభుఁడుసూక్ష్మచిదచిద్విశిష్టతఁదానయాజగమునుపాదానమయ్యెఁ । బ్ర
హ్మమునాత్మసంకల్పవిశిష్టతఁదానజగన్నిమిత్తంబులయ్యెఁ । కాలాదులగుసహకా
రులకాత్మయైతాజగత్సహకారితయువహించె । మహదాదికారణాత్మతఁదానవెం
డియుఁదత్కార్యకారణత్రయమునయ్యె । సూక్ష్మచిదచిద్విశిష్టవస్తువునిజేచ్ఛ ।
నామరూపవిభాగార్హనటనమునకు । స్థూలచిదచిద్విశిష్టమైతోఁచుఁగానఁ । గా
ర్యవస్తువుదానయ్యెఁగైటభారి ॥ ౪౪ ॥ తే ॥ ఆత్మసంకల్పమహిమచేనవ్విభుండు ।
స్వాపృథక్సిద్ధచిదచిద్ద్వయంబునందుఁ । జూపుఁబరిణామమాత్మస్వరూపమునకుఁ ।
గలుగకుండుటఁదానిర్వికారుఁడగుచు ॥ ౪౫ ॥ ఆ ॥ నిర్వికారమయ్యెనిజవపుఃప
రిణామ । భాజియైనయట్టిబ్రహ్మమునకుఁ । గలుగుప్రాగవస్థకారణభావంబు ।
భావ్యవస్థకార్యభావమయ్యె ॥ ౪౬ ॥ క ॥ ప్రకృతిపురుషులుతదీయులు । ప్రకృ
తిపురుషమూలమీప్రపంచంబగుటన్ । బ్రకటమతిఁజూడఁదదితర । సకలముఁద
జ్జనితమింతసత్యమసుమ్మీ ॥ ౪౭ ॥ క ॥ చేతనముశేషమతనికిఁ । జేతనశేషం
బుమఱియచేతనమగుటన్ । జేతనకులమునకఖిలా । చేతనములకతఁడసర్వశే
షితలంపన్ ॥ ౪౮ ॥ తే ॥ తలఁపశేషిత్వకారణత్వములునెట్టు । లట్లుమఱిబో
ధశక్తిబలాదిసుగుణ । యుక్తినాతండకానివేఱొకఁడుఁగలుగ । దతనికంటెనుబ
రతరంబైయణువును ॥ ౪౯ ॥ ఆ ॥ నలినభవునిపిదపనామరూపవిభావ । నా
ర్హయగుతమఃపదాభిలాష్య । ప్రకృతిదగుఁదదీయఁబ్రాపించునతనిసం । కల్పము
ననభూతగణమువింటె ॥ ౫౦ ॥ క ॥ ప్రకృతివిచిత్రతనానా । వికృతులఁబుట్టిం
చిసర్గవేళలమరలం । బ్రకృతివశావశులగునీ । సకలాత్మలఁబొడమనతఁడసంక
ల్పించున్ ॥ ౫౧ ॥ తే ॥ అవిదితాకారముననంతరాత్మయగుచుఁ । దన్నుధరి
యించినియమించితననునతఁడ । దేహియగుఁగానిజగముదాదేహమయ్యె । నత
నికుపకారకంబుగాదధిపచంద్ర ॥ ౫౨ ॥ క ॥ ధారకుఁడైననువేదొక । భారము
సంకల్పముననభరియించునసా । ధారణముచూడుమవ్విభు । ధారకభావంబులే
మతకొఁకరునకున్ ॥ ౫౩ ॥ క ॥ సాగరనియమంబిందువి । భాగముసౌదామి
నీవిభంగముఘనసం । యోగమురవిగతిపవనస । మాగమమివిగావెవిష్ణుమా
యాప్రౌఢుల్ ॥ ౫౪ ॥ క ॥ భూతంబులెల్లఁదత్తనుభూతములతఁడాత్మభావ
మునఁదద్వ్యతమో । హేతుండైపొలుచుఁదదు । ద్భూతస్థితివిలయహేతుభూ

